# ఎన్నికలు - ప్రజాస్వామ్యం

మానవహక్కుల వేదిక ప్రచురణ

**Human Rights Forum Publication**

ప్రచురణ సంఖ్య : 41

ప్రచురణ కాలం : అక్టోబర్ 2017

కాపీలు : 1000

వెల : 80 రూపాయలు

 : మోహన్

**ప్రతులకు:**

**ఎస్. జీవన్ కుమార్**

ఫోన్: 040-27039519, సెల్: 9848986286

Email: kumjeevan@gmail.com

**వి. వసంతలక్ష్మి**

ఫోన్ : 040-23537969

Email: vasantha.aj@gmail.com

**నవోదయ, నవ తెలంగాణ, ప్రజాశక్తి బుక్‌హౌస్‌లు**

**ముద్రణ :**

అనుపమ ప్రింటర్స్, గ్రీన్ వ్యూ,

126 శాంతినగర్, హైదరాబాద్ - 28

ఫోన్: 23391364, 233041941

Email: anupamaprinters@yahoo.co.in

మా వెబ్‌సైట్: www.humanrightsforum.org

బాలగోపాల్ రచనల కోసం : www.balagopal.org

# మా మాట

"పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని ప్రాతినిధ్య పాలన అనే సూత్రం చాలా విలువైనదనీ, దానంతటదే 'బూర్జువా' లక్షణం కాదనీ నేను నమ్ముతున్నాను. దానిని మెరుగుపరుచుకోవడంలోనే భవిష్యత్తు ఉంది తప్ప తిరస్కరించడంలో లేదని నేను నమ్ముతున్నాను" అని బాలగోపాల్ 1997లో కె.వి. రమణారెడ్డి గారికి రాసిన ఒక లేఖలో చెప్పారు. అంతకు చాలా ముందు నుండి కూడా ఆయన ఎన్నికలను చాలా సీరియస్‌గా తీసుకున్నారనడానికి నంద్యాల పార్లమెంటరీ ఉపఎన్నికపై, ఆ తర్వాత పాణ్యం అసెంబ్లీ ఉపఎన్నికపై 1991, 1993లలో నిజనిర్ధారణ జరిపి వెలువరించిన కరపత్రాలే నిదర్శనం. మొదటిది పి.వి. నరసింహారావును గెలిపించడానికి, రెండోది కోట్ల విజయభాస్కరరెడ్డిని గెలిపించడానికి జరిగిన ఉపఎన్నికలు.

అప్పటినుండి 2009లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అసెంబ్లీకి జరిగిన ఎన్నికలపై 'అదే పాలన, అదే విధ్వంసం' పేరుతో రాసిన వ్యాసం వరకు కూడా ఎన్నికలు వచ్చిన ప్రతి సందర్భంలోనూ బాలగోపాల్ ప్రజల తరఫున పాలకులకు ప్రశ్నలు సంధిస్తూనే ఉన్నారు. తెలుగులోనే కాదు ఆంగ్లంలోనూ ఎన్నికలపై అనేక వ్యాసాలు రాశారు. బలమైన ప్రజాస్వామ్యానికి న్యాయమైన ఎన్నికలు ఎంత అవసరమో ఈ వ్యాసాలలో మళ్ళీ మళ్ళీ చెబుతూనే వచ్చారు.

ఎన్నికలు జరుగుతున్న పద్ధతి గురించి బాధపడుతూ ఒక చోట "ముస్లింలపైన ద్వేషం రెచ్చగొట్టి 'హిందువు' అనే పేరు మీద వోటర్లను సమీకరించే రాజకీయం, అసంఖ్యాకమైన హవాలాల నుండి కూడబెట్టుకున్న వందల కోట్ల రూపాయలు వెదజల్లి వోట్లు కొనుక్కునే రాజకీయం, సినిమా స్టార్లను ఊరేగించి వోట్లడిగే రాజకీయం, మృతనాయకుల అసలు వారసులు తామేనని దబాయించి వోట్లు దండుకునే రాజకీయం, రౌడీమూకలను పోషించి బాంబులు వేసి రిగ్గింగ్ చేసి ప్రజల వోట్లను తామే వేసుకునే రాజకీయం – ఈ రకమైన రాజకీయాల మధ్య జరిగే వీధి కొట్లాటలకూ, ప్రజాస్వామ్య రాజకీయ సంవాదానికీ పోలిక ఏమైనా ఉందా? దీనినే ప్రజాస్వామ్యం అని తాము నమ్మడమే కాక మనల్ని కూడ నమ్మింపజూస్తున్న మేధావులను, పత్రికలను ఏమనాలి?"

అని కోప్పడుతూనే "ఎన్నికల వ్యవస్థ కోల్పోయిన సార్థకతను దానికి తిరిగి కల్పిద్దాం. ఏ పార్టీ గెలుస్తుందన్న మీమాంస వదిలిపెట్టి ప్రజాస్వామ్యాన్ని గెలిపించుకుందాం" అని ప్రజలను కర్తవ్యోన్ముఖుల్ని చేస్తారు.

అందరూ సుస్థిర ప్రభుత్వాల కోసం ప్రచారం చేస్తున్న సమయంలోనే సుస్థిర ప్రభుత్వాల వల్ల రాగల ముప్పు గురించి బాలగోపాల్ పదే పదే హెచ్చరించారు. 'అపరిపక్వతే సమస్య, అస్థిరత కాదు' అని హితవు చెప్పారు. ఇప్పుడున్న ప్రపంచ పరిస్థితులలో భారతదేశంలో సుస్థిర ప్రభుత్వం ఏర్పడితే అది దేశ ఆర్థిక విధానాలను సమూలంగా మార్చేసే ప్రమాదముందని, దేశ సార్వభౌమత్వాన్నే తాకట్టు పెట్టే పెనుముప్పు ఉందని అన్నారు. అది ఎంత నిజమో 2014 ఎన్నికల తర్వాత మనకు అర్థమవుతూనే ఉంది. కేంద్రంలో, మన రెండు తెలుగు రాష్ట్రాలలో సుస్థిర ప్రభుత్వాలు ఏర్పడ్డాక ఏం జరుగుతోందో మనం చూస్తూనే ఉన్నాం. ఏకపక్ష నిర్ణయాలు, ప్రజాభిప్రాయానికి ఏ మాత్రం విలువ ఇవ్వకపోవడం, అసమ్మతిని సహించలేకపోవడం, మీడియాను పూర్తి నియంత్రణలో ఉంచుకోవడం మొదలైన అవలక్షణాలన్నీ కళ్ళముందే కనిపిస్తున్నాయి. 'ఇవాళ సుస్థిర పాలన అంటే గ్లోబలైజేషన్ తప్ప వేరే ఏమీ కాదు' అని ఆయన తన చివరి వ్యాసంలోనూ అన్నారు.

కశ్మీర్ ఎన్నికల గురించి బాలగోపాల్ రాసిన వ్యాసాలు 'కశ్మీర్‌పై బాలగోపాల్' (హెచ్.బి.టి. ప్రచురణ, 2016) పుస్తకంలో ఉన్నందువల్ల వాటిని ఇందులో చేర్చలేదు.

చివరగా – "సామాజిక సంబంధాలలో మార్పుకు దోహదపడే లక్షణంతోపాటు ప్రజలపట్ల పరిపాలనలో జవాబుదారీతనాన్ని కల్పించే ప్రయోజనం కూడ ఎన్నికల ప్రజాస్వామ్యానికి ఉండాలి. అది మన దేశంలో చాలా అపరిపూర్ణంగా ఉందనేది వాస్తవం. ఏమైనా చేసి, ఏమైనా మాట్లాడి చలాయించుకోవచ్చునని మన దేశ రాజకీయ నాయకులు భావిస్తున్నారు. వాళ్ళట్లా భావిస్తున్నారనేది విశేషం కాదు. భావించగలుగుతున్నారనేది బాధాకరమైన వాస్తవం. ఈ పరిస్థితిని సవరించడానికి క్రియాశీలకమైన కృషి జరగవలసిన అవసరం చాలా ఉంది" అన్న ఆయన మాటలను గుర్తుచేసుకుందాం. ఇంతకంటే ఏం చెప్పగలం? ప్రజాస్వామ్య వాదులందరి ఆకాంక్షా అదే.

**మానవహక్కుల వేదిక**

26 సెప్టెంబర్ 2017

# ఇందులో...



# ‘తెలుగుబిడ్డ’ గెలుపు కోసం ‘తెలుగుసత్తా’ ప్రదర్శనం



**తెలుగు ప్రజలారా!**

‘తెలుగు బిడ్డను గెలిపిద్దాం, తెలుగు సత్తా చూపిద్దాం’ అన్న నినాదంతో రాష్ట్ర కాంగ్రెస్(ఐ) యంత్రాంగం నంద్యాలలో పి.వి. నరసింహారావును గెలిపించడానికి రంగంలోకి దిగింది. ఆ సత్తా ప్రదర్శన ఏ విధంగా జరుగుతూ వుందో మీరంతా తెలుసుకోవటం అవసరం. గతంలో హర్యానాలోని మేహంలో దేవీలాల్ కుటుంబం అధికారాన్ని కాపాడటానికి ఎన్నికల రోజున దౌర్జన్యం జరగగా, ఇప్పుడు పి.వి. నరసింహారావు ప్రధానమంత్రిగా కొనసాగడం కోసం నామినేషన్ల దశలోనే దౌర్జన్యకాండ మొదలయింది. ‘మన వాడు’ అన్న దురభిమానంతో మనం మౌనంగా ఉండిపోతే ప్రజాస్వామ్య విలువలకూ, వ్యవస్థకూ ఘోరమయిన అపచారం చేసినవాళ్ళమవుతాము.

పి.వి. నరసింహారావును ఏకగ్రీవంగా గెలిపించడం కోసం నామినేషన్ వేయడానికి వచ్చిన అభ్యర్థులను కాంగ్రెస్(ఐ) నాయకులూ, కర్నూలు జిల్లా అధికార యంత్రాంగమూ ఏ విధంగా ఆటంకపరిచారో పత్రికలలో చూసే ఉంటారు. ముందుగా ప్రతిపక్ష పార్టీలను పోటీచేయవద్దని అభ్యర్థించారు. ‘తెలుగువాడు’ అన్న దురభిమానాన్ని ఎరగా చూపారు. స్వతంత్ర అభ్యర్థులకు ఆపాటి గౌరవం కూడ లేకుండా చాలా దౌర్జన్యంగా అటకాయించారు. రాయలసీమ రైతు సంఘం అధ్యక్షుడు శీలం సంజీవరెడ్డిని కలెక్టరేట్ ఆవరణలోనే అపహరించి నాలుగు రోజులు అజ్ఞాతంగా నిర్బంధించి నామినేషన్ వేయకుండా ఆపారు. ఆత్మకూరుకు చెందిన అడ్వకేట్ హనుమంతరెడ్డిని

డి.ఆర్.వో సమక్షంలోనే తుపాకీతో కొట్టి అపహరించుకుపోయారు. నానా తిట్లు తిట్టి మూడురోజులు అజ్ఞాతంగా నిర్బంధించి నామినేషన్ వేయకుండా చూశారు. హైదరాబాద్‌కు చెందిన అడ్వకేట్ కోటిరెడ్డిగారు బిజెపి వారితో కలిసి వచ్చి నామినేషన్ 'విజయవంతంగా' వేసినందుకు ఆగ్రహించి నామినేషన్ ఉపసంహరణ దినాన హైదరాబాద్‌లో ఆయన కుమారుని మీద దాడిచేసి వారి కారును ధ్వంసం చేశారు. కర్నూలుకు చెందిన 'ఈనాడు' విలేకరి సూర్యప్రకాశ్‌ను కలెక్టర్ గది నుండే కిడ్నాప్ చేసే ప్రయత్నం చేశారు. హైదరాబాద్‌కు చెందిన టీచర్ మస్తాన్ సాహెబ్‌ను కలెక్టరేట్ కాంప్లెక్స్‌లోనే మూడురోజులు నిర్బంధించారు. అతను బిజెపి వారి సహాయంతో విముక్తి పొంది అతి కష్టంమీద నామినేషన్ కాగితాలు చేజిక్కించుకోగా, అతన్ని కలెక్టర్ కార్యాలయం బయటే కిడ్నాప్ చేసి తీసుకుపోయారు. మరొక ఏడుగురికి ఇదే గతి పట్టించారు.

ప్రజాస్వామ్య విలువలను ఇంతగా భ్రష్టుపట్టిస్తూ వుంటే మనం చూస్తూ ఊరుకోవడానికి వీలు లేదు. అన్యాయంగానయినా, అక్రమంగానయినా సరే 'తెలుగుబిడ్డ'ను గెలిపించటం తెలుగువాళ్ళందరి బాధ్యత అనే కుతర్కాన్ని మౌనంగా ఆమోదించటానికి వీలు లేదు. ఈ కింది కనీస చర్యలు వెంటనే తీసుకోవాలని ప్రజాస్వామికవాదులంతా ఐక్యంగా ఉద్యమించడం అవసరం.

**1.** అందరికీ నామినేషన్లు వేసే అవకాశం ఇవ్వకుండా ఎన్నికలు జరిపిస్తే ఆ ఎన్నికలు చెల్లవు. పి.వి. నరసింహారావు ఒకవేళ గెలిచినా ఆ గెలుపు చట్టబద్ధమయినది కాదు. కాబట్టి ఇప్పటికే వేసిన నామినేషన్లను రద్దుచేసి తిరిగి ఎన్నికల తేదీ ప్రకటించి కొత్తగా నామినేషన్లు ఆహ్వానించాలి. ఈసారి అందరికీ స్వేచ్ఛగా పోటీచేసే అవకాశం కల్పించాలి. కిడ్నాప్‌కు గురయిన అభ్యర్థులు పెట్టిన ఈ డిమాండ్ గురించి ఎన్నికల కమిషన్ నుండి వచ్చిన డిప్యూటీ కమిషనర్‌గారు ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోవడం శోచనీయం.

**2.** జిల్లాకు చెందిన పలువురు కాంగ్రెస్(ఐ) నాయకులు ఈ నేరాలకు పాల్పడ్డారు. వారిలో ముఖ్యులు రాష్ట్ర కాంగ్రెస్(ఐ) ప్రధాన కార్యదర్శి కొత్తకోట ప్రకాశ్‌రెడ్డి, కర్నూలు మునిసిపల్ ఛైర్మన్ సుధాకర్‌బాబు, వీరు కాక పత్తికొండ ఎం.ఎల్.ఏ శేషిరెడ్డి, కోడుమూరు ఎం.ఎల్.ఏ మదనగోపాల్, మాజీ ఎం.ఎల్.సి రఘురాంరెడ్డి, మాజీ ఎం.పి. గంగుల ప్రతాపరెడ్డి, కేంద్రమంత్రి కుమారుడు కోట్ల సూర్యప్రకాశ్‌రెడ్డి తదితరులు ఉన్నారు.

వీళ్ళు చేసిన నేరాలు అపహరణ, అక్రమ నిర్బంధం, భౌతిక హింస మొదలయినవి. ఒకరిద్దరి మీద కాదు, కనీసం 12 మంది మీద ఈ నేరాలకు పాల్పడ్డారు. వీరిలో న్యాయవాది హనుమంతరెడ్డి (ఆత్మకూరు), కోటిరెడ్డి (హైదరాబాద్), రైతు నాయకుడు శీలం సంజీవరెడ్డి తమ మీద జరిగిన దౌర్జన్యాలను పత్రికల వారికి వివరంగా చెప్పారు. అయినా ఈ నేరస్తులను ఇప్పటిదాకా అరెస్టు చేయకపోవడం సిగ్గుచేటు.

ఈ నేరస్తులంతా కేంద్ర న్యాయశాఖ మంత్రి విజయభాస్కరరెడ్డి అనుయాయులనేది అందరికీ తెలిసిన విషయమే. అయినా వారు గానీ పి.వి. నరసింహారావు గానీ ఇప్పటి వరకు ఈ నేరాలను ఖండించలేదు. ఈ నేరాలు వారి ఆమోదంతో జరిగినవి కాకపోతే తిరిగి నామినేషన్లు స్వీకరించమని వారెందుకు ఎన్నికల యంత్రాంగాన్ని కనీసం కోరడం లేదు? తాను అధ్యక్షునిగా ఉన్న పార్టీ నాయకులు గూండాయిజానికి పాల్పడితే దండించలేని పి.వి. నరసింహారావుకు దేశాన్ని ఏలే అర్హత వుందా? గూండాయిజం చేయించి ఎన్నికైతే ప్రధానమంత్రిగా కొనసాగే నైతిక అర్హత వుంటుందా?

**3.** రాజకీయ నాయకుల సిగ్గుమాలినతనం ప్రజలకు అలవాటైపోయింది గానీ అధికార యంత్రాంగం ఇంతగా దిగజారడం ఈ మధ్యకాలంలో ఎప్పుడూ చూడలేదు. జిల్లా కలెక్టర్ కార్యాలయాన్నీ, సమాచార భవన్‌నూ కాంగ్రెస్(ఐ) కార్యదర్శి ప్రకాశ్‌రెడ్డి, కర్నూలు మునిసిపల్ చైర్మన్ సుధాకర్‌బాబు అక్టోబర్ 11 నుండి 18 దాకా తమ కిరాయి గూండాలకు హెడ్‌క్వార్టర్స్ చేసుకున్నారు. ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్ హోదాగల కలెక్టర్ తదితర రెవెన్యూ అధికారులంతా వస్తూపోతూనే ఉన్నారు. వాళ్ళ కనుసన్నలలోనే వీళ్ళ గూండాయిజం సాగుతూ వుంది. మస్తాన్ వలీని కలెక్టర్ కార్యాలయంలోనే నిర్బంధించారు. ఆయన చేతికి నామినేషన్ పత్రాలు యిచ్చిన తర్వాత కూడ ఆ కార్యాలయం నుండే అతనిని కిడ్నాప్ చేశారు. హనుమంతరెడ్డిని డి.ఆర్.వో సమక్షంలోనే పట్టుకొని కొట్టి అపహరించుకుపోయారు. గ్వాలియర్ నుండి వచ్చిన ఒక వ్యక్తిని కూడ కలెక్టర్ ఆఫీస్ ఆవరణ నుండే ఎత్తుకుపోయారు. 'ఈనాడు' విలేకరి సూర్యప్రకాశ్‌ను డి.ఆర్.వో, కలెక్టర్‌లు చూస్తుండగానే ఎత్తుకుపోయే ప్రయత్నం చేశారు.

ఈ నేరాలను ఆపలేకపోగా, ఇప్పటివరకు ఈ అధికారులు నేరస్తులను అరెస్టు సహితం చేయించలేకపోయారంటే వాళ్ళ విధి నిర్వహణను ఏమని పొగడాలి? వాళ్ళు మేజిస్ట్రేటు హోదాగల రెవెన్యూ అధికారులా లేక కాంగ్రెస్(ఐ) పార్టీ కిరాయి మనుషులా?

కిడ్నాప్ అయినవారే కాక నామినేషన్ వేసే దశను చేరుకొని కూడ ముగ్గురు వ్యక్తులు కలెక్టరు, డి.ఆర్.వోల పుణ్యాన అభ్యర్థులు కాలేకపోయారు. కృష్ణాజిల్లా నుండి వచ్చిన తోటకూర శివశంకర వీరాంజనేయులకు ఉయ్యూరు ఎం.ఆర్.వో ఇచ్చిన సర్టిఫికేట్ చెల్లదని చెప్పి వెనక్కి పంపించారు. తాము సర్టిఫికేట్లు ఎప్పుడూ ఆ విధంగానే ఇస్తున్నామని అక్కడి ఎం.ఆర్.వో అంటున్నారు. 'ఈనాడు' విలేకరి సూర్యప్రకాశ్‌కు సర్టిఫికేట్ దక్కనివ్వకుండా చేశారు. తమిళనాడు నుండి వచ్చి నామినేషన్ వేసిన వీరప్పన్ గౌండర్ దొంగ సంతకాలు పెట్టించాడని నామినేషన్ తోసిపుచ్చడమే గాక అతని మీద కేసు కూడ పెట్టారు. ఇదంతా స్వయంగా కలెక్టర్, డి.ఆర్.వోలు చేసిన పని. నంద్యాల ఉపఎన్నికను భ్రష్టు పట్టించడంలో వాళ్ళకు ప్రత్యక్షపాత్ర ఉంది. ఎవరు నామినేషన్ కాగితాల కోసం పోయినా అక్కడుందని ఇక్కడా, ఇక్కడుందని అక్కడా చెప్పి, తిప్పించి వాళ్ళు అటూ ఇటూ తిరుగుతున్నప్పుడు కిడ్నాప్ చేయడానికి అవకాశం ఈ అధికారులే కల్పించారని బాధితులంతా అంటున్నారు.

ఇక పోలీసుల గురించి కొత్తగా చెప్పేదేమీ లేదు. ఎవరు కాంగ్రెస్(ఐ) గూండాలో, ఎవరు పోలీసులో తేడా తెలియనంతగా ఇద్దరూ కలిసిపోయి అపహరణలు చేశారు. శీలం సంజీవరెడ్డినయితే పోలీసులే పట్టుకొని కిడ్నాపర్లకు అప్పజెప్పారు. కొడుతున్నప్పుడూ, జీపులో వేసి తీసుకుపోతున్నప్పుడూ పోలీసులూ, గూండాలూ కలిసే ఉన్నారని బాధితులంతా చెప్పారు.

తెలుగువాడు ప్రధానమంత్రి కావడం గర్వకారణం అని గొప్పలు చెప్పుకుంటున్నారు గానీ తెలుగుజాతికి ఇంతటి తలవంపులు తెచ్చిన ఘటన వేరే ఏదీ వుండదు. కాబట్టి వెంటనే –

– నంద్యాల ఉపఎన్నికలో ఇప్పటిదాకా జరిపిన బూటకపు తంతును రద్దు చేసి కొత్తగా నామినేషన్లు స్వీకరించాలి.

– ప్రకాశ్‌రెడ్డి, సుధాకరబాబు మొదలయిన కాంగ్రెస్(ఐ) నాయకులను వెంటనే అరెస్టు చేయాలి. వాళ్ళు చేసినవి కాగ్నైజబుల్ నేరాలు కాబట్టి వారిని అరెస్టు చేయడానికి లిఖితపూర్వకమయిన ఫిర్యాదులు అవసరం లేదు. ఇప్పటికి పత్రికలలో వచ్చిన వార్తలు చాలును.

– జిల్లా కలెక్టర్, డి.ఆర్.వో, ఎస్.పిలను ఉద్యోగాల నుండి బర్తరఫ్ చేసి పై నేరస్తులకు సహాయ సహకారాలందించినందుకు అరెస్టు చేయాలి.

– నంద్యాల దౌర్జన్యకాండకు నైతిక బాధ్యత వహించి కేంద్రమంత్రి విజయభాస్కర్‌రెడ్డి రాజీనామా చేయాలి.

– కడప పార్లమెంటు నియోజకవర్గంలోనూ, ఆళ్ళగడ్డ, పులివెందుల అసెంబ్లీ నియోజకవర్గాలలోనూ ఇప్పటికే కాంగ్రెస్(ఐ) అభ్యర్థుల తరఫున అధికార యంత్రాంగం పనిచేయడం ప్రారంభమయింది. కడప సీటుకు పోటీచేస్తున్న స్వతంత్ర అభ్యర్థులను మైదుకూరు పోలీసులు అరెస్టు చేసి అక్రమంగా నిర్బంధించారు. ఈ దమనకాండను వెంటనే ఆపి, ఎన్నికలను స్వేచ్ఛగా జరిపించాలి.

*ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, ప్రజాస్వామ్య హక్కుల*
*పరిరక్షణ సంస్థ సంయుక్త కరపత్రంగా వచ్చింది.*
*1 నవంబరు 1991*

* ఇదే విషయంపై 'నలుపు'లో కూడ ఒక వ్యాసం రాశారు. దాని శీర్షిక 'నంద్యాల ఎన్నికలలో బూటకపు తంతు', 1–15 డిసెంబర్ 1991



# పాణ్యం ఉపఎన్నిక: కొన్ని ప్రశ్నలు



**ప్రజలారా!**

**పా**ణ్యం ఉపఎన్నిక ముగిసింది. ఇప్పటిదాకా అసెంబ్లీ సభ్యత్వం లేకుండా ముఖ్యమంత్రిగా ఉన్న విజయభాస్కరరెడ్డి ఇప్పుడు శాస్త్రోక్తంగా ప్రజా ప్రతినిధి అయ్యాడు. 'ప్రశాంతంగా పోలింగ్, భారీగా రిగ్గింగ్' అన్న దినపత్రికల పతాక శీర్షికతో ఈ కర్మకాండ ముగిసింది.

ఇప్పుడింక మీరు చెప్పబోయేది ఏమిటని అడుగుతారేమో! చెప్పవలసిన విషయాలు చాలా ఉన్నాయని మేము అనుకుంటున్నాము. ఎవరో ఒకరు ఏదో విధంగా గెలిచి ఏదో రకంగా పరిపాలించడం ప్రజాస్వామ్యం కాదు. ఎన్నిక ప్రజాభీష్టాన్ని ప్రతిఫలించాలి. పరిపాలన ప్రజాస్వామ్య విలువలను ప్రతిఫలించాలి. అప్పుడే దానిని ప్రజాస్వామ్యం అనగలం. దొంగవోట్లు వేసుకోవడం, రిగ్గింగ్ చేసుకోవడంలో మాత్రమే కాదు, ఎన్నికల చట్టానికి, ఎన్నికల కమిషన్ కళ్ళకూ కనిపించని అనేక ఇతర విషయాలలో కూడ పాణ్యం ఎన్నిక ప్రజాభీష్టానికి ప్రతిఫలనం అని అనిపించుకునే అర్హత పోగొట్టుకుంది. 'దీనిలో కొత్త ఏముంది – ఎప్పుడూ జరిగేదే' అనే పద్ధతిలో పోలీసుల నుండి రిటర్నింగ్ ఆఫీసర్, ఎన్నికల పరిశీలకుల దాకా అధికార యంత్రాంగమంతా ఉదాసీనత ప్రదర్శించినా, ప్రజలు ఉదాసీనంగా ఉండడానికి వీలు లేదు. 'ఎప్పుడూ జరిగేదే' అయినా అన్యాయం అన్యాయమే. దానికి అలవాటుపడిపోయి ఊరుకుంటే మన హక్కులను చేజేతులా ఈ రౌడీ పాలకులకు పాదాక్రాంతం చేసిన వాళ్ళమవుతాము.

'పెద్దాయన' కోసం పాణ్యం సీటు ఖాళీచేసి ఇచ్చిన రాంభూపాల్‌రెడ్డి 'ఆయన చలవ వల్లే నేను ఎం.ఎల్.ఏ నయ్యాను కాబట్టి ఆయనకు నా సీటు ఇచ్చి అత్యధిక మెజారిటీతో గెలిపిస్తాను' అని ఆనాడే ప్రకటించాడు. ఎన్నికలనేవి ఉన్నంతవరకు

ఎవరయినా ప్రజల చలవ వల్లనే ఎం.ఎల్.ఏ అవుతారనుకుంటాం. కాని ఆయన చలవ వల్ల ఈయన గెలవటమేమిటి? దానికి ప్రతిగా ఆయనను ఈయన అత్యధిక మెజారిటీతో గెలిపించడమేమిటి? అంటే సీటు అప్పగించినప్పుడే దానితోపాటు దొంగ వోట్ల హామీ కూడ ఇచ్చినట్టే కదా? అంటే ఏప్రిల్ 3వ తేదీన రాంభూపాల్‌రెడ్డి బనగానపల్లెలో తన అనుచరగణంతో బీభత్సంగా బూత్‌లు ఆక్రమించుకుని రిగ్గింగ్ చేసినప్పుడే అక్రమాలు ప్రారంభమయినట్లు అనుకోవాలా లేకపోతే సీటు అప్పగించినప్పుడే ప్రారంభమయినట్టు అనుకోవాలా?

'నాకు వోటు వేస్తేనే రాయలసీమకు అభివృద్ధి దక్కుతుంది' అని తాను నామినేషన్ వేసిననాడే విజయభాస్కరరెడ్డి బహిరంగ ప్రకటన చేశారు. అధికారంలో లేని వ్యక్తి ఆ మాట అంటే దానికి అర్థం ఉంది. నాకు అధికారం ఇస్తే నేను మంచి చేస్తానని హామీ ఇస్తున్నాడని అర్థం చేసుకోవచ్చు. కాని ముఖ్యమంత్రిగా ఉన్న వ్యక్తి ఆ మాట అంటే అది బెదిరింపు కాదా? విజయభాస్కరరెడ్డి ఓడిపోయినా రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం కొనసాగుతుంది. ఆయన ఓడిపోయినంత మాత్రాన పాణ్యంవాసులు దేశ పౌరులు కాకుండా పోతారా? వాళ్ళ అభివృద్ధి కోసం కృషిచేసే బాధ్యత కాంగ్రెస్ ప్రభుత్వంపైన లేకుండా పోతుందా? ఈ రకంగా బెదిరించి వోట్లు వేయించుకోవడం ఎన్నికల చట్టం (ప్రజాప్రాతినిధ్య చట్టం, 1951) సెక్షన్ 123(2)(ఎ) కింద నేరమెందుకు కాదు? తనకు వోటు వేయకపోతే వోటర్లకు హాని జరుగుతుందని (అది ఏ విధమయిన హాని అయినా కావచ్చు) బెదిరిస్తే అది అవినీతి చర్య కిందికి వస్తుందని ఆ సెక్షన్ అంటుంది. అవినీతి చర్యలకు పాల్పడితే ఎన్నిక చెల్లదని సెక్షన్ 100(బి) అంటుంది.

పాణ్యం ఎన్నికను దగ్గరుండి పరిశీలించిన వారందరూ గమనించినదేమంటే కాంగ్రెసేతర అభ్యర్థులకు అతికొద్ది గ్రామాలను మినహాయిస్తే వేరే ఎక్కడా స్థానిక ఏజెంట్లు లేరు. ఎందుకు లేరంటే వాళ్ళపట్ల ప్రజలకు ఎంతమాత్రం అభిమానం లేక కాదు. కాంగ్రెసేతర అభ్యర్థుల సభలకు ప్రజాదరణ బాగా లభించిందని పత్రికలే రాశాయి. మరి స్థానికులెవ్వరూ ఏజెంట్లుగా ఎందుకు కూర్చోలేదంటే దానికి కారణం 'టెర్రర్'. కూర్చుంటే 'కాళ్ళు, చేతులు నరుకుతారు' అని దాదాపు ప్రతి గ్రామంలోను ప్రజలు మా నిజనిర్ధారణ కమిటీతో అన్నారు. అంటే కాంగ్రెసేతర అభ్యర్థులకు ఏజెంట్లుగా కూర్చుంటే కాళ్ళు, చేతులు నరుకుతారు. కాంగ్రెసేతర అభ్యర్థుల ప్రచారంలో

పాల్గొంటే కాళ్ళు చేతులు నరుకుతారు. వాళ్ళ ప్రచారానికి సహకరిస్తే కాళ్ళు చేతులు నరుకుతారు. వాళ్ళకు కనీసం తిండిపెట్టినా నీళ్ళిచ్చినా కాళ్ళు చేతులు నరుకుతారు.

ఎవరు నరుకుతారు? కాంగ్రెస్‌కు చెందిన సాయుధ ముఠా నాయకులు. సాయుధ ముఠాలను వెంట వేసుకొని రాయలసీమ ప్రజల జీవితాలను భూతాలై పీడిస్తున్న ఫాక్షనిస్టులు. సారాయి వ్యాపారంతో, రౌడీ మామూళ్ళతో, బలవంతపు వసూళ్ళతో కోట్లు సంపాదించి అందులో కొంత భాగాన్ని రాజకీయాధికారం కోసం వెచ్చించి 'ప్రజాప్రతినిధులు' అన్న బోర్డు తగిలించుకొని తిరుగుతున్న మాఫియా నాయకులు. వాళ్ళు చెప్పినట్టు ప్రజలు వినాలి. వాళ్ళ ఆదేశం ప్రకారం నడుచుకోవాలి. వాళ్ళు తెలుగుదేశం పార్టీలో ఉంటే ఆ పార్టీకే వోటు వేయాలి. వాళ్ళు కాంగ్రెస్‌లో ఉంటే కాంగ్రెస్‌కే వోటువేయాలి. లేకపోతే 'కాళ్ళు చేతులు నరుకుతారు'. పెట్టెలో వోటు వేసేముందు తమ ఏజెంటుకు చూపించి వేయాలని కూడ ఈసారి వాళ్ళు వోటర్లకు ఆంక్ష జారీచేశారు. ఆ ఆంక్షను గౌరవించనందుకు కైప గ్రామంలో ఒక వోటరు పైన దౌర్జన్యంచేసి విపరీతంగా కొట్టారు. ఇదెక్కడి అన్యాయమని కాంగ్రెసేతర అభ్యర్థి సంధ్య ఏజెంటయిన గంగాభవాని ప్రశ్నించగా ఆ గుండాలు ఆమె పైన కూడ పడి విపరీతంగా కొట్టారు.

ఈ ముఠాల బెదిరింపే విజయభాస్కరరెడ్డి విజయానికి ప్రధాన సోపానం అయింది. వాళ్ళే ఇతర అభ్యర్థులకు స్థానిక ప్రచార కార్యకర్తలు లేకుండా చేశారు, స్థానిక ఏజెంట్లు సైతం లేకుండా చేశారు. ఆవులదొడ్డి, కామగానికుంటు, శ్రీరంగాపురం గ్రామాలలో బయటివాళ్ళను ఏజెంట్లుగా పెట్టుకుంటే వాళ్ళని కూడ కిడ్నాప్‌చేసి బూతులు తిట్టి బలవంతంగా బంధించి ఉంచారు. బోగోలు, చెరుకులపాడు గ్రామాలలోనైతే ఏజెంట్లను చుట్టుముట్టి తరిమేశారు. కిడ్నాప్ అయిన వివరాలను వెల్దుర్తి ఎస్.ఐ. యుగంధర్‌కు, డోన్ సి.ఐ. సయ్యద్ వలీకి చెప్పినా వాళ్ళు నిమ్మకు నీరెత్తినట్టు ఉండిపోయారు. కిడ్నాప్ అయిన వారి ఆచూకీ కాకతాళీయంగా కనుక్కున్న తెలుగుదేశం నాయకులే వారిలో కొందరిని కాపాడారు. ఆ తరువాత విధి లేక పోలీసులు రంగంలోకి దిగి మిగిలిన వారి కోసం వెతికారు.

ఈ రకంగా ప్రత్యర్థులను భయభ్రాంతులు చేసి కాంగ్రెస్ నాయకులు ప్రతి ఊరిలోనూ జీపులు, ట్రాక్టర్లు పెట్టి జనాన్ని చట్టవిరుద్ధంగా పోలింగ్‌బూత్‌ల దగ్గరికి

తరలించి తీసుకొచ్చారు. ఇది మరొక అవినీతి చర్య అని ఎన్నికల చట్టం సెక్షన్ 123(5) స్పష్టంగా అంటుంది. అయినా ఇది ఏప్రిల్ 3వ తేదీన పాణ్యం అంతటా బాహాటంగా జరిగింది. పత్రికలు ఫోటోలు సహితం వేశాయి. ఈ విధంగా తరలించిన జనంలో కొందరు కాంగ్రెసేతర అభ్యర్థులకు వోటువేసి ఉండరా అంటారేమో, వేసి ఉండవచ్చు. కానీ అత్యధికులు మట్టుకు తెలిస్తే చావగొడతారన్న భయానికి (పైగా వోటు చూపించి పెట్టెలో వేయాలన్నారు కదా!) కాంగ్రెస్‌కే వేసి ఉంటారు. ఆ విధంగా జరుగుతుంది కాబట్టే వాహనాలలో తరలించడం అవినీతికర చర్య అని చట్టం గుర్తించింది. కానీ చట్టాన్ని అమలుచేసేవారు గుర్తించాలి కదా!

తోలుకొచ్చిన జనం చేత వోట్లు వేయించడమే కాక దొంగవోట్లు కూడ చాలా వేయించారు. బయటి నియోజకవర్గాల నుండి కూడ జనాన్ని లారీలలో తరలించి తీసుకొచ్చి వెల్దుర్తి మండలంలోను, ఇతర మండలాలలోని కొన్ని ప్రాంతాలలోనూ పెద్ద సంఖ్యలో దొంగవోట్లు వేయించారు. 'పెద్దాయన' ఊరికే గెలిస్తే చాలదు కదా? గతంలో పి.వి. నరసింహారావు నంద్యాలలో గెలిచినట్టు అధిక మెజారిటీతో గెలవాలి. అప్పుడు చేసినట్టు కొద్దిమంది బూత్‌లు ఆక్రమించుకొని వోట్లన్నీ గుద్దుకోవడం ఈసారి సాధ్యపడదనుకున్నారు కాబట్టి ఈసారి కర్నూలు, డోన్, అవుకు, ఆళ్ళగడ్డ ప్రాంతాల నుండి లారీలలో, టూరిస్టు బస్సులలో దొంగవోటర్లను తరలించారు. ఈ విషయం అందరికీ కనపడుతూనే ఉంది. అందరూ చూస్తూనే ఉన్నారు. అధికార పార్టీకాక వేరే ఎవరయినా ఆ పనిచేసి ఉంటే పోలీసులు ఆ లారీలనూ బస్సులనూ ఆపి వెనక్కి పంపేవారు. కానీ ఇది హస్తం మహత్యం అయ్యేసరికి మిన్నకుండిపోయారు.

దొంగవోట్లకు సంబంధించిన చట్టం కూడ దొంగలకే అనుకూలంగా ఉంది. దొంగవోట్లను నిరోధించాలని ఎన్నికల చట్టం సెక్షన్ 61 అంటుందిగానీ, దొంగవోట్ల వల్ల ఎన్నికల ఫలితానికి తేడా వచ్చేటట్టయితేనే ఆ ఎన్నిక రద్దవుతుంది తప్ప లేకపోతే కాదని సెక్షన్ 100(డి)(3) అంటుంది. అంటే అవినీతి కాదు, దాని రాశి ఇక్కడ ప్రధానం. కాబట్టి ఒకే వ్యక్తి డజను వోట్లు వేసిన ఉదంతాలనూ, నియోజకవర్గానికి చెందని వాళ్ళు లైనుకట్టి వందల వోట్లు వేసిన ఉదంతాలనూ నిర్దిష్టంగా రిటర్నింగ్ ఆఫీసర్ దృష్టికి తెచ్చినా, ఒక దొంగవోటరును రేణుకా చౌదరి స్వయంగా పట్టుకొని బయటకు ఈడ్చుకొచ్చిన ఫోటోను పత్రికలు ప్రచురించినా, వాటివల్ల ఎన్నికల ఫలితానికేమీ తేడా రాదని చెప్పి రిటర్నింగ్ ఆఫీసర్ కొట్టిపారేయగలడు.

ఇది చట్టంలోని లోపమే అనుకున్నా, రిగ్గింగ్ విషయంలో చట్టం స్పష్టంగానే ఉంది కదా! బూత్‌లు ఆక్రమించుకోవడం ఎన్నికను రద్దుచేసే చర్య అని సెక్షన్ 58–ఎ, 123 (8) ఏ మినహాయింపు లేకుండ అంటాయి. మరి రాంభూపాల్‌రెడ్డి, శేషశయనరెడ్డి, ఫకీర్‌రెడ్డి, వారి అనుచరులు బనగానపల్లి, పాణ్యం మండలాలలో అనేకచోట్ల రిగ్గింగ్‌కు పాల్పడ్డారు. బూత్ నంబర్లతో సహా ఆ సాయంత్రమే మా రెండు సంస్థలు రిటర్నింగ్ ఆఫీసర్ మన్మోహన్‌సింగ్‌కు ఫిర్యాదు ఇవ్వడం జరిగింది. పాణ్యంలోనైతే అయిదు బూత్‌లలో రిగ్గింగ్ జరిగినట్టు ఎం.ఆర్.వో స్వయంగా రిపోర్టు రాశాడు. అయినా వీటిమీద ఏ రకమయిన విచారణ జరపకుండ ఎన్నికల అధికారులు ఆ సాయంత్రమే ఫిర్యాదులలో ఏ మాత్రం వాస్తవం లేద'ని ఏ విధంగా కొట్టేయగలిగారు? శేషన్ మీద విజయభాస్కరరెడ్డి అనవసరంగా విరుచుకుపడ్డారు గానీ పైకి ఏం మాట్లాడినా చూసీ చూడనట్టు పోయే ఎన్నికల అధికారుల వైఖరి కదూ ఆయనను కాపాడింది!

ఇక్కడ సమస్య ఎవరు గెలుస్తారనేది కాదు. ప్రజలు ఇష్టపడి విజయభాస్కరరెడ్డినే గెలిపించుకుంటే ఎవ్వరూ అభ్యంతరం చెప్పరు. ఆ ఇష్టపడే స్వేచ్ఛ ప్రజలకు ఉండాలంటున్నాం. ఈ హక్కు కోసం సూత్రబద్ధంగా నిలబడి పోరాడాలంటున్నాం. తెలుగుదేశం నాయకులలాగ తమకు బలం ఉన్నచోట తాము కూడ అక్రమాలకు పాల్పడుతూ, బలంలేని చోట ప్రజాస్వామ్యాన్ని గురించి మాట్లాడే పద్ధతిలో కాక, ఒక ప్రజాస్వామిక విలువగా ప్రజల రాజకీయ స్వేచ్ఛను కాపాడాలని కోరుతున్నాం. రాయలసీమకు సంబంధించినంత వరకు ఈ రాజకీయ స్వేచ్ఛకు ప్రధాన శత్రువు సాయుధ పెత్తందారీ ఫాక్షన్ల ఆధిపత్యం. వాళ్ళు ఊరూరా నడుపుతున్న సమాంతర పాలన, వారి రౌడీ రాజ్యం. దీనిని అంతం చేయడానికి పోరాడనిదే రాయలసీమ ప్రజలకు రాజకీయ స్వేచ్ఛ లేదు. ప్రజాస్వామ్యం లేదు.

*ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ సంయుక్త కరపత్రంగా వచ్చింది, 1993*



# ప్రజాస్వామ్యమే ఓడిపోయినట్టయితే ఏ పార్టీ గెలిస్తేనేమి!



**ప్రజలారా !**

**ప**దకొండవ లోక్‌సభ ఎన్నికలు వచ్చాయి. రాబోయే అయిదు సంవత్సరాలలో ఈ దేశాన్ని ఎవరు పాలిస్తారో ఈ ఎన్నికలు నిర్ణయించాలి. రాబోయే అయిదు సంవత్సరాలలో ఈ దేశ సాంఘిక, ఆర్థిక విధానాలు ఇప్పుడున్నట్టే కొనసాగుతాయా లేక కొత్త రూపం తీసుకుంటాయా అనేది ఈ ఎన్నికలు నిర్ణయించాలి. దేశ పరిస్థితి, పరిపాలనా విధానాలు రాబోయే దినాలలో మెరుగవుతాయా లేక దిగజారుతాయా అనేది ఈ ఎన్నికలు నిర్ణయించాలి.

కానీ ఎన్నికల ప్రచారంలో దీనికి తగిన చర్చ జరుగుతూ ఉందా? మనం ఏం చర్చించుకుంటున్నాం? పత్రికలు ఒక దానితో ఒకటి పోటీపడి ఏం రాస్తున్నాయి? మనకు ఏం చెప్తున్నాయి? ఎవరి ప్రచారం ఎంత ఆర్భాటంగా ఉంది, ఎవరు ఎంత జనాకర్షకంగా ప్రత్యర్థులను దూషించగలుగుతున్నారు, ఎవరు ఎంత పెద్దఎత్తున ఖర్చు పెట్టగలుగుతున్నారు, ఎవరికి ఎన్ని 'రిగ్గింగ్ గ్రామాలు' ఉన్నాయి, నెహ్రూ వారసత్వం ఎవరికి సంక్రమించింది, ఎన్టీఆర్ ప్రజాకర్షణ ఎవరికి వారసత్వమయింది, ఎవరు ఎన్ని ఎత్తులు వేసి గెలిచే టిక్కెట్ సంపాదించుకున్నారు, ఎవరు ఎంత తెలివిగా ఆఖరు నిమిషంలో పార్టీ ఫిరాయించారు, ఎవరి చాణక్యం ఎంత, ఎవరి చాకచక్యం ఎంత – ఇదేగా ఎన్నికల గురించి జరుగుతున్న చర్చ? ఇదేగా పత్రికలు పేజీలకు పేజీలు చేస్తున్న విశ్లేషణ?

పోనీ ఈ పనయినా పత్రికలు నిష్పాక్షికంగా చేస్తున్నాయా అంటే అదీ లేదు. ఒక్కొక్క ప్రముఖ దినపత్రిక ఒక్కొక్క పార్టీకి కరపత్రంగా పనిచేస్తూ ఉంది. ఒక పత్రికలో బ్రహ్మాండమయిన బహిరంగ సభగా కనిపించేది వేరొక పత్రికలో వట్టి సభగా సాక్షాత్కరిస్తుంది.

ఎన్నికల సందర్భంగా జరగవలసిన చర్చ ఇదేనా? ఎన్నికలపట్ల ఉండవలసిన ప్రజాతంత్ర వైఖరి ఇదేనా? ఎన్నికలు ఈ ప్రాతిపదిక మీద జరిగితే అసలు ఎన్నికలు జరుపుకోవడం ఎందుకు?

ఎన్నికలు ప్రాతినిధ్య పాలన కోసం జరుగుతాయి. ప్రజల న్యాయమైన ఆకాంక్షలకు ఆరాటాలకు ప్రాతినిధ్యం వహించే వ్యక్తులు, పార్టీలు ఎన్నికై తదనుగుణంగా దేశపాలన నిర్వహిస్తారనేది ఎన్నికల వ్యవస్థకు ఉండే సార్థకత. ప్రజల సమస్యలు, వాటి పరిష్కారం, ప్రజల కోరికలు, వాటి సాధనా మార్గాలు, ప్రజలు ఎదుర్కొంటున్న అణచివేత, దాని నుండి విముక్తి కలిగించే విధానాలు – వీటి ప్రాతిపదికన ఎన్నికలు జరిగితేనే అది తన ప్రజాస్వామ్య కర్తవ్యాన్ని నిర్వర్తించగలుగుతుంది.

డబ్బు, సారా, గుండాయిజం, గత నాయకుల బొమ్మలు, మృతనాయకుల బూడిద – వీటి ప్రాతిపదికన జరిగే ఎన్నికలు తమ ప్రజాస్వామ్య కర్తవ్యాన్ని ఎట్లా నిర్వర్తించగలుగుతాయి?

ముస్లింలపైన ద్వేషం రెచ్చగొట్టి 'హిందువు' అనే పేరు మీద వోటర్లను సమీకరించే రాజకీయం, అసంఖ్యాకమైన హవాలాల నుండి కూడబెట్టుకున్న వందల కోట్ల రూపాయలు వెదజల్లి వోట్లు కొనుక్కునే రాజకీయం, సినిమా స్టార్లను ఊరేగించి వోట్లడిగే రాజకీయం, మృతనాయకుల అసలు వారసులు తామేనని దబాయించి వోట్లు దండుకునే రాజకీయం, రౌడీమూకలను పోషించి బాంబులు వేసి రిగ్గింగ్ చేసి ప్రజల వోట్లను తామే వేసుకునే రాజకీయం – ఈ రకమైన రాజకీయాల మధ్య జరిగే వీధి కొట్లాటలకూ, ప్రజాస్వామ్య రాజకీయ సంవాదానికీ పోలిక ఏమైనా ఉందా? దీనినే ప్రజాస్వామ్యం అని తాము నమ్మడమే కాక మనల్ని కూడ నమ్మింపజూస్తున్న మేధావులను, పత్రికలను ఏమనాలి?

ఇప్పుడు మనం ఆలోచించాల్సిన విషయాలు ఏమిటంటే– ఈ ఎన్నికల సందర్భంగా మనం ఏ ప్రశ్నలు వేసుకోవాలి? అభ్యర్థులనూ, పార్టీలనూ ఏమని

నిలదీయాలి? ఈ ఎన్నికలు సార్థకం కావాలంటే ఏ చర్చ జరగాలి? మనం వోటు వేసేదీ లేనిదీ, వేస్తే ఎవరికి వేసేదీ ఏ ప్రాతిపదికన నిర్ణయించుకోవాలి? అని.

గత అయిదేళ్ళుగా దేశంలో అమలు అవుతున్న నూతన ఆర్థిక విధానాల ఫలితంగా విదేశీ మారకద్రవ్యం సమస్య పరిష్కారం కాకపోగా ధరలు పెరిగాయి. పేదరికం పెరుగుతూ ఉంది. నేషనల్ శాంపుల్ సర్వే లెక్కల ప్రకారం ప్రజలలో 40 శాతం దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారు. ఈ స్థితిలో ప్రభుత్వం తన బాధ్యత వదిలిపెట్టి ఆర్థిక వ్యవస్థను పెట్టుబడిదారుల ఇష్టాయిష్టాలకు వదిలేస్తుంటే ఈ 40 శాతం ప్రజల గతి ఏమవుతుంది? అన్ని ప్రధాన పార్టీలు సరళీకృత ఆర్థిక విధానాలు అవసరమే అంటున్నాయి కాబట్టి ఈ ప్రశ్నకు ఏ పార్టీ ఏం సమాధానం చెప్తుంది? అదే క్రమంలో ఫ్యాక్టరీల మూసివేత నిరాఘాటంగా సాగుతూ ఉంది. ఖాయిలా పడిన మిల్లులకు ప్రాణం పోయడం కోసం నెలకొల్పిన బి.ఐ.ఎఫ్.ఆర్‌ను మిల్లులను శాశ్వతంగా మూసివేసే ఉపాయాలు వెతికే యంత్రాంగంగా మార్చారు. మన రాష్ట్రం సంగతి చెప్పుకోవాలంటే, మనం పారిశ్రామీకరణలో దేశంలో అగ్రభాగాన లేము గాని మిల్లుల మూసివేతలో మాత్రం దేశంలో రెండవ స్థానంలో ఉన్నాము. మూసివేతే కాక కంపెనీల పునర్వ్యవస్థీకరణ కూడ నిరాఘాటంగా సాగుతూ ఉంది. సంఘటిత రంగ కార్మికులను అసంఘటిత రంగంలోకి నెడుతున్నారు. జీతభత్యాలకూ ఉద్యోగాలకూ నిన్నటిదాకా ఉన్న కనీస భద్రత కూడ లేకుండా చేస్తున్నారు. ఇదేమయినా రేపు ఆగుతుందా? ఏ పార్టీ దీనిని ఏ విధంగా ఆపుతుంది? ఆపుతూ ఆర్థిక సరళీకరణను ఏ విధంగా కొనసాగిస్తుంది?

దీనివల్ల అధికంగా దెబ్బతినేది దళిత, వెనుకబడిన కులాల ప్రజలు, స్త్రీలు. కార్మికవర్గానికి తగిలే ఏ దెబ్బయినా మొదట స్త్రీ కార్మికులకే తగులుతుంది. దళిత, వెనుకబడిన కులాలవారు ఎక్కువగా పనిచేసే చిన్న, మధ్యతరహా పరిశ్రమలకే తగులుతుంది. ఈ వర్గాల ఉద్యోగ అవకాశాలు మరొక వైపు నుండి కూడ దెబ్బతింటున్నాయి. ప్రభుత్వం తన బాధ్యతలు ఒక్కొక్కటీ ప్రైవేట్ రంగానికి బదలాయించే కొద్దీ ఉద్యోగాల కోసం ఎవరైనా ప్రైవేట్ రంగంలోనే వెతుక్కోవలసి వస్తున్నది. కాని ప్రైవేట్ రంగం అగ్రకులాల గుప్పిట్లో ఉంది. ఆ రంగంలో రిజర్వేషన్ హక్కు లేదు. దీని గురించి ఏ పార్టీ ఏం చెప్తుంది? ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు కల్పించే కార్యక్రమం ఏ పార్టీ

అజెండాలోనూ ఎందుకు లేదు? ఇప్పుడు ఏ పార్టీ అయినా దీనిని తన అజెండాలో చేర్చుకుంటుందా? కానీ ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లను ప్రపంచ బ్యాంకు ఆమోదించదు. ఇతర విదేశీ రుణ సంస్థలూ ఆమోదించవు. ఆ వ్యతిరేకతను ఎదుర్కొనడానికి ఏ పార్టీ ఏం చేస్తుంది?

దళితులకూ స్త్రీలకూ అధికారం కట్టబెడతామని అందరూ అంటున్నారు కాని రిజర్వ్ కాని ఎన్ని సీట్లకు ఏ పార్టీ అయినా దళిత అభ్యర్థులను ఎంపిక చేసింది? స్త్రీలకు ఏ పార్టీ అయినా ఎన్ని టిక్కట్లిచ్చింది? మన రాష్ట్రంలోని అన్ని ప్రధాన రాజకీయ పార్టీలూ కలిసి 42 సీట్లకు గాను కేవలం 10 మంది స్త్రీలకు టిక్కెట్లిచ్చారు. మాటలకూ ఆచరణకూ మధ్య పొంతనలేని ఈ స్థితికి ఏ పార్టీ ఏం సంజాయిషీ చెబుతుంది?

హిందుత్వవాదుల ఫాసిస్టు దాడులకు ఉత్తర భారతదేశంలోనూ, మహారాష్ట్రలోనూ ముస్లింలు, క్రైస్తవులే కాక ప్రజాతంత్ర శక్తులంతా భయపడుతూ బ్రతికే పరిస్థితి ఉంది. హిందుత్వం పేరు మీద రాజకీయం చేయడంలో లౌకికతకు భంగమేదీ లేదని సుప్రీంకోర్టు అర్థరహితమైన తీర్పు ఇవ్వడం వీళ్ళ ఫాసిజానికి బలం చేకూర్చింది. దేశ రాజధానిలో కాశ్మీర్ గురించి మాట్లాడటం అసాధ్యం అయిపోయింది. ప్రతి సభ మీద హిందుత్వవాదులు దాడిచేసి భగ్నం చేస్తున్నారు. ప్రజాస్వామ్యానికి వోటుహక్కు ఎంత ముఖ్యమో వాక్స్వాతంత్రమూ అంత ముఖ్యం. వోటు పవిత్రత గురించి ఉపన్యాసాలిచ్చే ఈ రాజకీయ పార్టీలు వాక్స్వాతంత్రాన్ని కాపాడడానికి ఏం చేస్తాయి? ఇప్పటికి ఏం చేశాయి?

పోలీసు హింస ఈ దేశంలో ప్రజలు అనుభవిస్తున్న నిత్యజీవిత సమస్యలలో ఒకటి. పోలీసు స్టేషన్‌కు నిందితునిగానే కాదు, ఫిర్యాదిగా పోవాలన్నా భయపడే స్థితి ఉంది. వికృతమైన చిత్రహింసలు, లాకప్పు హత్యలు, బూటకపు ఎన్‌కౌంటర్లు ప్రతిరోజూ జరుగుతున్నాయి. మన రాష్ట్రంలోనయితే ఇకమీదట ఎన్‌కౌంటర్లు ఉండవు ఉండవంటూనే ఈ సంవత్సరం ఇప్పటికి 39 మందిని కాల్చి చంపారు. ఈ హింసను ఆపడానికి ఏ పార్టీ చేసింది? రేపు ఏం చేయబోతుంది? పోలీసు వ్యవస్థ చట్టబద్ధంగా పనిచేసేటట్టు చూస్తామని ఏ పార్టీ అయినా గుండెమీద చేయివేసుకొని చెప్పగలదా?

ఇట్లా ఎన్నో ప్రశ్నలు అడగొచ్చు. భూసంస్కరణల గురించి, చెరువుల మరమ్మతుల గురించి, సాగునీటి గురించి, తాగునీటి గురించి, అంటరానితనం గురించి, ఆకలి చావుల గురించి, వాతావరణ కాలుష్యం గురించి, కరువు గురించి, వరకట్న మరణాల గురించి ప్రశ్నలు అడగొచ్చు. వీటి గురించి మాట్లాడకుండా బొమ్మలు పట్టుకొని, బూడిద పట్టుకొని, బాంబులు పట్టుకొని వోట్లు వేయించుకుపోదామని వచ్చే నాయకులను నిలదీద్దాం. ఎన్నికల వ్యవస్థ కోల్పోయిన సార్థకతను దానికి తిరిగి కల్పిద్దాం. ఏ పార్టీ గెలుస్తుందన్న మీమాంస వదిలిపెట్టి ప్రజాస్వామ్యాన్ని గెలిపించుకుందాం.

*ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం కరపత్రంగా వచ్చింది*
*20 ఏప్రిల్ 1996*



# ఎన్నికలు - పౌరహక్కుల దృక్పథం



పార్లమెంట్ ఎన్నికల సందర్భంగా పీపుల్స్‌వార్ కార్యకర్తలు ఎన్నికల ప్రక్రియను బలప్రయోగంతో ఆటంకపరచడాన్ని ఖండిస్తూ ప్రకటనలు ఇచ్చాము. ఎన్నికలు అయిపోయిన తరువాత కేవలం ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నందుకు వాళ్ళు కొందరికి 'దేహశుద్ధి' చేయడాన్ని కూడ ఖండిస్తూ ప్రకటనలు ఇచ్చాము. దీనికి వివరణ కావాలని కార్యవర్గంలో కోరడం జరిగింది. ఇక్కడ రెండు విషయాలను వివరించాలి.

**1.** ఎన్నికల వ్యవస్థను మనం ఏ విధంగా చూడాలి? రాజకీయాలలో ప్రజాభీష్టం వ్యక్తం కావడానికొక సాధనంగా ఎన్నికల వ్యవస్థ చరిత్రలో ముందుకొచ్చింది. ప్రజాభీష్టం కేవలం ఎన్నికల రూపంలోనే వ్యక్తం కానవసరం లేదనీ, ప్రజాఉద్యమాలు తదితర రాజకీయ కార్యకలాపాలన్నీ ప్రజాభీష్ట వ్యక్తీకరణ రూపాలేననీ మనం నొక్కి చెప్తాము. అంతమాత్రం చేత ప్రజాభీష్టం వ్యక్తంచేసే ఒక సాధనంగా ఎన్నికల వ్యవస్థను గుర్తించకుండా ఉండము. ప్రస్తుతం భారత రాజకీయాలలో ఎన్నికల వ్యవస్థ వాస్తవానికి ప్రజాభీష్టాన్ని ఏ మేరకు వ్యక్తం చేయగలుగుతూ వుంది అనే విమర్శను ప్రాతిపదికగా తీసుకొని మనం గత రెండు సంవత్సరాలుగా ఎన్నికల సందర్భంగా ప్రచార ఆందోళనా కార్యక్రమం నిర్వహిస్తున్నాం. ప్రజాస్వామ్య రాజకీయాలలో ఎన్నికల పాత్రను గుర్తిస్తున్నాము కాబట్టే జంటనగరాల శాఖ కరపత్రం శీర్షికలో రాసినట్టు ఎన్నికల నిర్వహణకూ ఎన్‌కౌంటర్లు ఆపడానికీ పోటీపెట్టి మాట్లాడడం సరయినది కాదు. ఎన్నికలు సక్రమంగా నిర్వహించవలసిందే, ఎన్‌కౌంటర్లూ ఆపవలసిందే. ఇందులో ప్రజాస్వామ్యానికి ఒకటి అవసరం, మరొకటి అనవసరం కాదు.

**2.** మనం ప్రజలకు ఎన్నికలలో పాల్గొనే హక్కు, బహిష్కరించే హక్కు రెండూ సమానంగా ఉన్నాయంటున్నాం. పీపుల్స్‌వార్ బహిష్కరణ పిలుపును వమ్ముచేయడానికి పోలీసులు బలప్రయోగానికి పాల్పడడాన్ని విమర్శిస్తున్నాం, దాని గురించి ఆందోళన చేస్తున్నాం. అదే విధంగా పాల్గొనదలుచుకున్నవారి హక్కుకు పీపుల్స్‌వార్ అయినా, మరొకరయినా బలప్రయోగంతో అడ్డుపడడం అప్రజాస్వామిక చర్య. ఇది రాజకీయ స్వేచ్ఛకు సంబంధించిన విషయం. కేవలం వోటర్లపైన దాడిచేస్తే మాత్రమే అప్రజాస్వామికం కాదు. ఎన్నికల ప్రచారానికి బలప్రయోగంతో అడ్డుపడడం, ప్రచారంలో పాల్గొన్న వారిపైన హింసకు పాల్పడడం, పోలింగ్ ఏజెంట్లుగా కూర్చున్న వారిని హింసించడం మొదలయినవన్నీ కూడ అప్రజాస్వామిక చర్యలే. ఆ పార్టీల రాజకీయాలు ఎంత భ్రష్టుపట్టినవయినా కావచ్చును. కాని ప్రచారం చేసుకునే స్వేచ్ఛ, ఎన్నికలలో పాల్గొనే స్వేచ్ఛ వారి రాజకీయ హక్కులు. వాటి మంచిచెడులు నిర్ణయించుకునే హక్కు, బాధ్యత ప్రజలది. వారిని నిలదీసి ప్రశ్నించే హక్కు ప్రజలది. అన్ని పార్లమెంటరీ పార్టీలకూ ప్రజలలో అనుచరులున్నారు, సానుభూతిపరులున్నారు. ఆ పార్టీల ఎన్నికల ప్రచారాన్ని బలప్రయోగంతో అడ్డుకోవడం ఆ ప్రజల రాజకీయ స్వేచ్ఛను అడ్డుకోవడమే అవుతుంది. అందువల్లనే అటువంటి దాడులను ఖండిస్తున్నాం. (ఎన్నికల బహిష్కరణ పిలుపునే ఖండిస్తున్నట్లు 'వార్త'లో వచ్చిన ప్రకటన ఆ పత్రిక మార్కాపురం విలేకరి నేను చెప్పినది అర్థం చేసుకోకపోవటం వల్ల జరిగిన పొరపాటు.)

*'వివరణ' పేరుతో ఎ.పి.సి.ఎల్.సి కార్యవర్గానికి రాసిన లేఖ*
*14 జూన్ 1996*



# ప్రజాస్వామ్యం - ప్రాతినిధ్య పాలన



పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని ప్రాతినిధ్య పాలన అనే సూత్రం చాలా విలువైనదనీ, దానంతటదే 'బూర్జువా' లక్షణం కాదనీ నేను నమ్ముతున్నాను. దానిని మెరుగుపరచుకోవడంలోనే భవిష్యత్తు ఉంది తప్ప తిరస్కరించడంలో లేదని నేను నమ్ముతున్నాను. 'కార్మిక నియంతృత్వం' అనేది కూడ నిజంగా కార్మికుల పాలన కావాలంటే కనీసం కార్మికులకయినా వోటు వేసి ఆ ప్రభుత్వాన్ని ఎన్నుకునే హక్కు ఉండాలి. కాకపోతే, ప్రాదేశిక నియోజకవర్గాల బదులు ఉత్పత్తి చేసే స్థలాన్ని బట్టి లేదా ఉత్పత్తి రంగాన్ని బట్టి నియోజకవర్గాలు ఏర్పాటు చేయవచ్చు. అయినా అటువంటి రాజకీయ వ్యవస్థకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం లక్షణాలు చాలా ఉంటాయి. వోటు హక్కు ఇచ్చిన తరువాత ఒక పార్టీకి మాత్రమే వోటు చేయాలనడంలో అర్థంలేదు. అంటే అది ఏదో ఒక రూపంలో బహుళ పార్టీ వ్యవస్థ కావాలి. కమ్యూనిస్టు పార్టీయే కాక ఇతర పార్టీలకు కూడ ఉనికిలో ఉండే హక్కు ఉండాలి. కమ్యూనిజం నిజంగానే కార్మికులు అధికంగా ఆశించే లక్ష్యం అయినట్టయితే ఆ బహుళ పార్టీ వ్యవస్థ కమ్యూనిజానికి భిన్నంగా పోకుండ ఉంటుంది. కానీ కార్మికుల మీద కమ్యూనిస్టులకు ఆ నమ్మకం లేదు కాబట్టే కమ్యూనిస్టేతర పార్టీల ఉనికే లేకుండా చేశారు! ఇంక ఒక్క పార్టీయే ఉండాలనుకున్నప్పుడు వోటు హక్కు ఇచ్చి ఏం ప్రయోజనం? కాబట్టి అది కూడ లేకుండా పార్టీ నియంతృత్వం నెలకొల్పారు. బహుళ పార్టీ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పి, కమ్యూనిజం పట్ల బలమైన సామాజిక కాంక్షను నిత్య కృషి ద్వారా నిలబెట్ట గలిగితేనే సోషలిజం సాధ్యం అవుతుంది.

*కె.వి.ఆర్‌కు రాసిన లేఖలో నుంచి కొంత భాగం*
*21 ఫిబ్రవరి 1997*

# యాభైఏళ్ళ ప్రజాస్వామ్యం ఎక్కడిదాకా వచ్చింది?



స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు జరుపుకుంటున్నామంటే కేవలం 50 సంవత్సరాలు ఏదో ఒక రకంగా గడిచిపోయినందుకు సంతోషిస్తున్నామని నేను అనుకోను. స్వాతంత్ర్యం ద్వారా సాధించాలనుకున్నది ఏదైనా సాధించి వుంటే సంబరాలు జరుపుకోవడంలో అర్థం వుంటుంది.

ఈ యాభై సంవత్సరాలలో అసలేమీ సాధించలేదని ఎవ్వరూ అనరు. కానీ సాధించిన దానితో మనం సంతృప్తి చెందుతామా అన్నది మనం ఎంచుకునే ప్రమాణాన్ని బట్టి వుంటుంది. అన్ని మూడవ ప్రపంచ దేశాల కంటె భారతదేశంలో ప్రజాస్వామ్యం బలంగా వుందని మనం గర్వంగానే చెప్పుకోవచ్చు. (ఆకలి, అనారోగ్యాల విషయంలో అన్ని మూడవ ప్రపంచ దేశాల కంటె వెనుకబడి వున్నామని సిగ్గుపడినట్టే!) కానీ ప్రజాస్వామ్యం మలేసియా కంటే, చైనా కంటే మెరుగ్గా వుందని ప్రజలు సంతోషించలేరు. తమ దాకా వచ్చేసరికి ఏ మాత్రం వుందని ప్రశ్నించుకుంటారు. అలాగని పేదలకు, పీడితులకు సహితం ఇక్కడ ప్రజాస్వామ్యం అసలే లేదనడం అతిశయోక్తి అవుతుంది. కానీ చాలా బలహీనంగా వుందనేది వాస్తవం.

తమ పరిపాలనా దక్షత వల్లనే భారతదేశం ఒక దేశంగా నిలిచిందని, తాము వెళ్ళిపోతే ఈ దేశం నిలవదని ఒకనాడు బ్రిటిష్ పాలకులు భావించారు. ఈ జనం కొట్టుకు చస్తారని, అరాచకం తాండవిస్తుందని హెచ్చరించారు. ఒక ప్రజాస్వామ్య వ్యవస్థను ఈ దేశంలో నిర్మించడం సాధ్యం కాదని కూడ భావించారు. ఇవి వారి

జాత్యహంకారం నుండి పుట్టిన ఆలోచనలు. నూతన భారత పాలకుల పట్ల పెద్దగా సదభిప్రాయం లేనివారు సహితం ఈ కుశంకను ఆమోదించలేదు.

బ్రిటిష్‌వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత కూడ భారతదేశం నిలిచింది. అప్పుడప్పుడు కుంటుతూ వున్నా మొత్తంమీద నడుస్తూ వుంది. ఎన్ని లోపాలున్నా ప్రజాస్వామ్య వ్యవస్థ కూడ సజీవంగానే వుంది. అయితే బ్రిటిష్‌వారి అవిశ్వాసానికి జవాబు చెప్పామని సంతోషిస్తే సరిపోదు. స్వాతంత్ర్యం మీద మనం పెట్టుకున్న ఆశలు ఏ మేరకు నెరవేరాయో చూడడమే సరైన ప్రమాణం అవుతుంది. బ్రిటిష్ వలస పాలకులకు వ్యతిరేకంగా మన జాతీయోద్యమ నాయకులు ఎక్కుపెట్టిన విమర్శలలో ముఖ్యమైనది వారి పాలనకు ఈ దేశ ప్రజల పట్ల జవాబుదారీతనం లేదనేది. ప్రజల పట్ల బాధ్యతలేని పాలనకు ప్రజలు ఎందుకు సమ్మతించాలి అని వారు ప్రశ్నించారు.

యాభై సంవత్సరాల స్వాతంత్ర్యం తరువాత దేశ పాలనలో జవాబుదారీతనం ఏ మేరకు పెరిగింది? చట్టసభలు, అవి చేసే చట్టాలు ప్రజల ఆకాంక్షలకు జవాబుదారుగా ఉండాలి, స్వేచ్ఛ, సమానత్వం, అభివృద్ధి కోరుకుంటున్న ప్రజల కోరికలకు జవాబుదారుగా ఉండాలి; పరిపాలనా యంత్రాంగం ఆ చట్టాలకు జవాబుదారుగా ఉండాలి, ప్రజల అవసరాలకు జవాబుదారుగా ఉండాలి; న్యాయవ్యవస్థ పరిపాలనా యంత్రాంగానికి చట్టం పట్ల, రాజ్యాంగ విలువల పట్ల వుండవలసిన జవాబుదారీతనాన్ని నిలబెట్టాలి, అరాచక పరిపాలన నుంచి ప్రజలకు రక్షణ కల్పించాలి. ప్రజలకు, ప్రజలకు మధ్య న్యాయాన్ని నిలబెట్టాలి, ఎదుగుతున్న స్వేచ్ఛ, సమానత్వ ఆకాంక్షలకు అనుగుణంగా చట్టాలకు వ్యాఖ్యానం ఇవ్వాలి.

అంతేకాదు. ప్రజాస్వామ్యం అనే భావన ఇక్కడితో ఆగిపోనవసరం లేదు. ఆ మాటకు ఇంకా చాలా విశాలమైన అర్థం చెప్పుకోవచ్చు. కేవలం చట్టంలో రాజకీయాలలోనే కాక సాంఘిక ఆర్థిక వ్యవస్థలలో కూడ ప్రజాస్వామ్యాన్ని చూడవచ్చు. అయితే చట్టంలోను, రాజకీయ వ్యవస్థలోను, పరిపాలనా యంత్రాంగంలోను ప్రజాస్వామ్య విలువలు బలంగా వుంటే సాంఘిక ఆర్థిక వ్యవస్థలలో వాటిని సాధించుకోవడానికి అవకాశాలు మెరుగవుతాయి.

మరి ఈ యాభై సంవత్సరాలలో చట్టసభలలో, పరిపాలనా యంత్రాంగంలో, న్యాయవ్యవస్థలో ప్రజాస్వామ్యం ఏ మేరకు బలపడింది? అసలు బలపడిందా? ఈ

రోజు ఎన్నికలు గూండాయిజానికి, చట్టసభలు వీధి కొట్లాటలకు నెలవు అయ్యాయని, పరిపాలనా యంత్రాంగం అవినీతిమయం అయిందని, న్యాయవ్యవస్థ ఒక్కటే ఆశాజనకంగా వుందని చాలామంది నమ్ముతున్నారు. ఈ నమ్మకానికి ఆధారం లేకపోలేదు. కాని పైకి కనిపించే విషయాలతో సంతృప్తి చెందకుండా కొంచెం లోతుగా ఆలోచించడం అవసరం.

చట్టసభలలో ప్రజల సమస్యలపైన చర్చ కంటే వ్యక్తిగత దూషణ, కొట్లాటలే ఎక్కువ సమయం తీసుకుంటున్నాయనేది నిజమే. ఎన్నికలలో హేతుబద్ధమైన సంవాదం కంటే గూండాయిజానికి, డబ్బుకు, అవకాశవాద ఎత్తుగడలకు ఎక్కువ స్థానం లభిస్తున్నదనేదీ నిజమే. చట్టసభలలో పార్లమెంటరీ సంప్రదాయాలను అగౌరవపరిచే ప్రవర్తన తరచుగా కానవస్తుండడం కూడ నిజమే. కానీ ఒకనాటితో పోలిస్తే నేడు ప్రజలతోను, ప్రజల జీవితంలోను సన్నిహిత సంబంధం వున్నవాళ్ళ సంఖ్య చట్టసభలలో బాగా పెరిగింది. తొలినాటి శాసనకర్తలు పార్లమెంటరీ సంప్రదాయాలు బాగా తెలిసినవారే కావొచ్చు. కాని ఎక్కువగా పట్టణ ప్రాంత అగ్రకులాలకు, ధనికవర్గానికి చెందిన వాళ్ళు, అందులోను మగవాళ్ళు. వాళ్ళందరూ నిజాయతీలేనివారు, ప్రజా వ్యతిరేకులు కాకపోవచ్చు. కానీ, బడుగువర్గాలతో వాళ్ళకున్న సంబంధాలు, సహానుభూతి తక్కువే. ఇప్పుడా పరిస్థితి చాలా మారింది. అలాగని ప్రజా జీవితంతో సన్నిహిత సంబంధమున్న వారంతా నీతిమంతులేనని, ప్రజాస్వామిక స్వభావం కలవారేనని చెప్పడం నా ఉద్దేశం కాదు. అయినప్పటికీ ఇది మొత్తంమీద అభ్యుదయకరమైన మార్పే. రేపు స్త్రీలకు, వెనుకబడిన కులాలకు చట్టసభలలో రిజర్వేషన్లు వస్తే (త్వరలోనే రాక తప్పదు) పరిస్థితి ఇంకా మెరుగవుతుంది. ఈ రోజు రాష్ట్రంలో ఒక మారుమూల గ్రామంలో జరిగిన ఒక అన్యాయం శాసనసభలో చర్చకు వచ్చే అవకాశం వుంది. 50 ఏళ్ళ క్రితం ఆ పరిస్థితి వుందా? ఈ రోజు దళితులకు, స్త్రీలకు జరిగే అన్యాయాలు చట్టసభలలో చర్చకు వస్తున్నాయి. అప్పుడప్పుడు ఘర్షణకు దారితీస్తున్నాయి. 50 ఏళ్ళ క్రితం ఇది జరిగిందా?

చట్టసభలలో నెలకొన్న అరాచక వాతావరణాన్ని విమర్శించవలసిందే. 'పార్లమెంటరీ సాంప్రదాయాలు' బ్రిటిష్‌వాళ్ళ చాదస్తమని, మన నాయకుల ప్రవర్తనే గొప్పదని సమర్థించుకోనవసరం లేదు. చట్టసభల పద్ధతులు బ్రిటిష్‌వాళ్ళ నమూనాలోనే

వుండిపోనవసరం లేదు. మార్పులు రావచ్చు. అయినా హేతుబద్ధమైన చర్చకు, పరిష్కార సాధనకు అనుకూలించే పద్ధతులయితే అవసరం.

ఈ రెండు మార్పులకు సంబంధం వుందని భావించే వాళ్ళు వున్నారు. సాంప్రదాయకంగా రాజకీయాలలో ప్రవేశం లేనివాళ్ళు, మొరటు జీవితానికి అలవాటు పడిన వాళ్ళు కొత్తగా రాజకీయాలలోకి రావడం వల్లనే పార్లమెంటరీ వ్యవస్థలో అరాచకం ప్రబలిందని వాదించే వాళ్ళున్నారు. ఈ వాదనను రెండు రకాలుగా ఉపయోగించుకోవచ్చు. 'చదువు సంస్కారం' వున్న అగ్రకుల మేధావులు రాజకీయాలలో పాల్గొన్నప్పుడు మాత్రమే ప్రజాస్వామ్య పద్ధతులు సురక్షితంగా వుంటాయని వాదించడానికి ఉపయోగించుకోవచ్చు. లేదా ఈ రోజు తమను తాము రైతాంగ ప్రతినిధులుగా, బడుగు ప్రజల ప్రతినిధులుగా చిత్రీకరించుకుంటున్నవాళ్ళు రాజకీయాలలో అనుసరిస్తున్న పద్ధతులే నిజమైన ప్రజా సంస్కృతి అని వారిని వెనకేసుకు రావడానికి ఉపయోగించుకోవచ్చు. కాని నిజానికి ఈ రోజు చట్టసభలలో అరాచక ప్రవర్తన ఒకరి సొత్తు కాదు. చదువుకున్నవాళ్ళు, చదువులేనివాళ్ళు, ముందు నుండి రాజకీయాలలో వున్నవాళ్ళు, కొత్తగా రాజకీయాలలోకి వస్తున్న వాళ్ళు అందరూ అలాగే ప్రవర్తిస్తున్నారు. మరొకవైపు, గ్రామాల్లో సామాన్య ప్రజలు తమ సమస్యల పరిష్కారానికి నిర్వహించే పంచాయతీలను గమనిస్తే అధికార దాహం లేనిచోట ప్రజలు ప్రజాస్వామిక పద్ధతులు సవ్యంగానే పాటిస్తారని అర్థమవుతుంది. దేశ రాజకీయాలలో అధికార దాహం ప్రధానం కావడం వల్ల రాజకీయాలలో ప్రజాస్వామ్య పద్ధతులు దెబ్బతింటున్నాయే తప్ప పెద్ద చదువులు చదవని బడుగు వర్గాల ప్రతినిధులు ప్రవేశించడం వల్ల కాదు. ఈ అధికార దాహం అందరిలోనూ పెరిగింది. స్వాతంత్ర్యోద్యమ కాలం నాటి విలువలు నశించిన పెత్తందారీ వర్గాల నాయకులలోను ప్రబలింది. వారిని ఆ రకంగా తప్ప ఇంకొక రకంగా దెబ్బతీయలేమని నమ్మే బడుగువర్గాల నాయకులలోను పెరిగింది. ఈ నమ్మకం ప్రస్తుత రాజకీయ సంస్కృతి నుంచి పుట్టిందే తప్ప పరమ సత్యమేమీ కాదు.

ఈ పరిణామాలు అవాంఛనీయమే అయినప్పటికీ పీడిత ప్రజలకు సన్నిహితంగా వుండేవారు ప్రజాస్వామ్య రాజకీయాలలో చురుకైన పాత్ర నిర్వహించే స్థాయికి ఎదగడం మంచి మార్పే. రెండవదాన్ని చూడకుండా మొదటిదాని గురించి మాత్రమే బాధపడితే మనం వర్తమాన పరిణామాలకు న్యాయం చేయలేము.

నిజానికి చట్టసభలలో చెప్పులు విసురుకోవడం, మైకులు విరగ్గొట్టుకోవడం మనకు ఎక్కువ ఆవేదన కలిగిస్తున్నది కానీ అంతకంటే చాలా నష్టదాయకమైన వైఖరులు పరిపాలనా యంత్రాంగంలో వ్యక్తం అవుతున్నాయి. ప్రజా ప్రయోజనాలన్నా, చట్టమన్నా, ప్రజాస్వామ్య పద్ధతులన్నా ఏ మాత్రం గౌరవంలేని వ్యవహారశైలి పరిపాలనా యంత్రాంగానికి అలవాటయింది. ఇందులో అధికారులు, రాజకీయ నాయకులు కూడ భాగస్వాములే. బడుగు వర్గాలకు సన్నిహితులయిన వారు చట్టసభలలోకి ప్రవేశించినంత సులభంగా అధికార పదవులలో ప్రధానమైన వాటిని అందుకోలేక పోతున్నారు. అందుకోగలిగిన చోట మాత్రం పీడిత ప్రజా ప్రయోజనాలకు కొంత స్థానం దక్కుతున్నది. ఉత్తరప్రదేశ్, బీహార్ వంటి రాష్ట్రాలలో ఇది పెద్దయెత్తునే జరిగింది. వామపక్ష పార్టీలు ఎక్కువ కాలం పరిపాలించిన కేరళ, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలోను ఇది జరిగింది. కానీ ఏ వర్గానికి చెందిన రాజకీయ నాయకులకైనా పరిపాలనా వ్యవహారాలలో చట్టబద్ధత పట్ల, ప్రజాస్వామ్య పద్ధతుల పట్ల గౌరవం లేదు. ఈ పద్ధతులు పరిపాలనకు జవాబుదారీతనాన్ని ఇస్తాయని, అది ప్రజలకు, ప్రజాస్వామ్యానికి అవసరమని బడుగు వర్గాల నుండి వచ్చిన నాయకులు సైతం గుర్తించడం లేదు.

ఇక ప్రభుత్వ అధికారుల సంగతి చెప్పనవసరమే లేదు. వాళ్ళకు జవాబుదారీతనం అంటేనే అపహాస్యం అయిపోయింది. తెలిసీ చట్టానికి విరుద్ధంగా నడుచుకోవడం, ఎవరయినా ప్రశ్నిస్తే 'కావాలంటే కోర్టుకు పొమ్మ'నడం అధికారులకు, రాజకీయ నాయకులకు అలవాటయిపోయింది. అక్కడికి చట్టం గురించి పట్టింపు వుండడం కోర్టుల బాధ్యత మాత్రమే అయినట్టు. అధికారాన్ని చలాయించే వారు నియమ విరుద్ధంగా నడుచుకుంటే శిక్షించే ఏర్పాటు ఏదీ లేకపోవడం ఈ తిరస్కార వైఖరికి బలాన్ని ఇచ్చింది. చట్టం, చట్టబద్ధత అనేవి పరిపాలన ప్రజాస్వామికంగా వుండడానికి అవసరమైన జవాబుదారీతనాన్ని ఇచ్చే నియమాలుగా కాక ఒక అవరోధంగా కనిపిస్తున్నాయి మన పాలకులకు. ఎక్కువమందికి తమ అధికారానికి అవరోధంగా కనిపిస్తే కొంతమందికి తమ అభ్యుదయ లక్ష్యాలకు అవరోధంగా కనిపిస్తున్నాయి. పరిపాలన నియమబద్ధంగా లేకపోతే తమ అభ్యుదయం తిరోగమనంగా మారకుండా అడ్డుకోవడం కష్టమని, అభ్యుదయం గొడుగు కింద అవినీతి రాజ్యం చేయకుండా ఆపడం కష్టమని వాళ్ళు గుర్తించడం లేదు. పార్లమెంటరీ వ్యవస్థలోని అభ్యుదయ శక్తుల్లో కమ్యూనిస్టు పార్టీలే

ఈ విషయంలో కొంత మేలు. మరీ అజాగ్రత్తగా, నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నది ములాయంసింగ్, మాయావతి, లాలూ యాదవ్ వంటి వాళ్ళు. చాలా కాలంగా అన్నిరకాల అభ్యుదయాలకి దూరంగా వున్న 'హిందీబెల్ట్'లో గణనీయమైన మార్పు తీసుకొచ్చిన ఈ నాయకులు తమ నిర్లక్ష్యం వల్ల తామే దానిని నాశనం చేసేటట్టున్నారు. ఇప్పటికి వచ్చిన అనుభవం నుండి నేర్చుకుంటారని ఆశిద్దాం.

రాజకీయ నాయకులు నియమ విరుద్ధంగా అమలు చేయించే నిర్ణయాలు ఒకసారి కాకపోతే ఒకసారయినా పీడిత ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగా వుంటున్నాయేమో కాని ప్రభుత్వ అధికారులు మాత్రం ప్రజలను వేధించి లంచాలు రాబట్టడం కోసం, ధనవంతుల ప్రయోజనాలు సాధించి కమిషన్లు పొందడం కోసం నియమ విరుద్ధంగా ప్రవర్తించడం అలవరచుకున్నారు. అవినీతి కేవలం అక్రమంగా డబ్బు సంపాదించునే ఒక మార్గం మాత్రమే కాదు, అది పరిపాలనలో ప్రజాస్వామ్యాన్ని నాశనం చేస్తుంది.

పరిపాలనా వ్యవస్థలోను, విధానాలలోను ప్రజాస్వామ్యాన్ని పెంపొందించాలనే పట్టింపు ఎవరికీ లేకుండా పోయింది. అధికార కేంద్రీకరణ విపరీతంగా పెరిగిపోయింది. అధికారం రాను రాను కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో కేంద్రీకృతమవుతున్నది. మిగిలిన వాళ్ళు అధికారమున్నా నిర్ణయాలు తీసుకోవడానికి భయపడి 'నాకెందుకు వచ్చింది' అనుకుంటున్నారు. చట్టసభలలో రౌడీయిజం గురించి ఆందోళన చెందినంతగా మనం దీని గురించి ఆందోళన చెందడం లేదు.

ఉదాహరణకు తెలుగుదేశం ప్రభుత్వం మొదలుపెట్టిన 'జన్మభూమి' కార్యక్రమం మీద ఎన్నో విమర్శలు వచ్చాయి. కాని అన్నిటికంటే ముఖ్యమైనది అది 73వ రాజ్యాంగ సవరణలోని వికేంద్రీకరణ స్ఫూర్తికి విరుద్ధమనేది. ప్రజల శ్రమను, స్థానిక వనరులను సమీకరించి పనులు జరిపించే కార్యక్రమం గ్రామపంచాయతీలకు అప్పగించి వుంటే ఎంత కొంచెం పని జరిగినా అది 73వ రాజ్యాంగ సవరణ స్ఫూర్తికి అనుగుణంగా వుండేది, ప్రజాస్వామ్య పాలనను పెంపొందించి వుండేది. ఇప్పుడు జరుగుతున్నది గ్రామ పంచాయతీ వ్యవస్థను నిర్వీర్యం చేసి ఏకవ్యక్తి అధికారాన్ని పెంపొందించడం.

ఇక పోలీసు వ్యవస్థ గురించి చెప్పనవసరమే లేదు. చట్టానికి, తమ విధి నిర్వహణకు సంబంధమేమీ లేదని, 'శాంతిభద్రతల'ను నెలకొల్పడం కోసం తాము

ఏం చేసినా చెల్లుతుందని పోలీసు అధికారులు నమ్ముతున్నారు, బాహాటంగా ప్రకటిస్తున్నారు. దానితో మొత్తంగానే పరిపాలన ఈ రోజు వక్రరూపం తీసుకుంది. బలమున్న రాజకీయ నాయకులు, పోలీసు అధికారులు కలిసి తమ ఇష్టప్రకారం ఏలుతూ దానినే ప్రజాస్వామ్య పాలనగా చలామణి చేస్తున్నారు. ప్రజాస్వామ్యంలో నిజానికి పోలీసు వ్యవస్థకు వుండే పాత్ర చాలా చిన్నది. నేరాలను నిరోధించడం, జరిగిన నేరాలను పరిశోధించటం మాత్రమే పోలీసుల డ్యూటీ. కాని ఈ రోజు భారతదేశ పాలనా వ్యవహారాలలో పోలీసుల పాత్ర దీనిని దాటి చాలా దూరంపోయింది. సాంఘిక వ్యవహారాలలో, రాజకీయాలలో ఏది సవ్యం ఏది అపసవ్యం అనేది పోలీసులు నిర్ణయించే స్థితి వచ్చింది. బలమున్న రాజకీయ నాయకుల అండ చూసుకుని పోలీసు వ్యవస్థ విశ్వరూపం ధరించింది. 50 సంవత్సరాల స్వతంత్ర పాలన వేరే ఏ విషయాలలో ఎంత మార్పు తీసుకువచ్చిందో కానీ ఒక్క విషయంలో మాత్రం ఏ మార్పూ తేలేదు. చట్టానికి పోలీసులను జవాబుదారులు చేసే విషయంలో ఆనాడూ, ఈనాడూ పరిస్థితి ఒక్కటే. బహుశా ఈనాటి పరిస్థితి ఇంకా దిగజారిందేమో! ఒకరిని కొట్టి చంపినా, కాల్చి హతమార్చినా రెండు వారాల మొగమాటపు సస్పెన్షన్ కంటే వేరే ఏ శిక్షా పోలీసులకు లేదు. ఎన్ని ఆందోళనలు జరిగినా, కోర్టులు ఎన్నిసార్లు అభిశంసించినా ఈ పరిస్థితిలో మార్పు లేదు.

న్యాయవ్యవస్థ ఈమధ్యకాలంలో కొన్ని కేసులలో చొరవ చూపించి ప్రజల ఆశలను ఆకట్టుకుంది. అవినీతి కేసులలో గుమాస్తాలు, కానిస్టేబుళ్ళు ఇరుక్కుంటారు తప్ప ప్రధాన బాధ్యులైన రాజకీయ నాయకులు, ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్ అధికారులు తప్పించుకుంటారనే సంప్రదాయాన్ని బద్దలుకొట్టి అందరినీ బోనెక్కించడానికి ఈ మధ్య సుప్రీంకోర్టు, దానిని అనుసరించి కొన్ని హైకోర్టులు చేస్తున్న కృషి నిజంగా ప్రశంసనీయమైనది. సి.బి.ఐ కేంద్రప్రభుత్వానికి జేబుసంస్థ అనేది తెలిసిన విషయమే. కాని మన ఊరి ఎస్.ఐ మన ఊరి మున్సిఫ్ మేజిస్ట్రేట్‌కు నేరపరిశోధన స్థితిగతులు ఎప్పటికప్పుడు నివేదించినట్టు సి.బి.ఐ చేత రెండు వారాలకు ఒకసారి రిపోర్టు తెప్పించుకుని, హెచ్చరించి మందలించి పనిచేయించిన ఘనత కూడ కోర్టులకు దక్కింది.

అయితే కోర్టులు ప్రదర్శిస్తున్న ఈ అసాధారణ అభినివేశాన్ని మెచ్చుకునేటప్పుడు రెండు విషయాలు దృష్టిలో పెట్టుకోవాలి. ఒకటి – కోర్టులు తాము ఎంపిక చేసుకున్న

కొద్ది విషయాలలో మాత్రమే ఈ చొరవ ప్రదర్శిస్తున్నాయి. ఎంపిక చేసుకోవడంలో దురుద్దేశాలు వున్నాయనుకోనవసరం లేదు. కాని ప్రజాస్వామ్యానికి, ప్రజల హక్కులకు సంబంధించిన అన్ని విషయాలలోనూ కోర్టులు ఒకే రకంగా చొరవ ప్రదర్శిస్తే బాగుండేది. అది లేనప్పుడు న్యాయమూర్తులు ప్రధానమనుకున్న అంశాల మేరకే న్యాయవ్యవస్థ ప్రజాస్వామ్యాన్ని కాపాడుతుంది. ఉదాహరణకు ప్రజల ప్రాణాలపైన, స్వేచ్ఛపైన పోలీసులకు, సైనిక బలగాలకు విపరీతమైన అధికారాలు ఇచ్చే కల్లోలిత ప్రాంతాల చట్టాన్ని, సాయుధ బలగాల (ప్రత్యేక అధికారాల) చట్టాన్ని సవాలుచేసే పిటిషన్‌లు సుప్రీంకోర్టులో ఒక దశాబ్దం పైగా పెండింగ్‌లో వున్నాయి. హవాలా కేసుల విషయంలో ఆ కోర్టు చూపిన చొరవలో నూరవ వంతు ఈ పిటిషన్ల విషయంలో చూపించి వుంటే అవి ఈపాటికి ముగింపుకు వచ్చేవి.

ప్రజల మౌలిక హక్కులకు సంబంధించిన మంచి తీర్పులు ఈ 50 ఏళ్ళలో కోర్టులు ఇవ్వనే లేదని కాదు, ఇచ్చాయి. ప్రాథమిక విద్య, ఆరోగ్యం, పరిశుభ్రమైన పరిసరాలు ప్రాథమిక హక్కులని, కోర్టులలో న్యాయసహాయం పొందడం ముద్దాయి ప్రాథమిక హక్కని, ఖైదీలకు కూడ పౌరహక్కులుంటాయని, ప్రాణాన్ని, స్వేచ్ఛను హరించే ఏ చట్టమైనా హేతుబద్ధంగా, న్యాయంగా, నిష్పాక్షికంగా వుండాలని, కులపరమైన రిజర్వేషన్లు చెల్లుతాయని యిత్యాది తీర్పులు అనేకం 1980 తర్వాత సుప్రీంకోర్టు ఇచ్చింది. అలాగే ఎన్‌కౌంటర్ అనేది హత్యేనని, దానిపైన నిష్పాక్షికమైన విచారణ జరగాలని మన రాష్ట్ర హైకోర్టు రెండేళ్ళ క్రితం తీర్పు ఇచ్చింది. అరెస్టుకు, ఇంటరాగేషన్‌కు సంబంధించి పోలీసులు తప్పనిసరిగా పాటించవలసిన నియమాలను ఈ సంవత్సరం జనవరి నెలలో డి.కె. బసు కేసులో సుప్రీంకోర్టు క్రోడీకరించి ప్రకటించింది. అయితే ఈ తీర్పులలో ఎక్కువ భాగం అమలు కావడం లేదు. ప్రభుత్వం మీద ఒత్తిడిపెట్టి అమలు చేయించే శక్తి కోర్టులకు లేదు. న్యాయవ్యవస్థ సామర్థ్యం అంతిమంగా అధికార యంత్రాంగం సహకారం మీద ఆధారపడి వుంటుందని గుర్తించాలి.

రెండవ విషయమేమిటంటే మన జీవితాలను శాసించే నిర్ణయాలు తీసుకునే వారందరిలోకి ప్రజలకు అత్యంత దూరంగా వుండేవాళ్ళు న్యాయమూర్తులు. బడుగు వర్గాలలో పుట్టినవాళ్ళు ఆ పదవులలోకి ప్రవేశించినా న్యాయమూర్తుల జీవనశైలే

వాళ్ళను ప్రజల నిత్యజీవితానికి దూరం చేస్తుంది. అటువంటి న్యాయమూర్తులు ఎంత నిజాయితీపరులైనా ప్రజలు అవస్థలను ఎరిగి వాటి వెలుగులో చట్టాన్ని వ్యాఖ్యానిస్తారని ఎల్లప్పుడూ నమ్మకోవడం కష్టమే. ఈ మధ్య కేరళ హైకోర్టు 'బంద్‌లు నిర్వహించడం రాజ్యాంగ విరుద్ధం' అంటూ యిచ్చిన తీర్పు దీనికి ఒక నిదర్శనం. ఆర్థిక సరళీకరణ పేరిట ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాల రాజ్యాంగబద్ధతను పరీక్షించడానికి కోర్టులు ప్రదర్శిస్తున్న అసంసిద్ధత ఇంకొక నిదర్శనం. ఒక రాష్ట్రంలో కేంద్రపాలన విధించమని సూచించడానికి గవర్నర్ సిద్ధంగా లేకపోతే తానే సూచిస్తానని పాట్నా హైకోర్టు నిన్నమొన్న ఇచ్చిన తీర్పు మరొక నిదర్శనం. ప్రజాస్వామ్యానికి సంబంధించిన అన్ని వ్యవస్థలలోకి ప్రజలకు ఎక్కువగా అందుబాటులో వుండేవి, ప్రత్యక్షంగానే ప్రజలకు అంతో ఇంతో జవాబుదారుకాక తప్పని స్థితిలో వుండేవి రాజకీయపార్టీలే. వాటిని చక్కదిద్దుకోగలిగితే మంచిది. ప్రజాస్వామ్యాన్ని కాపాడడంలో న్యాయవ్యవస్థకుండే పాత్ర తక్కువది కాదు. కానీ న్యాయవ్యవస్థే కాపాడుతుందని నమ్ముకునే స్థితికి రావడం ఆరోగ్య లక్షణం కాదు.

చివరిగా – మొత్తంగానే ప్రజాస్వామ్యం పరిధి నుండి వెలుపలికి నెట్టివేసి, ప్రభుత్వ సాయుధ బలగాల చేతికి అప్పగించిన ప్రాంతాల గురించి చెప్పుకోవాలి. ప్రజాస్వామ్య పతనానికి యిదొక సూచిక. కాశ్మీర్, అస్సాం, నాగాలాండ్, త్రిపుర, మిజోరం, మన రాష్ట్రంలోని తెలంగాణ ఏదో ఒక మేరకు ఈ కోవలోకి వస్తాయి. ఈ ప్రాంతాలన్నింటి లోనూ రకరకాల రాజకీయాలు గల సాయుధ పోరాటాలు నడుస్తున్నాయి. ప్రతి పోరాటానికీ ఒక సామాజిక సందర్భం వుంది. పునాది వుంది. ఇటువంటి పోరాటాలు రావడమే ప్రజాస్వామ్య వ్యవస్థ వైఫల్యాన్ని సూచిస్తుంది. ప్రజాస్వామ్యం జవాబు చెప్పని సమస్యలు తుపాకులకు పునాది అవుతున్నాయి. స్వాతంత్ర్యం వచ్చినప్పుడు ఒక్క తెలంగాణ సాయుధ పోరాటం మాత్రమే వుండేది. దానిని 1952లో ఆ పోరాట నాయకులే విరమించుకున్నారు. ఆ తర్వాత 1957లో నాగాలాండ్‌లో సాయుధ ఉద్యమం మొదలైంది. అటు తర్వాత వివిధ ప్రాంతాల్లో సాయుధ ఉద్యమాలు తలెత్తాయి. ఇప్పుడు దేశంలో చాలా ప్రాంతాలలో ఇటువంటి ఉద్యమాలు వున్నాయి. ఈ పరిస్థితి రావడానికి ప్రజాస్వామ్య వ్యవస్థ వైఫల్యం కొంతవరకు కారణం కాగా, ఆ స్థితిని ఎదుర్కోవడానికి ప్రజాస్వామ్య వ్యవస్థకు బలం కల్పించే బదులు దానిని మరింత

పూర్తిగా ధ్వంసం చేసే మార్గాన్ని మన పాలకులు ఎంచుకున్నారు. పోలీసులకు, సాయుధ బలగాలకు వికృతమైన అధికారాలు ఇచ్చే చట్టాలు చేశారు. న్యాయవ్యవస్థ ఆదర్శాలను అపహాస్యం చేసే నేరస్మృతిని రూపొందించారు. ఏ చట్టం, ఏ న్యాయం లేకుండా కాల్చి చంపి ఎన్‌కౌంటర్ అని ప్రకటించే అలిఖిత అధికారం పోలీసులకు, జవాన్లకు యిచ్చారు.

భారతదేశంలో ప్రజాస్వామ్యం వేళ్ళూనింది. బ్రిటిష్ వారి సందేహం నిజం కాలేదు. కానీ వేళ్ళూనిన మొక్క సక్రమంగా ఎదగడం లేదు. కొంతమందికి అధికారం చలాయించడానికి, డబ్బులు పోగు చేసుకోవడానికి ఉపయోగపడే సాధనంగా మిగిలిపోతుందా అని మరీ విసుగు వచ్చినప్పుడు నిరాశగా అనుకునేంతగా సంక్షోభంలో పడింది. ఆ నిరాశ సహేతుకం కాదని నమ్మడానికి కావలసిన సంకేతాలు వున్నాయి. రాజకీయాలలోనూ వున్నాయి. న్యాయవ్యవస్థలోనూ వున్నాయి. సంకల్పం పెంచుకుని కృషి చేస్తే ఈ మొక్కను బ్రతికించుకోవచ్చు.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*19 ఆగస్టు 1997*



# ఆదుర్దా ఆందోళన ఆశ భయం



ఫిబ్రవరి నెలలో జరగనున్న ఎన్నికలను, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌ను చాలామంది చాలా ఆసక్తిగా గమనిస్తున్నారని ఇంగ్లీషు పత్రికలలో వార్తలొస్తున్నాయి. ప్రపంచబ్యాంకు సలహాలన్నిటినీ తుచ తప్పకుండా పాటిస్తున్న చంద్రబాబునాయుడుకు వోట్లు వస్తాయా రావా అని వారంతా ఆసక్తిగా చూస్తున్నారంట.

ఇళ్ళూ, అంగళ్ళూ కూల్చి రోడ్డు వెడల్పు చేయమంటే చేసేస్తున్నాడు. పేదవాళ్ళ జీవించే హక్కునే కాకుండా ధనవంతుల ఆస్తి హక్కును కూడ ఖాతరు చేయకుండ చేసేస్తున్నాడు. చవక బియ్యం ధర పెంచమంటే పెంచేశాడు. కరెంటు సబ్సిడీ తగ్గించమంటే తగ్గించాడు. ప్రభుత్వరంగంలో ఉద్యోగాలు సంవత్సరానికి 10 వేల చొప్పున తగ్గించమంటే ఇదిగో తగ్గించేస్తానంటున్నాడు. సాంఘిక సంక్షేమం వృథా ఖర్చంటే దానికి కోత పెడుతున్నాడు. ప్రభుత్వరంగం, సహకారరంగం పనికిరావనీ, ప్రైవేటే గొప్ప అనీ అనగానే మిర్యాలగూడెం, హిందూపురం చక్కెర ఫ్యాక్టరీలు అమ్మేశాడు; ఆల్విన్ ఆటోనూ, గుంతకల్ స్పిన్నింగ్ మిల్లునూ మూసేశాడు; మరణశయ్య మీద ఉన్న సర్‌సిల్క్ (కాగజ్‌నగర్)కు అంత్యక్రియలు చేసేశాడు; నంద్యాల చక్కెర ఫ్యాక్టరీనీ, ప్రొద్దుటూరు పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీనీ అమ్మకానికి పెట్టాడు. చిన్న పరిశ్రమలకు ప్రభుత్వం చేయూతనివ్వడం దండగ అనీ, అవి తట్టుకుంటే తట్టుకుంటాయి లేకపోతే పోతాయనీ అనగానే రాష్ట్ర చిన్న పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్‌ను మూసేయడానికి సిద్ధమయ్యాడు. కరెంటు బోర్డును పునర్వ్యవస్థీకరించి లాభాలు వచ్చే ఉత్పత్తి రంగాన్నీ పంపిణీ రంగాన్నీ ప్రైవేట్‌పరం చేసి, లాభాలురాని సరఫరా రంగాన్ని ప్రభుత్వ రంగంలో

ఉంచమంటే – దానివల్ల రైతుల వ్యవసాయ మోటార్ల కరెంటు బిల్లు విపరీతంగా పెరిగే ప్రమాదం ఉన్నప్పటికీ – అలాగేనంటున్నాడు.

ఇన్ని చేసినప్పటికీ అతగాడికి వోట్లు వచ్చేటట్టయితే, 'సరళీకరణ' రాజకీయంగా సక్సెస్ అయినట్టేనని పాశ్చాత్య పరిశీలకుల అభిప్రాయం. అప్పుడిక దేశ ఆర్థిక పునర్వ్యవస్థీకరణ పాశ్చాత్యులకు ప్రియమైన నమూనాలో అప్రతిహతంగా ముందుకు పోగలదు. అందువల్ల, సరళీకరణ విధానాలు అమలు చేయడంలో అతి చురుగ్గా వ్యవహరిస్తున్న చంద్రబాబు గతి ఏమవుతుందని వారు చాలా ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారు. భారతదేశం పార్లమెంటరీ ప్రజాస్వామ్య పంథానూ, చట్టబద్ధపాలనా విధానాన్నీ (రూల్ ఆఫ్ లా) ఎంచుకున్నందుకు ఒకప్పుడు అభినందించిన పాశ్చాత్యులు ఇప్పుడు దానినే ఒక ఆటంకంగా చూస్తున్నారు (కానీ ఆ మాట బిగ్గరగా అనలేక సణుగుతున్నారు). ఈ ప్రజాస్వామ్యమే లేకపోతే సంక్షేమం, సబ్సిడీలు మొదలైన (గ్లోబలైజేషన్ పరిభాషలో వీటిని ప్రజాతంత్ర విధానాలని కాక 'ప్రజారంజక' విధానాలు అని వెక్కిరింతగా అంటారు) వృథా ఖర్చుల నుండి మూడవ ప్రపంచదేశాల ప్రభుత్వాలు సులభంగా బయటపడగలిగేవి కదా అని ఇప్పుడు వారు అనలేక అంటున్నారు. గత పార్లమెంట్ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ ఓడిపోయినప్పుడు, సరళీకరణ ఆర్థిక విధానాలు ప్రజలకు మంచివని నచ్చజెప్పడంలో ఆ పార్టీ విఫలం కావడమే వారి ఓటమికి కారణం అని పాశ్చాత్య పత్రికలు విశ్లేషించాయి. అవి తమకు మంచివి కావని బహుశా ప్రజలు గుర్తించారేమోనన్న సందేహం వారికి రాలేదు.

వెరసి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్నీ చట్టబద్ధపాలననూ వదులుకొమ్మని మన పాలకులకు పాశ్చాత్య సలహాదారులు ఇప్పటకింకా సలహా ఇవ్వకపోయినప్పటికీ, వీరే వాటిని వదిలించుకునే ప్రయత్నం చేస్తే మాత్రం ఒకనాటి ఎమర్జెన్సీని విమర్శించినట్టు ఇప్పుడు విమర్శించకపోవచ్చు. అంతేకాక, ప్రజలపట్ల పాలన వ్యవస్థ జవాబుదారీతనాన్ని ఇప్పుడున్న దానికన్నా (ఇప్పుడు చాలా ఉందని కాదు) తగ్గించే అధ్యక్షతరహా పాలన వంటి ప్రత్యామ్నాయ ప్రతిపాదనలకు పాశ్చాత్య పరిశీలకుల మద్దతు, వారి బలమైన ప్రసార సాధనాలలో ప్రచారమూ బాగా లభించగలవు. కానీ మనకిప్పుడు కావలసింది జవాబుదారీతనాన్ని తగ్గించే ప్రత్యామ్నాయాలు కావు. పెంచే ప్రతిపాదనలు. నూతన ఆర్థిక విధానాల శకం ఈ అవసరాన్ని బలంగా మన ముందుకు తెచ్చింది. ప్రజల

అనుమతితో నిమిత్తం లేకుండా దేశ ఆర్థిక విధానాలను ఇష్టమొచ్చినట్టు మార్చిపారేస్తున్నారు. అందువల్ల ఎన్నికలను జవాబుదారీతనం కోణం నుండి చూడవలసిన అవసరం ఉంది. జవాబుదారీతనాన్ని ఏ విధంగా తగ్గించుకోవాలా అని చూస్తున్న 'గ్లోబలైజేషన్' కళ్ళతో కాదు.

గత పార్లమెంట్‌ను అలంకరించిన పార్లమెంటు సభ్యులు ఎన్నికలను ఇంకొక కారణంగా ఆదుర్దాగా చూస్తున్నారు. గెలవడానికి ఒక్కొక్కరు (కనీస పక్షం) 1 కోటి రూపాయలు ఖర్చుపెట్టుకున్నారు. ఆ డబ్బును వడ్డీతో సహా వసూలు చేసుకుందామని అనుకున్నారు. కానీ వడ్డీ కాదు కదా అసలు కూడ రికవర్ కాకుండానే మళ్ళీ ఎన్నికలొచ్చాయి. తిరిగి అంత ఖర్చు పెట్టుకుంటే గిట్టుబాటయ్యేనా? కానీ ధైర్యం చేయకపోతే నెగటివ్ బ్యాలన్స్ పూరించుకునేదెట్టా? (అన్ని పార్టీలూ బహుశా ఎప్పటికంటే ఎక్కువగా సిట్టింగ్ ఎంపీలకే టికెట్టు ఇవ్వడం వెనుక ఉన్న కారణం ఇదేనని అందరూ గుర్తించే ఉంటారు.) ఎన్నికలు డబ్బు మూటల వ్యవహారంగా మారిపోవడం మనకు కూడ ఎంతగా అలవాటయిపోయిందంటే వాళ్ళట్లా అనుకోవడంలో తప్పేమీ లేదని మనకు కూడ అనిపిస్తుంది. వ్యవస్థితంగా జరిగేదేదయినా కొన్నాళ్ళకు ప్రకృతి సిద్ధమన్నంత సహజత్వాన్ని సంతరించుకుంటుంది. దానికి వేరే ఏ బలమూ లేకున్నా ఇదే ఒక బలం. (దీనిని రాడికల్ తత్వవేత్తలు 'భావజాలం' అంటారుగానీ ఇది నిజానికి తన మనుగడలో సుస్థిరతను వెతుక్కునే మానవ లక్షణానికి పర్యవసానం. అందుకే ఇటువంటి ఆలోచనా రీతులను ప్రతిఘటించడం అంత కష్టం.)

కాని డబ్బు మూటల ప్రజాస్వామ్యం ప్రజలకు ప్రాతినిధ్యం వహించే పాత్రను ఏ మేరకు పోషించగలుగుతుంది? బడుగు బలహీనవర్గాలకు పాలనా వ్యవస్థలో చోటెంత ఇవ్వగలుగుతుంది? ఇవి కొత్త ప్రశ్నలు కావు. కానీ ఈనాడు కొత్తగా ముందుకొస్తున్న రాజకీయ ఆకాంక్షలకు జవాబు దొరకాలంటే డబ్బు మూటల రాజకీయాలను గట్టిగా వ్యతిరేకించాలి. స్త్రీలకు చట్ట సభలలో మూడవవంతు సీట్లు కేటాయించడం గురించి గత పార్లమెంటులో చాలా చర్చ జరిగింది. ఇప్పుడు ఏ పార్టీ స్త్రీలకు మూడవవంతు కాదు సరికదా, పదవవంతు టికెట్లు కూడ ఇవ్వలేదు. పార్లమెంటు ఎన్నికలలో అభ్యర్థులయిన వారు (గెలవదలచుకుంటే) ఒక కోటి రూపాయల దాకా ఖర్చుపెట్టుకోక తప్పని ప్రస్తుత పరిస్థితిలో స్వంత ఆస్తులూ స్వంత ఆదాయమూ లేని స్త్రీలు గెలవగల

అభ్యర్థులుగా ఎట్లా కనిపిస్తారు? అట్లాగే దళితులయినా ఆదివాసులయినా? డబ్బున్న పార్టీలు (లేక పోషకులు) వారి కోసం ఖర్చు పెట్టదలచుకుంటేనే కనిపించగలరు. అది కొద్దిమందికి మాత్రమే సాధ్యం. అంతేకాక, అది వారి స్వతంత్రతకు గొడ్డలిపెట్టు కూడ.

మన పత్రికలు కూడ ఎన్నికలను ఒక రకంగా ఆదుర్దాగానే చూస్తున్నాయి. అసలు ప్రజాస్వామ్యంలో తన పాత్ర ఏమిటో పత్రికా రంగం గుర్తిస్తున్నట్టు కనిపించదు. పార్టీల అడ్వర్‌టైజ్‌మెంట్లతో పైసలొస్తాయి కాబట్టి సగం పేజీలు వాటితో నింపడాన్ని ఎంత అయిష్టంగానైనా అర్థం చేసుకోగలం (పత్రికలు నడపడం ఒక వ్యాపారం కూడ కాబట్టి). కానీ ఎన్నికల విషయంలో పత్రికలకు ఉండే పాత్ర ఏమిటో గుర్తించలేక పోవడాన్ని అర్థం చేసుకోలేము, అర్థం చేసుకోవలసిన అవసరమూ లేదు (అదొక ప్రజాతంత్ర సంస్థ కూడ కాబట్టి). ఎవడి బలం ఎంత, ఎవడెంత చాకచక్యంగా తన బలం పెంచుకుంటున్నాడు, ఎంత నేర్పుగా 'పావులు కదుపుతున్నాడు' (ఎన్నికలు ఒక చదరంగపు ఆటయినట్టు), ఏవి 'గెలుపు గుర్రాలు' (అదొక గుర్రప్పందెం అయినట్టు) అని విశ్లేషించడమే తమ పాత్ర అని మన పత్రికలు అనుకుంటున్నాయి. పత్రికలు చూపిస్తున్న చిత్రాన్నే నమూనాగా తీసుకుంటే ఎన్నికలు ఒక జూదంగా కనిపిస్తాయి తప్ప ప్రజాస్వామ్యానికి సంబంధించిన ప్రక్రియగా కనిపించవు. సారా వ్యాపారం నుండి వచ్చిన డబ్బుతో మనుషులను, వారి ఓట్లను కొనుక్కునేవారు, గూండాల గుంపులను చేరదీసి పోషించేవారు, బాంబులు తయారు చేయించేవారు, ఏ పార్టీలో చేరితే టిక్కెట్ వస్తుందో వేచి చూసి ఆఖరి నిమిషంలో ఆ పార్టీలోకి దూకి దానికి ఒక సిద్ధాంతం చెప్పేవారు – అందరూ ఈ జూదంలో తెలివైన ఎత్తులు వేసే ఆటగాళ్ళుగానే కనిపిస్తారు. మన రాజకీయాల దిగజారుడుతనానికి పత్రికారంగం తన వ్యాఖ్యల సంస్కృతి ద్వారా సాధికారత కల్పిస్తున్నది (మధ్య పేజీ సంపాదకీయంలో వేరే ఏమి రాసినప్పటికీ).

ఈసారి మన పత్రికలు ఒక కొత్త కర్తవ్యాన్ని తమ మీద వేసుకున్నాయి. సామాజిక ఆర్థిక న్యాయం కావాలన్న కోరిక సమాజం కింది పొరలలో ఎంతగా పెరుగుతున్నదో 'సుస్థిరత' కావాలన్న కోరిక పై పొరలలో అంతగా పెరుగుతున్నది. పై పొరలు అంటే బడా భూస్వామ్య, బడా పెట్టుబడిదారీ వర్గాలే అనుకోనవసరం లేదు. దొంతరలుగా ఉన్న మన సాంఘిక ఆర్థిక వ్యవస్థలో 'సుస్థిరత' కావాలన్న

కోరిక చాలామందిలో ఉండగలదు. వారు సంఖ్యరీత్యా అన్ని వేళలలోనూ మైనారిటీయే కానవసరం లేదు. చిన్న మైనారిటీ మాత్రం కారు. అంతేకాక, సరళీకృత విధానాల పట్ల ఆకర్షితులవుతున్న మధ్యతరగతి జనంలో మరొక రూపంలో సుస్థిరత కాంక్ష పెరుగుతున్నది. గ్లోబలైజేషన్ వారికి చూపిస్తున్న కొత్త హంగులను అనుభవించాలంటే సుస్థిరత అవసరం. మన పత్రికారంగం ఈ సుస్థిర కాంక్షను (పత్రికా యజమానులే కాక సిబ్బందిలో కూడ అధికులు సుస్థిరత కోరుకుంటున్న ఏదో ఒక సామాజిక పొరకు చెందినవారు కావటం వల్ల) బాగా ఒంటబట్టించుకునింది. దానికి సమాధానం బి.జె.పిలో ఉందని భావించి ఆ పార్టీ గెలుపు అనివార్యం అనే పద్ధతిలో ప్రతికారంగం వార్తలను వ్యాఖ్యానిస్తూ ఉంది. (వాజ్‌పేయి పేరు ప్రస్తావించినప్పుడల్లా కాబోయే ప్రధాని అనేసి నాలుక కరుచుకున్న గొంతు వినిపిస్తుంది).

అయితే పత్రికారంగాన్ని సాంఘికంగా విశ్లేషించినప్పుడు ఇదెంత సహజమో, ఒక ప్రజాతంత్ర సంస్థగా దాన్ని అర్థం చేసుకున్నప్పుడు అది అంత తప్పు. ఆ రంగాన్ని సామాజికంగా విశ్లేషించి, అందులో ఉన్న వాళ్ళు ఎక్కువగా అగ్రకుల మధ్యతరగతికి చెందిన మగవాళ్ళనీ, యాజమాన్యం అంతకంటే ఎక్కువ పెత్తందారీ స్వభావంగల సామాజిక శ్రేణులకు చెందినవారనీ గుర్తించి ఈ ప్రవర్తన సహజం అనుకొని ఊరుకోకుండా, దానికి ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉన్న పాత్రను దృష్టిలో పెట్టుకొని ఈ వైఖరిని విమర్శించడం, నిలదీయడం అవసరం. సామాజిక జీవితంలో అసమానతలు, అణచివేత పూర్తిగా పోకుండానే ప్రజాస్వామ్య వ్యవస్థలు, విలువలు ఉనికిలోకి వచ్చాయి. సమానతాకాంక్ష నుండే అవి వచ్చాయి. సమాజంలో అసమానతలు ఇంకా కొనసాగుతుండడం వల్ల ఇవేవీ సంపూర్ణంగా ఉండవు. వాటిని సాంఘికంగా విశ్లేషించి అవి అసంపూర్ణంగానే ఉంటాయని తీర్మానించి కొట్టిపారేయడం సులభమే. కానీ అపరిపూర్ణమైనా వాటిలో అర్థవంతమైన సారం ఉందని గుర్తించి సాంఘిక విశ్లేషణకు విలువల విశ్లేషణను తోడుచేసినప్పుడే చారిత్రక ప్రగతిని కాపాడుకోగలుగుతాం, అనుభవించగలుగుతాం. ఇంకింత ప్రగతిని సాధించుకోగలుగుతాం.

మన రాష్ట్రంలోని తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల ప్రజలు ఇంకొక రకమైన ఆదుర్దాతో ఎన్నికల కోసం ఎదురుచూస్తున్నారు. తెలంగాణలో ఒక దశాబ్దకాలంగా ప్రతి ఎన్నికా ఆదుర్దా కలిగించే విషయమే అయింది. ప్రజాభీష్టం ఎన్నికల ద్వారా

వ్యక్తం కావడానికి అంతకంటే ప్రతికూలమైన వాతావరణం వేరొకటి ఉండదు. ఎన్నికలలో నిర్భయంగా పాల్గొనటం, స్వేచ్ఛగా బహిష్కరించటం అనే ప్రత్యామ్నాయాల పేరిట తెలంగాణలో (ముఖ్యంగా ఉత్తర తెలంగాణలో) ఒక బీభత్స వాతావరణం నెలకొని ఉంది. ఒక రకంగా ఇవి రెండూ అబద్ధాలే. నిజం చెప్పాలంటే సగటు పౌరులకు ఈ రోజు ఓటు వేయాలని పెద్దగా ఉత్సాహమూ లేదు, ఓటు బహిష్కరించి నెలకొల్పుకునే ఆచరణాత్మకమైన ప్రత్యామ్నాయం ఒకటి ఉందన్న విశ్వాసమూ లేదు. ('సగటు పౌరులు' అంటున్నామంటేనే దీనికి రెండువైపులా మినహాయింపులు లేకపోలేదని అర్థం.) వాళ్ళపాటికి వాళ్ళను వదిలేస్తే అన్ని ప్రాంతాలలాగా తెలంగాణలో కూడ సగంమందో అంతకంటే కొంచెం ఎక్కువమందో ఏమంత ఉత్సాహం లేకుండ వోటు వేస్తారు. మిగిలిన వాళ్ళు ఏమంత పట్టుదల లేకుండా ఇంట్లో ఉండిపోతారు. ప్రజలలో లేని ఉద్విగ్నతను ఒక పక్క పోలీసులు, ఇంకొక పక్క పీపుల్స్‌వార్ సృష్టిస్తున్నారు. ప్రతిసారీ అభ్యర్థుల జీపుల కాల్చివేత, ప్రచార కార్యకర్తలపై, నాయకులపై ప్రాణాంతకమైన దాడులు, పోలీసు జీపులపైన మందుపాతరల ప్రయోగం, ఓట్ల డబ్బాల అపహరణ ఒక పక్క; వందలాదిగా యువకుల నిర్బంధం, ఎన్‌కౌంటర్లు, ఎన్‌కౌంటర్ చేస్తామన్న బెదిరింపులు, బలవంతంగా అందరూ లైన్‌కట్టి ఓట్లు వేయాలన్న ఒత్తిడి ఇంకొక పక్క తెలంగాణలో ఎన్నికల వాతావరణాన్ని భీతావహం చేస్తున్నాయి. ఈ అర్థరహితమైన స్థితి నుండి ఈసారయినా విముక్తి ఉంటుందా అని తెలంగాణవాసులు భయం భయంగా ఎదురుచూస్తున్నారు. 'ఎన్నికల బహిష్కరణ కోసం ఈసారి బలప్రయోగం చేయం' అన్న పీపుల్స్‌వార్ నాయకుడి ప్రకటననూ, వెనువెంటనే 'అయితే ప్రజాకంటకులనూ ప్రజా ద్రోహులనూ ప్రచారం చేసుకోనివ్వం' అని వారు చేసిన సవరణనూ, దినపత్రికల జిల్లా పేజీలలో ప్రచురితమవుతున్న స్థానిక దళనాయకుల బెదిరింపు ప్రకటనలనూ పోల్చి పోల్చి చూసుకొని వీటి భావం ఏమయి ఉండవచ్చునా అని చర్చించుకుంటున్నారు. అటువైపు, 'వోటర్లకు నిర్భయంగా వోటు వేయడానికి ధైర్యం కలిగించడం మా కర్తవ్యం' అని రాష్ట్ర డిజిపిగారు ప్రకటించడాన్ని 1994 అసెంబ్లీ ఎన్నికలనాటి రక్తసిక్తమైన జ్ఞాపకాల వెలుగులో వ్యాఖ్యానించుకొని ఖాకీ సంరక్షకులు ఈసారి ఇయ్యబోయే 'ధైర్యం' ఎంత బీభత్సంగా ఉంటుందోనని ఆందోళన చెందుతున్నారు. ('వాక్యాలమధ్య చదవడం' అని ఇంగ్లీషులో అంటారు. తుపాకుల ఘర్షణ మధ్య బతుకుతున్న తెలంగాణవాసులకు ఈ విద్య బాగా అబ్బింది.) ప్రజలు

ఓట్లు వేస్తారా లేదా అన్నది వేరే సంగతి కానీ ఈ బీభత్స వాతావరణం ఎన్నికల ప్రక్రియ పట్ల ప్రజలు ఆలోచనాత్మకంగా చైతన్యవంతంగా వ్యవహరించడానికొక పెద్ద ఆటంకం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ప్రాతినిధ్య పాలనకొక సాధనంగా చరిత్రలో ముందుకొచ్చింది. అది ఇచ్చే ప్రాతినిధ్యం లోపభూయిష్టమైనదే కాని వట్టి బూటకం కాదు. దానిని సంస్కరించుకోవడానికయినా, ప్రత్యామ్నాయం వెతుక్కోవడానికయినా ఆలోచనాత్మకంగా, క్రియాశీలకంగా వ్యవహరించడం అవసరం. తుపాకీ తూటాల మోత మధ్యన అది సాధ్యం కాదు. మెదళ్ళు మొద్దుబారిపోయి భయానికి తల ఒగ్గడం, లేదా ఏదో ఒక తుపాకీకి విధేయత ప్రకటించడం మాత్రమే జరుగుతుంది.

రాయలసీమ జిల్లాలలో ప్రజలు ఇంకొక రకమైన ఆదుర్దాతో ఎన్నికల కోసం ఎదురుచూస్తున్నారు. బాంబులు పడకుండ, తలలూ మొండాలూ వేరు కాకుండ ఎన్నికలు గడిస్తే చాలునన్న వాతావరణం అక్కడ చాలాకాలంగా నెలకొని ఉంది. అభ్యర్థులిద్దరూ రాజీపడి చెరికొన్ని ఓట్లు ప్రశాంతంగా గుద్దుకొనిపోతే అదే ప్రజాస్వామ్యం అనుకునే దుస్థితి రాయలసీమకు వచ్చింది. ఈసారి కర్నూలులో రెండు తరాల విరోధులైన కోట్ల విజయభాస్కరరెడ్డి, కె.ఇ. కృష్ణమూర్తులు తలపడుతున్నారనీ, నంద్యాలలోని ఆళ్ళగడ్డ తాలూకాలో భూమా నాగిరెడ్డి ఎన్ని ఓట్లు వేయించుకుంటాడో పాణ్యంలో అన్నీ వేయించుకోవడానికి కాటసాని రాంభూపాలరెడ్డి సిద్ధమవుతున్నాడనీ (రాయలసీమలో వోట్లు వేసేవి కావు, వేయించుకునేవే), కడపలో గత ఎన్నికలలో చావుతప్పి కన్నులొట్టపోయిన పరాభవానికి వై.ఎస్. రాజశేఖరరెడ్డి ఈసారి ప్రతీకారం తీర్చుకోబోతున్నాడనీ తెలిసి రాయలసీమవాసుల ఆదుర్దా మరింత పెరిగింది. రాయలసీమలో రాజకీయం బాంబులను దాటి ఆలోచనల సీమలోకి ప్రవేశించనట్టే రెడ్లను దాటి కిందికి దిగలేదు. దళితుల దగ్గరికయితే అసలు రానే లేదు. ఈ ఒక్క విషయం రాయలసీమ ప్రత్యేకత కాదు. సర్కారు జిల్లా లోని అనేక గ్రామాలలో కూడ ప్రజాస్వామ్యం 'ఊరు' దాటి 'పల్లె'లోకి ఇప్పటికీ ప్రవేశించలేదు. దానిని కిందికి లాగడానికి ఎన్నికల ప్రక్రియ కొంత ఉపయోగపడగలదు కానీ ఇంతటి భయ వాతావరణంలో కాదు. నిజానికి ఈ భయ వాతావరణం నెలకొల్పడంలో పెత్తందారీ వర్గాలకున్న ప్రయోజనాలలో అదొకటి. రాజకీయాలు తమ గడప దాటి కిందికి పోకుండా ఉంటాయి.

ఒకరికి ఆదుర్దా, ఒకరికి ఆందోళన, ఒకరికి ఆశ, ఒకరికి భయం – ఎన్నికల సార్థకత ఇదేనా? పాలనలో జవాబుదారీతనాన్ని నెలకొల్పడానికీ, సమాజ ప్రజాస్వామీ కరణకూ – కనీసం ఒక మేరకయినా – ఉపయోగపడవలసిన ఎన్నికలు ఏవేవో ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నాయి. పెత్తనం కోసం, ఆస్తి సంపాదన కోసం, 'మీరే మమ్మల్ని ఎన్నుకొన్నారు కాబట్టి మేము ఏం చేసినా దానికి మీరు సమ్మతించినట్టే'నని ప్రజలను దబాయించడం కోసం, సమాజంలో బలవంతులైన వారు రాజకీయ బలం కూడ సమకూర్చుకొని రెండు బలాలనూ పదిలంగా కాపాడుకోవడం కోసం, గూండాలకూ, రౌడీలకూ భృతి కోసం, ఇంకా ఎవరెవరికో దేనికోసమో ఉపయోగ పడుతున్నాయి. ఇన్ని ఆటంకాలు దాటి – కొంతమేరకు ఈ లక్షణాలను తాము కూడ ఒంటబట్టించుకొని – దళిత బహుజన రాజకీయవేత్తలు దేశంలో కొన్నిచోట్ల ఎన్నికలు గెలిచి రాజకీయ అధికారంలోకి ప్రవేశించి సాంఘికంగా అభ్యుదయకరమైన మార్పు కొంత తేగలిగారు. సామాజిక మార్పుకు ఎన్నికల ప్రజాస్వామ్యం అసలే ఉపయోగపడదనేది వాస్తవం కాదని రుజువు చేయగలిగారు.

అయితే సామాజిక సంబంధాలలో మార్పుకు దోహదపడే లక్షణంతోపాటు ప్రజలపట్ల పరిపాలనకు జవాబుదారీతనాన్ని కల్పించే ప్రయోజనం కూడ ఎన్నికల ప్రజాస్వామ్యానికి ఉండాలి. అది మన దేశంలో చాలా అపరిపూర్ణంగా ఉందనేది వాస్తవం. ఏమైనా చేసి, ఏమైనా మాట్లాడి చలాయించుకోవచ్చునని మన దేశ రాజకీయ నాయకులు భావిస్తున్నారు. వాళ్ళట్లా భావిస్తున్నారనేది విశేషం కాదు. భావించగలుగు తున్నారనేది బాధాకరమైన వాస్తవం.

ఈ పరిస్థితిని సవరించడానికి క్రియాశీలకమైన కృషి జరగవలసిన అవసరం చాలా ఉంది. సామాజిక మార్పుకు దోహదం చేసిన దళిత బహుజన పార్లమెంటరీ రాజకీయాలు ఈ విషయంలో మాత్రం మేలు చేయకపోగా ప్రస్తుత రాజకీయ సంస్కృతిలో తామూ భాగం అయినాయి.

ఈ కర్తవ్యం కోసం అసలు ఎవరు సిద్ధంగా ఉన్నారో తెలియడం లేదు. భారత ప్రజాస్వామ్యానిది ఒక విచిత్రమైన సంకటం. అది అందరికీ కావాలి, కానీ ఎవరికీ అక్కరలేదు. ఆధిపత్య వర్గ రాజకీయ నాయకులకు డబ్బు సంపాదన కోసం, అధికారం కోసం ప్రజాస్వామ్యం కావాలి. అన్ని రకాల రెబెల్స్‌కూ రెబెల్ చేసే అవకాశం ఇస్తుందని

ప్రజాస్వామ్యం కావాలి. కొందరికి సామాజిక మార్పుకొక సాధనంగా ఉపయోగపడు తుందని అది కావాలి. అంతకుమించి ఎవరికీ దానితో పని లేదు. ప్రజాస్వామ్యాన్ని సూత్రబద్ధంగా కాంక్షించే రాజకీయాలు – దీని అర్థం అది ప్రస్తుతమున్న రూపంలోనే ఉండిపోవాలనీ, ఉండిపోతుందనీ కాదు – దేశంలో రావలసి ఉంది. కాని దానిని తమ లక్ష్యంగా ఎంచుకోవడానికి ప్రజాతంత్ర రాజకీయ ఉద్యమాలే కాదు, పౌరహక్కుల ఉద్యమకారులు సహితం తటపటాయిస్తున్న దుస్థితిలో మనమున్నాము!

*మరోదారి మాసపత్రిక*
*ఫిబ్రవరి 1998*

* ఇందులోని కొన్ని విషయాలు 'పార్టీలనూ, అభ్యర్థులనూ ప్రశ్నిద్దాం, నిలదీద్దాం' అనే పేరుతో ఆయనే రాసిన ఎ.పి.సి.ఎల్.సి కరపత్రంలోనూ ఉన్నాయి.



# అపరిపక్వతే సమస్య, అస్థిరత కాదు



**ఈ** మధ్య దేశ రాజకీయాలలో నెలకొన్న అస్థిరతను దృష్టిలో ఉంచుకొని ప్రత్యామ్నాయ రాజకీయ వ్యవస్థ గురించి చాలామంది చర్చిస్తున్నారు. కొన్ని ప్రత్యామ్నాయాలను ప్రతిపాదిస్తున్నారు కూడ. అధ్యక్ష తరహా పాలన మంచిదని కొందరూ, ఏ ఒక్క పార్టీకి చట్టసభలో మెజారిటీ రానప్పుడు అన్ని పార్టీలూ కలిసి జాతీయ ప్రభుత్వం ఏర్పాటు చేయడం ఉచితమని మరికొందరూ, ఇంకా రకరకాల సూచనలు చేస్తున్నారు.

కానీ ప్రభుత్వాలు అస్థిరంగా ఉండకూడదన్న నియమమెక్కడైనా ఉందా? ప్రభుత్వాలు ప్రజాస్వామికంగా ఉండాలి. అంటే అవి ప్రజాభీష్టాన్నీ, ప్రజాస్వామిక విలువలనూ ఏదో ఒక మేరకు వ్యక్తం చేయాలి. ప్రజాస్వామ్యానికి ఇది ముఖ్యం గానీ ప్రభుత్వం స్థిరంగా ఉండాలనేది ముఖ్యం కాదు. ఒక్కొక్కసారి ప్రభుత్వాలు అస్థిరంగా ఉండడమే ప్రజాస్వామికం కావచ్చును కూడ. మన దేశంలో ప్రస్తుతం అదే పరిస్థితి ఉందని నా అనుమానం.

దేశ సార్వభౌమత్వాన్ని ఖాతరు చేయకుండా ఒక ఆర్థిక సిద్ధాంతాన్నీ, దానికి అనుగుణ్యమైన ఆర్థిక వ్యవస్థాగత నియమాలనూ ప్రపంచ ఆధిపత్యశక్తులు సకల దేశాల మీద రుద్దుతున్న విచిత్రమైన పరిస్థితి ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా ఉంది. ఈ స్థితిలో మూడవ ప్రపంచదేశాల ప్రభుత్వాలు అస్థిరంగా ఉండడం కూడ మంచిదేనేమో. ఈ బలవంతపు విధానాలను అమలుపరచడానికి కావలసిన స్థిరత్వం లోపించడం దేశాల సార్వభౌమత్వాన్ని కాపాడడానికొక దొడ్డిదారి సాధనంగా ఉపయోగపడుతుందేమో!

కాంగ్రెస్ కూటమి, బిజెపి కూటమి అనే రెండు ప్రధాన కూటములు ప్రస్తుతం భారత రాజకీయాలలో ఉన్నాయి. 'స్థిరమైన' ప్రభుత్వం ఏర్పాటంటూ అయితే అది వీరో వారో చేయాలి. కానీ ఈ రెండు కూటములకూ అమెరికా నమూనా ప్రపంచీకరణ, సరళీకరణ విషయంలో పూర్తి ఏకాభిప్రాయం ఉంది. దానిని మొదలుపెట్టింది కాంగ్రెస్ వారే అయినా అప్పట్లో 'మా విధానాన్ని కాంగ్రెస్ కాపీ కొట్టింది' అని బిజెపి విమర్శించింది.

అటువంటప్పుడు వీరయినా వారయినా స్థిరమైన ప్రభుత్వం ఏర్పాటుచేస్తే జరగబోయేది ఏమిటో ఒకసారి చూసుకోవడం అవసరం. బియ్యం, గోధుమల వంటి ప్రధాన ఆహార పదార్థాలపైన ఇప్పటికే తగ్గించివేసిన సబ్సిడీని ఇంకా బాగా తగ్గించి వేస్తారు. కరెంటు, సాగునీరు, రవాణా మొదలయిన ప్రజావసరాల ధరలు వాటి ఉత్పత్తికయ్యే ఖర్చుతో సమానం చేస్తారు. అంటే ప్రస్తుతం విభిన్న సామాజికవర్గాలకు ప్రభుత్వం ఇస్తున్న సబ్సిడీలను తొలగిస్తారు. విద్యారంగం ఖర్చు విద్యార్థుల నుండి, వైద్య రంగం ఖర్చు రోగుల నుండి ముక్కుపిండి రాబట్టుకోవాలనే ప్రపంచ బ్యాంకు నియమాన్ని మరింత వేగంగా అమలుచేస్తారు. చేతి వృత్తులకూ లఘుపరిశ్రమలకూ ఇప్పటిదాకా ఉన్న రిజర్వేషన్లనో రాయితీలనో సంపూర్ణంగా తొలగించి పెద్ద కంపెనీలతో పోటీపడమనీ, అదే ఆరోగ్యానికి మంచిదనీ చెబుతారు. మన వ్యవసాయరంగాన్ని అంతర్జాతీయ మార్కెట్‌తో పూర్తిగా ముడిపెట్టి తిండిగింజలు, కాయగూరలు, పండ్ల ఎగుమతిని పెంచి, దాని పర్యవసానంగా దేశం లోపల వాటి ధరలు బాగా పెంచుతారు.

ఏ ఒక్క పార్టీకీ లేక కూటమికీ పార్లమెంటు నిండా సీట్లు లేవు కాబట్టి సరిపోయింది గానీ లేకపోతే ఈ మార్పులన్నీ ఇప్పటికే వచ్చేసి ఉండేవి. దీనికంటే అస్థిరత మేలు కదా?

ఇంకొక కోణం నుండి చూద్దాం. స్థిరత్వమే ఒక గొప్ప విలువ అయినట్టయితే బిజెపి కూటమి ఏర్పాటు చేయగల స్థిర ప్రభుత్వం కూడ కాంక్షనీయం కావాలి. కానీ తమకు పూర్తి మెజారిటీ లేకపోవడం వల్ల తాము హిందుత్వ అజెండాను పక్కనబెట్టి ఒక 'జాతీయ' అజెండాను చేపట్టామనీ, తమకే మెజారిటీ వస్తే దీనిని వదిలిపెట్టి హిందుత్వ అజెండానే చేపడతామనీ బిజెపి నాయకులు బాహాటంగానే అంటున్నారు. ఆ అజెండాలోని ముఖ్య విషయం మరికొన్ని మసీదులు కూలగొట్టడం, మరికొన్ని చర్చిలను కాలబెట్టడం అని మనకందరికీ తెలుసును. దానికంటే అస్థిరత మేలు కదా!

కాబట్టి ఏ రకంగా చూసినా అస్థిరత వర్థిల్లాలి!

నిజానికి స్థిరత్వం కోరుకుంటున్న వారు ప్రజాస్వామిక దృష్టితో కోరుకుంటున్నారా లేక అందుకు భిన్నమైన దృష్టితో కోరుకుంటూ ప్రజాస్వామ్యానికి అస్థిరత మంచిది కాదన్న వాదనను అడ్డం పెట్టుకుంటున్నారా అనేది కూడ ఆలోచించవలసిన ప్రశ్నే. ఈరోజు దేశంలో చాలామంది భారతదేశం ఒక సింగపూర్‌లాగా, ఒక తైవాన్‌లాగా లేదే అని బాధపడుతున్నారు. వేగంగా అట్లా తయారు కావాలని ఉవ్విళ్ళూరుతున్నారు. దానికి కావలసిన 'కఠినమైన' నిర్ణయాలు తీసుకోగల స్థిరమైన ప్రభుత్వం కావాలని కోరుకుంటున్నారు. ఈ 'కఠినమైన' నిర్ణయాలు ప్రధానంగా పేదలకూ బలహీనవర్గాలకూ కఠినమైనవి. ఉదాహరణకు కార్మికులకు మరీ ఎక్కువ హక్కులుండడం మన దేశం సింగపూర్‌లాగా తైవాన్‌లాగా కాకుండా అడ్డంపడుతున్న అవరోధాలలో ఒకటని చాలామంది అభిప్రాయం. దీనిని తొలగించడానికి 'కఠినమైన' నిర్ణయాలు తీసుకోవలసి ఉంటుంది. నిజానికి పారిశ్రామిక వివాదాల చట్టాన్ని సవరించి నీరుగార్చే బిల్లొకటి ఒక దశాబ్దకాలంగా పార్లమెంటులో పెండింగ్‌లో ఉంది. ప్రభుత్వాలు అస్థిరంగా ఉండడం వల్ల అది ఇంకా చట్టం కాలేదు.

ఒక్క కార్మికుల హక్కులే కాదు, రేషన్ బియ్యం ధర, కరెంటు సబ్సిడీ, వ్యవసాయానికి చవక రుణాలు, దళితులతోనూ ఆదివాసులతోనూ మొదలయి వెనుకబడిన కులాలకూ, ఇప్పుడు స్త్రీలకూ వచ్చిన రిజర్వేషన్లు, వికలాంగులు, వెనుకబడిన ప్రాంతాలు, చేతి వృత్తుల పేరిట భిన్నవర్గాలకూ, ప్రాంతాలకూ, వృత్తులకూ ఇచ్చే రాయితీలు – వీటన్నిటి గురించీ 'కఠినమైన' నిర్ణయాలు తీసుకోవాలనీ, దానికి కావలసిన స్థిరమైన ప్రభుత్వం అవసరమనీ బాధపడేవాళ్ళు చాలామంది ఉన్నారు. అదే తమ బాధ అనీ, అందుకోసమే రాజకీయాలలో అస్థిరతను వ్యతిరేకిస్తున్నామనీ చెప్పుకుంటే సరిపోతుంది. తమకేదో ప్రజాస్వామ్యం మీద ప్రేమ ఉన్నట్టు అస్థిరత ప్రజాస్వామ్యానికి చేటంటూ వాదించాల్సిన అవసరం లేదు.

యాభై సంవత్సరాల స్వతంత్ర భారత చరిత్రలో మనం గర్వించదగింది ఏమైనా ఉంటే అది మనం నిలబెట్టుకున్న ఈ మాత్రం ప్రజాస్వామ్యమే. దాని అపరిపక్వతనూ, అసమర్థతనూ పోగొట్టడానికి సూచించే ఏ సంస్కరణ అయినా ఆహ్వానించదగ్గదే గానీ ఉన్న ఈపాటి ప్రజాస్వామ్యాన్ని సహితం పోగొట్టే సంస్కరణలు కావు. సంస్కృతిలోనే

కాక అవసరాలలో ప్రయోజనాలలో పరిస్థితులలో ఇంత వైవిధ్యం ఉన్న ఈ దేశానికి అధ్యక్ష తరహా పాలనకన్నా ఇప్పుడున్న పార్లమెంటరీ వ్యవస్థే మెరుగయినది. నిజానికి దీనిలోనే మరింత లోతయిన వికేంద్రీకరణ ప్రవేశపెట్టి మన దేశ పరిస్థితులకు దీనిని మరింత అనుగుణంగా రూపొందించడం అవసరం. పదిలక్షల మందికి ఒక్కరు ప్రతినిధిగా ఉండే పార్లమెంటు చేతిలో శాసనాధికారాన్ని, ఆ పార్లమెంటులో మెజారిటీ ఉన్న పార్టీ చేతిలో ప్రధాన విధాన నిర్ణయాధికారాన్ని పెట్టడం ప్రజాస్వామ్యాన్ని చాలా బలహీనపరిచే ఏర్పాటు. గ్రామపంచాయతీ నుండి పార్లమెంటు వరకు ఏ స్థాయిలో తీసుకోగల నిర్ణయాన్ని ఆ స్థాయిలోని ప్రాతినిధ్య సంస్థలకే వదిలేసే వికేంద్రీకరణ అవసరం. అటువంటి రాజకీయ వ్యవస్థ ఏమంత 'స్థిరత్వాన్ని' ఇవ్వకపోవచ్చు. అది ప్రపంచ బ్యాంకు కోరుకునే 'కఠినమైన' నిర్ణయాలు తీసుకోలేకపోవచ్చు. కానీ భారతదేశ పరిస్థితులలో ప్రజాస్వామ్యానికి అదే మంచిది.

మనం కోరుకునేది ప్రజాస్వామ్యం కాకపోతే, అతివేగవంతమైన ఆర్థిక అభివృద్ధి కొక నమూనాను దృష్టిలో పెట్టుకొని దానికి కావలసిన రాజకీయ వ్యవస్థను సాధించడమే మన లక్ష్యమయినట్టయితే, ఆ సంగతి బాహాటంగా చెప్పుకుంటే మంచిది.

ఇదంతా అటుంచి, ఇప్పుడున్న రాజకీయ దుస్థితికి రాజ్యాంగం నిర్దేశించిన రాజకీయ వ్యవస్థ కంటే రాజకీయ పార్టీలదీ, రాజకీయ నాయకులదే ఎక్కువ బాధ్యత అంటే ఎవ్వరూ తప్పుపట్టరనుకుంటాను. ఈ నాయకులను తిట్టడానికి ఈ రోజు తిట్లు కూడ మిగలలేదు. మన భవితవ్యం కనీసం మన చేతులలో ఉంటుందా లేదా అనే కీలకమైన విషయం గురించి తీవ్రమైన ఘర్షణ జరగవలసి ఉన్న దశలో ఆ కర్తవ్యాన్ని నూరవవంతు కూడ అందుకోజాలని వ్యక్తులు దేశ రాజకీయాలను నడుపుతున్నారు. ఎక్కడెక్కడో మొదలయిన రాజకీయ స్రవంతులు ఈ రోజు మురికి కాలువలై ప్రవహిస్తున్నాయి. దీనికి ఏ స్రవంతీ మినహాయింపు కాదు. జయలలితలో పెరియార్‌ను చూడడం ఎంత కష్టమో, కాన్షీరాంలో అంబేద్కర్‌ను చూడడం అంతే కష్టం. సోనియా గాంధీలో మహాత్మాగాంధీని చూడడం ఎంత కష్టమో హరికిషన్ సింగ్ సూర్జీత్‌లో మార్క్స్‌ను చూడడం కూడ అంతే కష్టం.

ఈ రాజకీయ భ్రష్టత్వంకన్నా బాధాకరమైనది దానిని మనమందరమూ సహిస్తున్న వైనం. తన అపారమైన అక్రమార్జనను కాపాడుకోవడం తప్ప వేరే రాజకీయ

లక్ష్యంగానీ గమ్యంగానీ లేని జయలలిత దేశ రాజకీయాలను తన వేలిచుట్టూ తిప్పుకొని ఆట అడించిన తీరుకంటే జుగుప్సాకరం ఆమె ఆటలకు రాజకీయం అనే ఆమోదముద్ర వేసిన మన మౌనం.

ఇక్కడ ప్రధానంగా తప్పుపట్టవలసింది పత్రికలను, ఇతర ప్రసార సాధనాలను. నీతిమాలిన చర్యలను రాజకీయంగా చలామణి చేసుకోవడం అసాధ్యమనే భయం రాజకీయ నాయకులలో కలిగించగల స్థితిలో ఉన్నవి ఈ ప్రసార సాధనాలు మాత్రమే. ఆ కర్తవ్యంలో ప్రసార సాధనాలు తాము విఫలం కావడమే కాదు, ఆ క్రమంలో ప్రజలకు కూడ 'ఇదీ రాజకీయమే'ననే అభిప్రాయం కలిగించి మరింత నష్టం చేశాయి.

ఈ నేపథ్యంలో ఇప్పుడు మళ్ళీ ఎన్నికలొస్తున్నాయి. ప్రజాస్వామ్య ప్రక్రియ పట్ల గౌరవం కొద్దీ ప్రజలు దీనిలో పాల్గొనాలే తప్ప ఈ ఎన్నికలకు బాధ్యులయినవారి పట్ల గానీ బాధితులయిన సంఘపరివార్ పట్ల గానీ గౌరవంతో కాదు. పదమూడు నెలలు పరిపాలించిన బిజెపి ప్రభుత్వానికి తాను ఎందుకు పరిపాలించిందో తెలీదు. దానిని కూల్చినవారికి తాము ఎందుకు కూల్చారో తెలియదు. నలభై సూటుకేసులేసుకొని ఢిల్లీకి పోయి రోజుకు నలభైవేల కిరాయి వసూలుచేసే హోటల్లో బసచేసి ఒక ప్రభుత్వాన్ని కూల్చి, ఇంకొక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయలేక ఏటి ఒడ్డున ఇసుకలో ఇల్లు కట్టి కొంతసేపు ఆడుకొని ఇంక విసుగొచ్చిన తరువాత కాలితో తన్ని కూల్చేసి ఇంటికి తిరిగిపోయే ఆకతాయిలాగా సూట్‌కేసులన్నీ తీసుకొని చెన్నైకి తిరిగొచ్చిన జయలలిత మన రాజకీయ దుస్థితికి ఒక సంకేతమైతే, తిరిగి జయలలితకూ ఆమె బోటివారికే ఈ ఎన్నికలు పట్టం గడతాయేమోనన్న భయం అంతకంటే లోతయిన దుస్థితికి సంకేతం.

భారత ప్రజాస్వామ్యం అపరిపక్వతను వాడుకొని ప్రజల జీవితాలతోనూ దేశ భవిష్యత్తుతోనూ ఈ నాయకులు ఆటలాడుకుంటున్నారు. దానికి విరుగుడు ప్రజాస్వామ్యాన్ని ఇప్పుడున్న దానికన్నా బలహీనపరచి ప్రజలకు మరింత దూరంచేసే ప్రత్యామ్నాయ ప్రతిపాదనలలో లేదు. ఒక వ్యక్తి నేరుగా ఎన్నికయి ఎవరికీ జవాబుదారు కాకుండా అయిదేళ్ళు పరిపాలించే అధ్యక్షతరహా పరిపాలన అయినా, భిన్న ప్రణాళికలపై వోట్లడిగి ఎన్నికయిన పార్టీలన్నీ కలిసి అధికారాన్ని పంచుకొని ఒక ప్రతిపక్షమంటూ లేకుండా పోయే జాతీయ ప్రభుత్వమైనా ఆ పనే చేస్తాయి.

ఇప్పుడు కావలసింది మన ప్రజాస్వామ్య వ్యవస్థలోని అసమగ్రతనూ అపరిపక్వతనూ పోగొట్టే కృషి. దానికి లోతయిన వికేంద్రీకరణ వంటి వ్యవస్థాగత సంస్కరణలు ఎంత అవసరమో, సామాజిక చైతన్యంలో దానికి తగిన విలువలనూ, ఆలోచనలనూ పెంపొందించడానికి కృషి చేయడం కూడ అంతే అవసరం. ఇక్కడ 'మేధావి వర్గం' అని పిలవబడే బుద్ధిజీవుల వైఫల్యం, ప్రసార సాధనాల వైఫల్యం చాలా ఉంది. ప్రజాస్వామ్యాన్ని వీరు వాడుకున్నంతగా ఎవరూ వాడుకోలేదు. అది వీరికి అందుబాట్లో ఉన్నంతగా వేరే ఎవరికీ లేదు. కానీ దానిని బలోపేతం చేయడానికి వీరు చేస్తున్న కృషి మాత్రం స్వల్పం. దాని బదులు ప్రజాస్వామ్యాన్ని బలహీనపరిచే ప్రతిపాదనలను వెనకేసుకొచ్చేవారు కొందరయితే, ప్రజాస్వామ్యాన్ని ధ్వంసం చేస్తున్న రాజకీయ పార్టీలకూ నాయకులకూ అందమయిన రంగులు పూసి దాని విధ్వంసానికి తోడ్పడే వారు మరికొందరు. ప్రజాస్వామ్యాన్ని వాడుకోవడమే తప్ప దానికి బలం చేకూర్చే కర్తవ్యం తమది కాదని ఈ దేశంలో అందరూ అనుకుంటున్నారు. ఈ విషయంలో అందరి కంటే ఎక్కువ బాధ్యత బుద్ధిజీవులు, పత్రికలు, ప్రసార సాధనాలపై పెట్టక తప్పదు. ఇప్పటికైనా వీరు తమ వైఖరిని సవరించుకోకపోతే జయలలితలూ, ములాయంసింగ్‌లూ, హరికిషన్ సింగ్ సూర్జిత్‌లూ ప్రజాస్వామ్యంతో ఆటలాడుకుంటూనే ఉంటారు. దానిని ఆసరా చేసుకొని 'అస్థిరత' గురించి చర్చ పెట్టి ప్రజాస్వామ్యాన్నే నీరుగార్చే ప్రమాదకరమైన ప్రయత్నాలు సాగుతూనే ఉంటాయి.

ఆంధ్రప్రభ దినపత్రిక<br>13 మే 1999



# పదవి కోసం రాజ్యాంగ సంస్కృతిని ధ్వంసం చేయొద్దు



**అం**తా విదేశీయం కావచ్చునంట గానీ దేశ ప్రధానమంత్రి పుట్టుక విదేశీయం కాకూడదంట.

ఇది సోనియాగాంధీ యోగ్యతకు, అర్హతకు సంబంధించిన విషయం కాదు. ఆమెకు భారతదేశం గురించి, ఈ దేశంలోని పేద, బలహీనవర్గాల ప్రజల బతుకుల గురించి, ఆరాటాల గురించి ఏమీ తెలియదు కాబట్టి ఆమె దేశానికి ప్రధానమంత్రి కావడం మంచిది కాదంటే అర్థం చేసుకోవచ్చు. ఈ దేశంలో పుట్టిన మహానుభావులకు మాత్రం అంతకంటే ఎక్కువ ఏం తెలుసులెమ్మని ఆమెకే వోటు వేసేవాళ్ళు ఉంటారు. ఎంత తెలియకపోయినా ఆమె కంటే వాళ్ళు మెరుగని ఆమెను తిరస్కరించేవాళ్ళుంటారు. ఈ దేశపు కులాలకు, మతాలకు, ప్రాంతాలకు అతీతమైన విదేశీయురాలే బడుగు కులాలకూ మైనారిటీ మతాలకూ వెనుకబడ్డ ప్రాంతాలకూ న్యాయం చేయగలదని విశ్వసించేవాళ్ళూ ఉంటారు. ఎన్నికల తక్కెడలో ఈ అభిప్రాయాలలో దేని తూకం ఎంత అనేదాన్ని బట్టి ఆమె అర్హత నిర్ణయించబడుతుంది.

కాని ఆమె విదేశంలో పుట్టింది కాబట్టి ఈ దేశ ప్రధానమంత్రి అయ్యే అర్హత లేదన్న వాదన విచిత్రమయినది. ఏ విషయంలోనూ అక్కరలేని 'స్వదేశీ' ఈ ఒక్క విషయంలోనే ఎందుకు అక్కరకొచ్చింది? మన దేశానికి ప్రపంచ బ్యాంకు సలహాలూ ఆదేశాలూ పనికొస్తాయి. షరతులతో సహా అంతర్జాతీయ ద్రవ్యనిధి ఇచ్చే విదేశీ మారక

ద్రవ్యం పనికొస్తుంది. బిల్‌గేట్స్ పనికొస్తాడు. మన నాయకులకు వారిచ్చే ప్రశంసలు పనికొస్తాయి. విదేశీ కార్పొరేషన్ల పెట్టుబడి పనికి రావడమే కాదు, అత్యవసరం కూడ అవుతుంది. కానీ ప్రధానమంత్రి జన్మస్థలం మాత్రం విదేశీయం కాకూడదంట.

ఇది సోనియాగాంధీ హక్కుల సమస్య కాదు. కాంగ్రెస్ పార్టీ భవితవ్యం సమస్యా కాదు. నెహ్రూ కుటుంబానికి చెందిన ఒక్క చిగురుటాకయినా సరే పట్టుకొని వేళ్ళాడడానికి దొరకకపోతే బతకలేని ఆ పార్టీ ఉన్నా పోయినా ఒకటే. ఆ సిగ్గుమాలిన బలహీనతే తన బలమైన సోనియాగాంధీ దేశానికి ప్రధానమంత్రి అయినా కాకపోయినా ఒకటే.

కానీ ఇది మన నాగరికతకు సంబంధించిన సమస్య. మన రాజకీయ సంస్కృతికి సంబంధించిన సమస్య కూడ.

రెండవ దాన్ని మొదట తీసుకుందాం. రెండు నాల్కల ధోరణి మన దేశ రాజకీయాల సహజ లక్షణమయిపోయింది. కానీ దేనికయినా ఒక పరిమితి ఉండాలి. సోనియాగాంధీ విదేశీయురాలని అభ్యంతరం తోచింది మరెవ్వరికో కాదు, శరద్‌పవార్‌కు. ఈయన కాంగ్రెస్ నాయకులందరిలోకీ మొట్టమొదట ఆర్థిక సరళీకరణనూ, గ్లోబలైజేషన్‌నూ ఆహ్వానించిన వ్యక్తి. ఈ రోజు చంద్రబాబునాయుడు ప్రథమ శ్రేణి 'ఆధునికవాది'గా బహుళజాతి కార్పొరేషన్‌ల మన్ననలు పొంది ఉండవచ్చు గానీ ఒక దశాబ్దం కిందనే ఆ గుర్తింపు పొందినవాడు శరద్‌పవార్. అతనికి ఈ రోజు సోనియాగాంధీ జన్మస్థలం విదేశీయం అనే విషయం అభ్యంతరంగా తోచిందంటే ఆశ్చర్యం కలగక మానదు.

నిజానికి అతనికి కావలసింది ప్రధానమంత్రి పదవి. కోరుకుంటే కోరుకోనివ్వండి, అభ్యంతరం లేదు. ఈ రోజు రాజకీయాలలో అందరూ ఉండేది అందుకోసమే. అతనొక్కడినే తప్పుపట్టనవసరం లేదు. అయితే అందుకోసం సంకుచితమైన ఆలోచనలను ప్రవేశపెట్టనవసరం లేదు. వాటిని వెనకేసుకు రానవసరం లేదు.

వేరే దేశాలలో 'ఈ దేశంలో పుట్టిన పౌరులకే దేశ ప్రధానమంత్రి, లేక అధ్యక్షులు అయ్యే హక్కు' ఉంటుంది అని రాసుకుంటే రాసుకోనివ్వండి. మనం రాసుకోలేదు. ఒక ఉదారమైన నియమం మన రాజ్యాంగంలో ఉన్నప్పుడు ఇతరులకు దానిని ఆదర్శంగా నిలబెట్టాలి గానీ ఇతర దేశాల రాజ్యాంగంలోఉన్న సంకుచితమైన

ఆలోచనలను మనం ఆదర్శంగా స్వీకరించి మన రాజ్యాంగాన్ని మార్చుకోనవసరం లేదు. ప్రజాస్వామ్యానికి కావలసింది ప్రజల అభీష్టాన్నీ, ప్రజాస్వామ్య విలువలనూ గౌరవించే నాయకులు. వాళ్ళు ఎక్కడ పుట్టిన వారయినా కానీయండి గాక!

రాజ్యానికి చెందిన ఏ పదవికైనా పౌరులందరూ సమానంగా అర్హులేనని భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 16(1) అంటుంది. 'పౌరులు' అంటే పుట్టుకతో పౌరులా లేక తరువాత పౌరసత్వం పొందిన వారా అన్న విచక్షణ ఆర్టికల్ 16(1)లో లేదు. దాని గురించి సుప్రీంకోర్టు చేసిన వ్యాఖ్యలలోనూ లేదు. ఆ తరువాత పొందిన పౌరసత్వం కూడ ఈ దేశానికి చెందిన ఒక ఇంటికి కోడలయిన వెనువెంటనే పొందిందా లేక చాలాకాలం తటపటాయించి పొందిందా అని సోనియాగాంధీ గురించి చేస్తున్న చర్చకు ఆర్టికల్ 16(1)లో అసలే తావు లేదు.

ఆర్టికల్ 16(2) మరింత స్పష్టంగా రాజ్యానికి చెందిన ఏ ఉద్యోగం లేక పదవి విషయంలోనయినా ఒక వ్యక్తి మతాన్ని బట్టి, జాతిని బట్టి, లింగాన్ని బట్టి, వంశాన్ని బట్టి, పుట్టిన స్థలాన్ని బట్టి, నివాసాన్ని బట్టి వివక్షలు చూపించడానికి వీలులేదని అంటుంది.

ఇది ప్రాథమిక హక్కుల జాబితాలో ఉందని నొక్కి చెప్పాలి.

'జాతిని బట్టి', 'పుట్టిన స్థలాన్ని బట్టి' రాజ్యానికి చెందిన ఏ ఉద్యోగం లేక పదవికి ఒక వ్యక్తిని అనర్హులుగా భావించడానికి వీలులేదని ఈ ప్రాథమిక హక్కు చెప్తుండగా, సోనియాగాంధీ అర్హత గురించి చర్చ ఎందుకు? యాభై ఏళ్ళ కింద మన రాజ్యాంగకర్తలు దేశ పాలనకు కావలసింది ప్రజలనూ, ప్రజాస్వామ్యాన్నీ ప్రేమించే వారే తప్ప పరాయిజాతి వారు వద్దనీ, వేరే దేశాలలో పుట్టినవారు వద్దనీ నిషేధాలు పెట్టవలసిన అవసరం లేదన్న విశాల దృక్పథం అవలంబించినప్పుడు మనం ఈ రోజు దానిని వెనక్కి తీసుకుపోదామా?

శరద్‌పవార్ సమస్యలు శరద్‌పవార్‌కు ఉన్నాయనుకోండి. కాంగ్రెస్ పార్టీలో ఉన్న కొద్దిమంది యోగ్యులయిన నాయకులలో ఆయనొకడు. వేరొక పార్టీ అయితే ఆ యోగ్యత ఆయన నాయకత్వ అర్హతను పెంచేది కానీ కాంగ్రెస్ పార్టీలో అదే అతని అనర్హత అయింది. నెహ్రూ కుటుంబానికి చెందిన వారయితే యోగ్యత ఉన్నా

లేకపోయినా దేశ నాయకులు కాగలరు. వేరేవారు తాత్కాలికంగా దేశ నాయకులు కావలసివస్తే పి.వి. నరసింహారావులాగ నాలుగు భాషలు మాట్లాడడానికి తప్ప వేరే దేనికీ పెద్దగా పనికిరాని వారు మాత్రమే కాంగ్రెస్ హయాంలో దేశ నాయకత్వానికి అర్హులు. అందువల్ల ప్రధానమంత్రి కావాలన్న శరద్‌పవార్ కోరిక తీరకుండా ఉండి పోయింది. అందుకు 'పాపం, పవార్' అని ఒక కన్నీటి బొట్టు కార్చడానికి అభ్యంతరం లేదు గానీ, తన కోరిక తీర్చుకోవడానికి బిజెపి మార్కు సంకుచితత్వానికి సెక్యులర్ ఆచ్ఛాదన కల్పిస్తూ ఒక క్రైస్తవ నాయకుడినీ, ఒక ముస్లిం నాయకుడినీ వెంట వేసుకొని ఏదో సూత్రబద్ధమైన చర్చ జరుపుతున్నట్టు నటించనవసరం లేదు.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*30 మే 1999*



# అభ్యర్థులనూ, పార్టీలనూ ఈ ప్రశ్నలు అడగండి, నిలదీయండి



**రాజకీయ పార్టీలు / అభ్యర్థులారా!**

దేశ పార్లమెంట్‌కూ రాష్ట్ర అసెంబ్లీకీ సెప్టెంబర్ నెలలో ఎన్నికలు జరగనున్నాయి. నామినేషన్లు వేసే రోజు దగ్గరికొస్తున్నది. అన్ని పార్టీలు త్వరలో మేనిఫెస్టోలను విడుదల చేయనున్నాయి. స్వతంత్ర అభ్యర్థులు సహితం తమ లక్ష్యాలను ప్రకటించుకుంటారు.

ఈ నేపథ్యంలో ప్రజల హక్కుల పరిరక్షణకు సంబంధించి మేము మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు అడగదలచుకున్నాము. వీటికి మీ ప్రణాళికలోనూ, ప్రణాళిక ఇప్పటికే ప్రకటించి ఉంటే మీ ఎన్నికల ప్రచార కార్యక్రమంలోనూ జవాబు చెప్పాలని కోరుతున్నాం.

రెండు విషయాలలో మీరు మాతో ఏకీభవిస్తారని భావిస్తాము.

ఒకటి, రాజ్యాంగం కల్పించిన అవకాశాన్ని వినియోగించుకొని అధికారం చేపట్టడానికి ముందుకొచ్చేవారు ఆ రాజ్యాంగం ప్రజలకు కల్పించిన హక్కులనూ, అది సమాజం ముందు ఉంచిన సామాజిక ఆర్థిక రాజకీయ న్యాయం అనే లక్ష్యాన్నీ సాధించడానికి, అమలు చేయడానికి కృషి చేయాలనేది.

రెండు, ప్రజాస్వామ్యంలో ప్రజాప్రతినిధులు కాగోరే వారు ప్రజాస్వామ్యాన్ని పెంపొందించడానికీ కాపాడడానికీ కృషి చేయాలనేది.

మీరు ఎన్నికయితే మానవహక్కులను కాపాడతారా? దళితుల, ఆదివాసుల, స్త్రీల, మైనారిటీల హక్కుల కోసం కృషి చేస్తారా? పేదల ప్రయోజనాలకు అండగా

నిలబడతారా? ఎన్‌కౌంటర్‌లను, పోలీసు కస్టడీలో చిత్రహింసలను వ్యతిరేకిస్తారా? అని మేము మిమ్మల్ని అడగదలచుకోలేదు. ఆ విధంగా అడిగితే అన్ని పార్టీలూ అందరు అభ్యర్థులూ అవుననే అంటారు. వీటిని ప్రణాళికలలో రాసుకోవడానికి కూడ మీరు సిద్ధంగా ఉండవచ్చు. ఈమేరకు రాష్ట్ర రాజకీయాలలో ఏకీభావం ఉందని మాకు తెలుసు. అందుకే ఈ ఒప్పుకోలును మన రాష్ట్రంలో ప్రజలు ఎదుర్కొంటున్న నిర్దిష్టమైన మానవహక్కుల సమస్యలతో జోడించి ప్రశ్నలు వేస్తే ఉపయోగం ఉంటుంది భావిస్తున్నాం. లేకపోతే మానవహక్కుల గురించి, సామాజిక న్యాయం గురించి మీరందరూ మాట్లాడుతున్న మాటలు గాలిమూటలుగానే ఉండిపోతాయి.

కాబట్టి మేము చాలా నిర్దిష్టంగానే మిమ్మల్ని ప్రశ్నలు వేయదలచుకున్నాం.

**1.** గత సంవత్సరం ఆదిలాబాద్ జిల్లాలోనూ, ఈ సంవత్సరం విశాఖపట్నం ఏజెన్సీ ప్రాంతంలోనూ కొన్ని వందల మంది – బహుశా వేలమంది – పేద ప్రజలు (అత్యధికంగా ఆదివాసులు) అతిసార వ్యాధికీ మలేరియాకూ విషజ్వరాలకూ గురయి చనిపోయారు. రక్షిత మంచినీటి వ్యవస్థ ఏర్పాటు చేయడంలోనూ, ఆదివాసులకు అందుబాట్లో ఉండేటట్టు వైద్య వ్యవస్థను రూపొందించడంలోనూ, పరిసరాల పారిశుధ్యం కాపాడడంలోనూ చాలా ఏళ్ళుగా ప్రభుత్వాలు ఒకదాని తరువాత ఒకటి ప్రదర్శించిన ఘోరమైన నిర్లక్ష్యం ఈ చావులకు కారణం. ఇన్నేళ్ళలో ఏదో ఒక దశలో మీ పార్టీ అధికారంలో ఉంది, లేదా అధికార పార్టీకి మిత్రపక్షంగా ఉంది. మరి ఈ నిర్లక్ష్యానికి మీరిచ్చే సంజాయిషీ ఏమిటి?

ఏ సంజాయిషీ చెప్పుకోకపోతే తిరిగి మీకు వోటు వేస్తే అదే జరగదని ప్రజలకు నమ్మకమేమిటి?

**2.** యాభై ఏళ్ళ కింద రాసుకున్న రాజ్యాంగంలోనే అంటరానితనాన్నీ కులవివక్షనూ నిషేధించినా అది అనేక రూపాలలో ఇంకా కొనసాగుతున్నది. అంటరానితనాన్ని ప్రశ్నించిన దళితులను సాంఘిక బహిష్కరణకూ భౌతిక దాడులకూ గురి చేయడం గ్రామ పెత్తందారీ కులాల వారికి పరిపాటి అయింది. అనంతపురం, కర్నూలు, విజయనగరం – మొత్తంగా రాయలసీమ, ఉత్తరాంధ్ర జిల్లాల నుండి ఇటువంటి వార్తలనేకం వస్తున్నాయి. వార్తలు సహితం బయటకురాని ప్రాంతాలు రాష్ట్రంలో అనేకం ఉన్నాయి.

మీరు దళితుల హక్కుల రక్షణకు కట్టుబడి ఉన్నట్లు అనేకసార్లు ప్రకటించి ఉన్నారు. మేము కాదనడం లేదు. అయితే మా ప్రశ్న ప్రకటనల గురించి కాదు. గ్రామాలలో అంటరానితనం పాటించడంలోనూ, దానిని ప్రశ్నించిన దళితులను శిక్షించడంలోనూ అగ్రభాగాన నిలబడ్డవారు ఏదో ఒక పార్టీకి చెందిన ఛోటా నాయకులే. వారిలో మీ పార్టీకి, మీ మిత్ర పార్టీలకూ చెందిన వారు కూడ ఉంటారు. అటువంటి గ్రామ పెత్తందార్ల తప్పుడు ప్రవర్తనను అదుపు చేయడానికి మీరు ఇప్పటిదాకా ఏం చేశారు? ఏమీ ఎందుకు చేయలేదు? గతంలో ఏమీ చేయనివారు రేపు చేయబోతారని ప్రజలెందుకు నమ్మాలి?

3. మన రాష్ట్రంలోని 2.5 కోట్ల ఎకరాల సాగుయోగ్యమైన భూమిలో 5.7 లక్షల ఎకరాల్ని (2 శాతం) మాత్రమే ప్రభుత్వాలు ఈ 25 సంవత్సరాలలో భూగరిష్ఠ పరిమితి చట్టాల ద్వారా మిగులు భూమిగా సేకరించగలిగాయి. మరొక 2.3 లక్షల ఎకరాలు సేకరించగలిగి ఉండీ సేకరించలేదు. నిజాయితీగా వ్యవహరించి ఉంటే 5.7 లక్షల కంటే చాలా ఎక్కువ సేకరించగలిగి ఉండేవారని అందరికీ తెలుసు. ఈ పాతికేళ్ళలో మీరు లేక మీ మిత్రపార్టీలు ఒకసారి కాకపోతే ఒకసారి అధికారంలో ఉన్నారు. మరి ఈ వైఫల్యానికి మీరేం సంజాయిషీ చెప్తారు? చెప్పుకోడానికి మీదగ్గర సంజాయిషీ ఏమీ లేకపోతే మీరు పేదల పక్షమేనని చేసే ప్రకటనలను ప్రజలెందుకు నమ్మాలి?

ఈ వైఫల్యానికి గల ఒక పర్యవసానం ఏమిటంటే వ్యవసాయక కుటుంబాలలో 10 శాతం పైగా అసలే భూమిలేనివి ఉన్నాయి. వీరందరికీ ఎంతో కొంత భూమి కల్పించాలంటే 1973 నాటి భూగరిష్ఠ పరిమితి చట్టం సరిపోదు. వ్యవసాయ భూమితోపాటు వ్యవసాయేతర ఆదాయాన్ని కూడ లెక్కలోకి తీసుకొని కొత్త భూసంస్కరణల చట్టాన్ని తీసుకురావాలి. దీని గురించి ఎప్పుడయినా ఆలోచించారా? ఎందుకు ఆలోచించలేదు? ఇన్నాళ్ళూ ఆలోచించనివారు రేపు ఆలోచిస్తారని ప్రజలెందుకు నమ్మాలి?

4. దళిత బహుజన కులాల, ఆదివాసుల, స్త్రీల రాజకీయ హక్కులకు అండగా నిలబడతామని మీరు అనేకసార్లు ప్రకటించిన సంగతి మేము ఎరుగుదుము.

కానీ మేము ప్రకటనల గురించి అడగడం లేదు. గ్రామాలలో ఎస్.సి, ఎస్.టి, బి.సి కులాలకూ, స్త్రీలకూ పంచాయతీ పదవులు రిజర్వ్ అయినచోట వారిని ఆ బాధ్యత స్వతంత్రంగా నిర్వర్తించనీయకుండా ఆ పెత్తనాన్ని తాము అనుభవించే పెత్తందారీ కులాల మగవాళ్ళు అనేకచోట్ల దర్శనమిస్తారు. అందులో మీ పార్టీవారు, లేదా మీ మిత్రపక్షాల వారు తప్పక ఉండే ఉంటారు. అటువంటి వారిని అదుపు చేయడానికి, చక్కదిద్దడానికి మీరేం చేశారు? ఏమీ ఎందుకు చేయలేదు? పంచాయతీ పదవులకు ఎన్నికైన మీ పార్టీకి చెందిన ఎస్.సి, ఎస్.టి, బి.సి మహిళా అభ్యర్థులకు తమ బాధ్యతలు స్వతంత్రంగా, నిర్భయంగా నిర్వర్తించడానికి అవసరమైన ధైర్యం, శిక్షణ, సంసిద్ధత కల్పించడానికి ప్రత్యేకమైన కార్యక్రమం మీ పార్టీ ఎప్పుడయినా తీసుకుందా? ఎందుకు తీసుకోలేదు? చట్టసభలలో స్త్రీలకు 33 శాతం రిజర్వేషన్లకు మీరందరూ సుముఖమేనన్నారు. కాని ఇప్పుడు మీ పార్టీ టికెట్లలో 33 శాతం కాదు కదా, 5 శాతమైనా ఇచ్చారా? ఎందుకు ఇవ్వలేదు? మరి మీరు నిజంగా దళిత బహుజన మహిళా ప్రజానీకం రాజకీయ హక్కులకు అండగా నిలబడతారని ప్రజలెందుకు నమ్మాలి?

**5.** తెలంగాణ, రాయలసీమలకు న్యాయం చేయడానికి ఏమైనా చేస్తామనీ, ప్రాణాలయినా అర్పిస్తామనీ వివిధ పార్టీల నాయకులు ప్రకటనలివ్వడం చూస్తున్నాం. బహుశా మీ పార్టీవారూ ఇచ్చే ఉంటారు.

మరయితే రాయలసీమకూ దక్షిణ తెలంగాణకూ సాగు నీరియ్యగల కృష్ణా జలాల పంపిణీకి సంబంధించిన బచావత్ అవార్డు గడువు ఈ సంవత్సరం ఆఖరుకు తీరిపోతుంది. ఈ రెండు ప్రాంతాలకూ సాగునీటి అవసరం ఇంకా చాలా ఉంది కాబట్టి ఆ అవసరాన్ని తీర్చే పద్ధతిలో కొత్త ఒప్పందం రూపొందించుకోవలసి ఉంది. దానికి సమయం దగ్గరపడింది. దాని గురించి ఏమైనా ఆలోచించారా? ఎందుకు ఆలోచించలేదు?

ఇన్నాళ్ళూ ఆలోచించనివారు రాబోయే అయిదు నెలలలో ఆలోచించేసి ఈ రెండు ప్రాంతాల ప్రయోజనాలను కాపాడతారని ప్రజలెట్లా నమ్మాలి? ఉత్తర తెలంగాణకు నీరివ్వగల గోదావరి జలాలలో మన రాష్ట్ర వాటాగా బచావత్ అవార్డు కేటాయించిన దానిలో 20 శాతం మాత్రమే ఇన్నేళ్ళలో ప్రభుత్వాలు

వాడుకున్నాయి. ఈ సంవత్సరం చివరికి అవార్డు గడువు తీరిపోతుంది. గతంలో గోదావరి జలాలకు సంబంధించి పరీవాహక రాష్ట్రాలు తమ మధ్య తాము అంగీకారానికొచ్చాయి కాబట్టి మనకు ఇబ్బంది లేకుండా వాటా వచ్చింది. దాన్ని ఇన్నేళ్ళూ వినియోగించలేదు. ఈసారి అంత సులభంగా ఒప్పందం కుదరకపోవచ్చు. అంత వాటా రాకపోవచ్చు. మీరు లేక మీ మిత్రపార్టీలు ఈ రాష్ట్రాన్ని ఒకసారి కాకపోతే ఒకసారి పరిపాలించి ఉన్నాయి కాబట్టి ఈ పాపంలో మీకూ భాగం ఉంది. దానికి ప్రజలకు ఏమని సంజాయిషీ చెపుతారు? ఏమీ చెప్పరా? మరి మీరు భవిష్యత్తులో న్యాయం చేయబోతారని ప్రజలెందుకు నమ్మకం పెట్టుకోవాలి? ఒక్క నదీజలాల విషయంలోనే కాదు. మొత్తంగానే ప్రాంతీయ వెనుకబాటుతనం గురించి, వివక్ష గురించి తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలూ, ఈ మధ్య కాలంలో ఉత్తరాంధ్ర ప్రాంతమూ లేవదీస్తున్న ప్రశ్నలకు మీ దగ్గర జవాబేమైనా ఉందా? అన్ని పార్టీలలాగ మీరు కూడ రాష్ట్ర ఐక్యతకు ఎట్టి పరిస్థితిలోనూ భంగం కలగకూడదని బహుశా అంటారు. ఐక్యత బలవంతంగానైనా కాపాడడంలో మీరు చూపే ఉత్సాహం వివక్షను అంతం చేయడంలో చూపడం లేదన్న ఆరోపణకు మీ దగ్గర సమాధానమేమైనా ఉందా? ఆదిలాబాద్‌ను కృష్ణా జిల్లాతో పోల్చి కేవలం తెలుగు అనే భాష ఈ రెండు జిల్లాలనూ ఒకటి చేస్తుందని గుండెమీద చేయివేసుకొని చెప్పగలరా?

**6.** రాజకీయ హింసకు తాము వ్యతిరేకమని ఇప్పుడు అన్ని పార్టీలూ చెప్పుకుంటున్నాయి. రాయలసీమ ఫాక్షన్ రాజకీయాలను ఛీఛీ అనని పార్టీ ఏదీ లేదు. కానీ నిజాయితీగా మాట్లాడుకుంటే రాయలసీమలో ఫ్యాక్షనిస్టుల ప్రమేయానికీ, ఫాక్షన్ రాజకీయాలకూ అతీతమైన పార్టీ ఏదీ లేదు. మీరు అందుకు మినహాయింపని గుండె మీద చేయివేసుకొని చెప్పగలరా? ఫాక్షన్‌ల వల్లనే రాయలసీమ నాశనమయిందని ఒక పక్క అంటూ ఇంకొకపక్క ఫాక్షన్ల ద్వారానే అధికారం చేజిక్కించుకొనే ప్రయత్నం చేయడం మీతో సహా అన్ని పార్టీల నైజం కాదా? అటువంటప్పుడు మధ్య మధ్యలో ఈ అబద్ధపు ఆవేదన ఎందుకు?

ఒక్క రాయలసీమలోనే కాదు, బయట కూడ భౌతిక హింస, అవినీతి, అధికార దుర్వినియోగం, 420 వ్యవహారం - ఇవేవీ అంటని పార్టీ ఏదీ లేదు. అయినప్పటికీ మధ్య మధ్యలో రాజకీయాలలో నేర ప్రవృత్తి గురించి మీరంతా ఆందోళన వ్యక్తం చేస్తూనే ఉంటారు. ప్రజలనిట్లా ఇంకెన్నాళ్ళు మోసం చేస్తారు?

**7.** మన సమాజంలో అందరి కంటే ఎక్కువ హింస అనుభవించేది స్త్రీలేనని మీరూ ఒప్పుకుంటారు. సానుభూతి ప్రకటనలు తరచుగా చేస్తుంటారు. అనేక విషయాలు రాజకీయ సమస్యలుగా గుర్తింపు పొందుతున్నాయి కాని ఈ హింస మాత్రం ఏ రోజూ పొందలేదు. మీరు చాలా విషయాల గురించి రాజకీయ ఆందోళనలు చేస్తుంటారు గానీ స్త్రీలు ఇంటా బయటా ఎదుర్కొనే హింసను గురించి ఎన్నడూ ఏ ఆందోళనా చేయరు. అయినప్పటికీ అమ్మలారా అక్కలారా అంటూ మీరు దగ్గరికొస్తే స్త్రీలు మిమ్మల్నెందుకు ఆదరించాలి? ఆందోళన చేయకపోగా స్త్రీలు ఎదుర్కొనే సమస్యలలో మీబోటి పార్టీల స్థానిక నాయకులే పంచాయతీ పేరిట రాజీ ప్రయత్నాలు చేస్తుంటారు. హింసకూ అన్యాయానికీ గురయిన స్త్రీ హక్కుల కంటే, ఆమె బాగోగుల కంటే, ఏదో ఒక విధంగా రాజీచేసేసి కుటుంబం పరువు, కులం గౌరవం కాపాడాలని చూస్తారు. బలవంతంగా బాధితురాలిని ఒప్పిస్తారు. ఈ రకమైన బలవంతపు రాజీల ఫలితంగా సమస్య పరిష్కారం కాకపోగా ఏదో ఒకరోజు కాటికి చేరిన స్త్రీలు ఎందరో. దీని గురించి ఎప్పుడయినా ఆలోచించారా? ఈ పంచాయితులూ, పరిష్కారాలూ చేసేటప్పుడు అన్ని విషయాల కంటే బాధితురాలి యోగక్షేమాలు, ఆమె హక్కులు, ఇష్టాయిష్టాలు ప్రధానంగా తీసుకోవాలని మీమీ పార్టీలలో ఎప్పుడయినా అనుకున్నారా? బలవంతంగా బాధితురాలిని రాజీకి ఒప్పించకూడదని ఎన్నడయినా నిర్ణయం తీసుకున్నారా? ఎందుకు తీసుకోలేదు? మీరు అధికారంలోకి వస్తే ఆ పని చేస్తారా? ఇవన్నీ చేయకపోతే అబలలు, ఆడపడుచులు అంటూ మీరు కార్చే కన్నీటిని స్త్రీలెందుకు విశ్వసించాలి?

**8.** మేమే మైనారిటీల అసలు సిసలు సంరక్షకులం అని అన్ని పార్టీలూ ఈ మధ్య హామీ ఇస్తున్నాయి. లౌకికవాదులమని చెప్పుకునే పార్టీలు, చెప్పుకోని పార్టీలు కూడ మా పాలనలోనే మైనారిటీలకు రక్షణ ఉంటుందంటున్నారు. కానీ

మైనారిటీల పరిస్థితి ఏమిటి? సగటు కంటే ఎక్కువ నిరుద్యోగం, ఎక్కువ పేదరికం, ఎక్కువ నిరక్షరాస్యత, ఎక్కువ వెనుకబాటుతనం – ఇదే కదా మైనారిటీల పరస్థితి? మీ పార్టీ, లేకపోతే మీ మిత్రపార్టీ ఈ రాష్ట్రాన్నీ దేశాన్నీ ఒక దశలో కాకపోతే ఒక దశలో ఏలినవే కాబట్టి దీనికి మీరు కూడ బాధ్యత వహించనక్కరలేదా? మైనారిటీల సంరక్షణ గురించి చేసే శుష్క వాగ్దానాలు విడిచిపెట్టి ఇకనైనా వారి నిరుద్యోగాన్నీ పేదరికాన్నీ వెనుకబాటుతనాన్నీ పోగొట్టడానికి ఏమైనా చేస్తారా? అప్పుడు మీ ఎవ్వరి రక్షణ లేకుండా వారిని వారే రక్షించుకుంటారు కదా! అదేనా మీ భయం! మీ అవసరం మైనారిటీలకు లేకుండా పోతుందనేనా? ఈ వైఖరిని మైనారిటీలు ఎందుకు గౌరవించాలి?

**9.** అన్ని పార్టీలలాగే మీ పార్టీకి కూడ ఒక కార్మిక సంఘం ఉండే ఉంటుంది. అన్ని కార్మిక సంఘాలలాగా మీది కూడ కొంచెం పెద్ద ఫ్యాక్టరీలలో కొంత భద్రత గల పనులలో ఉన్న మగ కార్మికుల ఉద్యమాల మీదనే ఎక్కువ దృష్టి పెట్టి ఉంటుంది. కాంట్రాక్ట్ కార్మికులు, ఏరోజుకారోజు పని వెతుక్కునే క్యాజువల్ కార్మికులు, చిన్న కంపెనీలలో అతితక్కువ వేతనానికి పనిచేసే మహిళా కార్మికులు మీ కార్మిక సంఘానికి పెద్దగా కనిపించి ఉండరు. ఐక్య కార్మికశక్తి గురించీ, ప్రపంచ కార్మికుల ఐక్యత గురించీ మీ పార్టీ కార్మిక నాయకులు మేడే మీటింగ్‌లలో చాలా ప్రకటనలు చేస్తుంటారనుకోండి. కానీ మేము ప్రకటనల గురించి కాక వాస్తవాల గురించి మాట్లాడుతున్నామని చెప్పాము కదా! ఈ లోపాన్ని గురించి మీ పార్టీలో గానీ మీ పార్టీ కార్మిక సంఘంలో గానీ ఎప్పుడైనా మాట్లాడుకున్నారా? ఇప్పుడు నూతన ఆర్థిక విధానాలు, సరళీకృత విధానాలలో భాగంగా మీ పార్టీలన్నీ కలిసి మొత్తంగానే కార్మిక వర్గాన్ని కాంట్రాక్ట్ కార్మికులుగానూ క్యాజువల్ కార్మికులుగానూ మారుస్తున్నారు. ఈనాడు చిన్న కంపెనీలలో మహిళా కార్మికులు పనిచేస్తున్నంత నిస్సహాయ స్థితిలో రేపు కార్మికులంతా ఉంటారు. ఇన్నాళ్ళూ ఆలోచించని ఈ విషయాల గురించి ఇప్పుడయినా ఆలోచించడం మొదలుపెట్టారా? ఆ పరిస్థితి రాకుండా ఉండడానికేమైనా ఆలోచన చేస్తున్నారా? చేయకపోతే ఎట్లా? మీరు మేనిఫెస్టోలో ప్రకటించుకునే కార్మిక పక్షపాతానికి అర్థం ఏమిటి? దానిని ప్రజలెందుకు నమ్మాలి?

10. మన రాష్ట్రాన్ని ఏ పార్టీ ఏలినా పోలీసుల హింస ఒకే మోతాదులో ఉంది. సంవత్సరానికి 20 లేక 25కు తక్కువ కాకుండా పోలీసు కస్టడీలో చనిపోతున్నారు. రోజూ వందలాది మంది చిత్రహింసలకు గురవుతున్నారు. మీతో సహా అన్ని పార్టీలూ అధికారంలో (తాము గానీ తమ మిత్ర పార్టీలు గానీ) ఉన్నప్పుడు ఈ హింసను సమర్థించడం, ప్రతిపక్షంలో ఉన్నప్పుడు అవసరం రీత్యా కొంత అల్లరి చేయడం ఒక కళగా అభివృద్ధి చేశాయి. ఇకనైనా ఈ విషయంలో ఒక సూత్రబద్ధమైన వైఖరి అవలంబిస్తారా? అక్కరలేదను కుంటున్నారా? మన పొరుగు రాష్ట్రాలలో పోలీసులు తమ కస్టడీలో ఉన్నవారిని హింసించినంత హింసించి చివరి బెదిరింపుగా 'ఆంధ్ర పోలీసులకు అప్పగిస్తాము జాగ్రత్త' అని బెదిరిస్తారని మీకు తెలుసునా? మీరు, లేక మీ మిత్ర పార్టీలు ఈ రాష్ట్రాన్ని ఏలి ఉన్నాయి కాబట్టి ఈ ఘనతలో మీకు కూడ వాటా ఉంది. ఈ అపప్రథను పోగొట్టడానికి ఏం చేయబోతారు? ఏమీ చేయదలుచుకోకపోతే అప్పుడప్పుడు పోలీసు అత్యాచారాల గురించి మీరు చేసే అల్లరిని ప్రజలెందుకు నమ్మాలి? పోలీసులు బందీలతో వ్యవహరించవలసిన పద్ధతి గురించి సుప్రీంకోర్టు డి.కె. బసు కేసులో 11 సూత్రాల నియమావళిని ప్రకటించిన సంగతి మీకు తెలుసునా? దానిని ఇప్పటిదాకా అమలుచేసే ప్రయత్నం మన రాష్ట్ర ప్రభుత్వం చేయలేదు. దానిని కచ్చితంగా అమలు చేయించాలన్న నిర్ణయం ఇప్పుడయినా తీసుకుంటారా? తీసుకోకపోతే ప్రతి నిత్యం వందలాదిగా పోలీసుల చేతిలో చిత్రహింసలు అనుభవించే పేద, దళిత ప్రజలకు మీరు కల్పించగల రక్షణేమిటి?

11. 'ఎన్‌కౌంటర్' హత్యలకు మన రాష్ట్రం పేరు పొందింది. గత సంవత్సరం రికార్డు స్థాయిలో 275 మందిని ఎన్‌కౌంటర్‌లలో చంపారు. ఆ మాటకు నిఘంటువులో ఉండే అర్థమేదైనా, వాస్తవంలో దాని అర్థం కస్టడీలోకి తీసుకొని కాల్చి చంపడం అని మీకు తెలుసుననుకుంటాము. అది చట్టవిరుద్ధమని కూడ మీకు తెలిసే ఉండాలి. ఎన్‌కౌంటర్‌లో ఎవరినీ హతమార్చే అధికారం పోలీసులకు లేదనీ, ప్రతి ఎన్‌కౌంటర్ ఘటనపైన నిష్పాక్షికమైన దర్యాప్తు జరిపి చట్టం ప్రకారం చర్య తీసుకోవాలనీ 1995లో మన రాష్ట్ర హైకోర్టు, 1996లో జాతీయ మానవ హక్కుల కమిషన్ చెప్పాయని మీకు తెలుసా?

తెలంగాణలో ఎన్‌కౌంటర్లను వ్యతిరేకించడం, బయట సమర్థించడం, తెలంగాణలో ఉన్నప్పుడు పీపుల్స్‌వార్‌పైన నిషేధాన్ని వ్యతిరేకించడం, బయట సమర్థించడం అన్ని పార్టీలకూ అలవాటయిపోయిన రెండు నాల్కల వైఖరి. ఇకనైనా దానిని వదులుకొని ఈ హత్యాకాండనూ నిషేధాలనూ సూత్రబద్ధంగా వ్యతిరేకిస్తారా? హైకోర్టు, మానవహక్కుల కమిషన్‌ల తీర్పుల అమలు కోసం కృషి చేస్తారా? 'ఎన్‌కౌంటర్'లు చేసే పోలీసు సిబ్బందికి ప్రమోషన్లిచ్చే విధానాన్ని విడనాడుతారా? లేకపోతే తెలంగాణలో మాత్రమే నిర్బంధానికీ, పోలీసు హత్యాకాండకూ వ్యతిరేకంగా మీరు మాట్లాడే మాటలను ప్రజలెందుకు నమ్మాలి? ఒక్క ఎన్‌కౌంటర్‌ల గురించే కాదు, మొత్తంగా నక్సలైట్ ఉద్యమం గురించి ఈ రెండు నాల్కల వైఖరి అన్ని పార్టీలకూ అలవాటయిపోయింది. మీమీ అవసరాల కోసం ఒక్కొక్కసారి నక్సలైట్ ఉద్యమాన్ని రాజకీయ ఉద్యమంగా గుర్తించడం, దానితో రాజకీయంగా వ్యవహరించడం, దానివల్ల రాగల ప్రయోజనాలు పొందడం, ఆ అవసరం తీరిపోయిన తరువాత నక్సలైట్ ఉద్యమాన్ని కేవలం శాంతిభద్రతల సమస్యగా చూసి పోలీసు చర్యలతో ఎదుర్కొనే విధానాన్ని సమర్థించడం అందరికీ అలవాటయిపోయింది. ఇకనైనా ఈ ద్వంద్వ వైఖరి విడిచిపెట్టి, నక్సలైట్ ఉద్యమాన్ని రాజకీయ ఉద్యమంగా గుర్తించి దానితో రాజకీయంగానే వ్యవహరించాలని సూత్రబద్ధంగా ఒప్పుకుంటారా? లేకపోతే అప్పుడప్పుడు మీ ప్రయోజనాల కోసం మీరు మాట్లాడే ఈ మాటల్ని ప్రజలెందుకు నమ్మాలి?

**12.** పిల్లలను బడికి పంపించే బదులు పనిచేసి మనందరి కోసం సంపద సృష్టించి పెట్టడానికి పొలానికీ ఫ్యాక్టరీకీ పశువుల మంద వెంబడి పచ్చిక బయలుకీ మెకానిక్ షాపుకూ చాయ్‌హోటల్‌కూ పంపించే సిగ్గుమాలిన ఘనత ఉన్న దేశాలలో మనది మొదటిది. ప్రాథమిక విద్యను పిల్లల ప్రాథమిక హక్కుగా రాజ్యాంగంలో రాయాలన్న ప్రతిపాదనను రాజకీయ పెద్దలందరూ కలిసి సాగనివ్వకుండా చేశారు. ఈ యాభై ఏళ్ళలో దేశాన్నీ రాష్ట్రాన్నీ ఏలిన మీబోటి పార్టీలు పిల్లలకు చదువుకుంటూ ఆడుకుంటూ ఎదిగే పరిస్థితిని కల్పించలేక పోయాయి. దీనికేమైనా సిగ్గుపడుతున్నారా? లేదా? లేనప్పుడు మిమ్మల్ని

నాయకులుగా ఈ దేశం ఎందుకు స్వీకరించాలి? 'నేటి బాలలు రేపటి పౌరులు' అంటూ మీరు అప్పుడప్పుడు ఇచ్చే ఉపన్యాసాలను ఎందుకు గౌరవించాలి?

**13.** సామాజిక సంపద కొద్దిమంది చేతిలో కేంద్రీకృతమై ఉమ్మడి ప్రయోజనాలు దెబ్బతినకుండ చూడాలని భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 39(సి) అంటుంది. ఈ సంగతి మీకు తెలుసుననుకుంటాను. కానీ సంపద కేంద్రీకరణ విపరీతంగా జరుగుతున్నది. కాకతాళీయంగా జరగడం కాదు. అన్ని ప్రధాన రాజకీయ పక్షాల సమ్మతితో అమలవుతున్న ఆర్థిక విధానాల ఫలితంగా జరుగుతున్నది. నగరాలలోనూ పట్టణాలలోనూ ఉన్న ధనిక వర్గం దగ్గర కోటానుకోట్ల ఆస్తి ఒకవైపు, గ్రామీణ పేదలలో నికృష్టమైన దారిద్ర్యం మరోవైపు ఈనాటి సామాజిక చిత్రం. పౌరులందరికీ – పురుషులకూ స్త్రీలకూ కూడ జీవనానికి అవసరమైన ఉపాధి అవకాశాలుండాలని ఆర్టికల్ 39(ఎ) అంటుంది. పిల్లలు స్వేచ్ఛగా సగౌరవంగా ఆరోగ్యంగా పెరిగే అవకాశం ఉండాలని ఆర్టికల్ 30(ఎఫ్) అంటుంది. చదువుకునే హక్కు, పనిచేసే హక్కు, నిరుద్యోగంలోనూ ముసలితనం లోనూ అనారోగ్యంలోనూ లేమిలోనూ సహాయం పొందే హక్కు ప్రభుత్వానికి ఆర్థికంగా సాధ్యమయ్యే మేరకు ప్రజలకు కల్పించాలని ఆర్టికల్ 41 అంటుంది. బతకడానికి అవసరమైన వేతనం, గౌరవప్రదమైన జీవితాన్ని కల్పించే పని పరిస్థితులు, సామాజిక సాంస్కృతిక అవకాశాలు కార్మికులందరికీ కల్పించాలని ఆర్టికల్ 43 ఉంటుంది. అవును, ఇవన్నీ భారత రాజ్యాంగంలో ఉన్న విషయాలు. వీటిని మీరు మరచిపోయి చాలాకాలం అయింది కదూ? అందుకే మీరందరూ కలిసి ఈ రాజ్యాంగ ఆదేశాలకు విరుద్ధమైన పరిస్థితిని కల్పించడమే కాక, ఇప్పుడు సరళీకరణ పేరిట మరింతగా రాజ్యాంగ ఆదేశాలను భ్రష్టు పట్టిస్తున్నారు. వేలాదిమంది కార్మికులు పనిచేస్తున్న ప్రభుత్వ, సహకారరంగ ఫ్యాక్టరీలను ఒక్కొక్కటిగా మూసేస్తున్నారు. గుంతకల్ స్పిన్నింగ్ మిల్లు, హైదరాబాద్ ఆల్విన్, ఆజంజాహీ మిల్లు, నిజాంషుగర్స్, రామగుండం ఎఫ్‌సిఐ – వీటికి కొన్ని ఉదాహరణలు మాత్రమే. ఈ మిల్లులను పునరుద్ధరించడానికి కార్మికులు సూచించిన హేతుబద్ధమైన మార్గాలను ఎంతమాత్రం ఖాతరు చేయకుండా మూసేశారు. ప్రభుత్వరంగం, సహకార రంగం ఎప్పుడూ

అసమర్థంగానే ఉంటాయనీ, ప్రైవేట్‌రంగం మాత్రమే సమర్థంగా ఉంటుందనీ సిద్ధాంతీకరించి వేలాది మందికి ప్రత్యక్షంగా పరోక్షంగా ఉపాధి కల్పించిన పెద్ద పెద్ద కంపెనీలను మూర్ఖంగా మూసేసి ప్రజల కడుపు కొడుతున్నారు. ఇందులో అన్ని ప్రధాన రాజకీయ పార్టీలకూ భాగస్వామ్యం ఉంది. అయినప్పటికీ ఈ రాజ్యాంగం కల్పించే అవకాశాలను వాడుకొని పొందే అర్హత మీకు ఉందనే మీరు అనుకుంటున్నారా? మీరు అనుకుంటే అనుకున్నారు. ప్రజలు కూడ ఎందుకు అనుకోవాలి?

**14.** అసలు మనం ఎన్నికలు జరుపుకుంటున్నామంటేనే, ప్రభుత్వాలను ఎన్నుకుంటున్నామంటేనే ఈ దేశానికి తన నిర్ణయాలు తాను తీసుకునే స్వతంత్రం, సార్వభౌమత్వం ఉన్నాయని అర్థం. కానీ కొన్నాళ్ళుగా వీటిని ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలకు అప్పగించేస్తున్నారు మన దేశ పాలకులు. అందులో మీరు, మీ మిత్ర పార్టీలు కూడ ఉన్నాయి. రాబోయే రోజులలో ప్రపంచ వాణిజ్య సంస్థ మన సార్వభౌమత్వాన్ని మరింత సంపూర్ణంగా గుంజుకుంటుంది. దీనిని వ్యతిరేకించకుండా మీరు ఎన్నికయి ప్రభుత్వం నడపాలనుకోవడంలో ఏమైనా అర్థం ఉందా? దేశాన్ని పరిపాలించదలచుకున్న వాళ్ళు ఆ పరిపాలనకు ఉండవలసిన స్వతంత్రతనూ సార్వభౌమత్వాన్నీ నిలబెడతారనుకోవడంలో తప్పులేదని ఒప్పుకుంటారా? మరి మీరేం చేస్తున్నారు? ఏమీ చేయకపోతే ఎన్నిక కావాలన్న మీ కోరికను ప్రజలెందుకు మన్నించాలి? మీకు ఎందుకు ఓటు వేయాలి? ఎందుకు మన్నించాలో, మీకెందుకు ఓటు వేయాలో కొంచెం సెలవిస్తారా?

ఈ ప్రశ్నలకు మీ నుండి స్పష్టమైన జవాబు కోరుతూ
మీ మేలు కాకపోయినా ప్రజల మేలు కోరే
**మానవహక్కుల వేదిక**

*మానవహక్కుల వేదిక కరపత్రంగా వచ్చింది*
*15 ఆగస్టు 1999*



# ఎన్నికలంటే గుబులు సమస్యలు తెరమరుగు



ఎన్నికలొచ్చినందుకు సంతోషించేవాళ్ళు ఎక్కువమంది ఉండకపోవచ్చు. కానీ 'ఎందుకొస్తాయో ఈ ఎన్నికలు మా ప్రాణానికి' అని విసుక్కునే వాళ్ళు దేశంలో చాలా మందే ఉన్నారు.

రాయలసీమవాసులు దీనికొక ఉదాహరణ.

ఇతర ప్రాంతాలలో 'ఎవరు గెలుస్తారు, ఎవరు ఓడతారు' అనే చర్చ జరుగుతుంటుంది. రాయలసీమలోనూ ఆ చర్చ జరగదని కాదు. జరుగుతుంది. కానీ అంతకంటే ఎక్కువగా ఎక్కడ ఎంత బీభత్సం జరుగుతుందో అన్న చర్చ జరుగుతుంది.

ఈ రకమైన చర్చను కూడ విలాసంగా జరుపుకునే అదృష్టవంతులు ఉంటారు. కానీ రాయలసీమలో ఎక్కువమంది భయం భయంగా జరుపుకుంటారు. కడప జిల్లా జమ్మలమడుగులోనూ, కర్నూలు జిల్లా డోన్‌లోనూ, మొత్తంగా కర్నూలు పార్లమెంట్ నియోజకవర్గంలోనూ ఎక్కువగా హింస జరిగే ప్రమాదం ఉందని; కడప జిల్లా పులివెందులలోనూ, కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డలోనూ, అనంతపురం జిల్లా పెనుగొండలోనూ హింస పెద్దగా జరిగే అవకాశం సహితం లేనంత ఏకపక్షంగా దౌర్జన్యం అమలయ్యే సూచనలున్నాయని ఇప్పటికే రాయలసీమలో అనుకుంటున్నారు.

ఈ అంచనాల తప్పొప్పుల సంగతి అటుంచి ఎన్నికల గురించి ప్రజలు ఈ రకంగా మాట్లాడుకుంటున్నారంటేనే అది బాధాకరం. ఎన్నికలు ప్రశాంతంగా జరగడమే విజయవంతంగా జరగడం అన్న అభిప్రాయం ఒక ప్రాంతమంతటా ప్రచారంలో

ఉండడం విచారకరం. ఎన్నికల సందర్భంగా మాట్లాడుకోవడానికి పై మూడు జిల్లాల లోనూ వేరే విషయాలేవీ లేక కాదు. చాలా ఉన్నాయి. అనంతపురం జిల్లావాసులు పరిటాల రవి కంటే, దివాకర్‌రెడ్డి కంటే హంద్రీ – నీవా కాలువ గురించి, ముఖ్యమంత్రి రెండుసార్లు పునాదిరాళ్ళు వేసినప్పటికీ తవ్వడం ఇంకా మొదలుకాని దాని దుర్గతి గురించి ఎక్కువ మాట్లాడుకోవడం ఎన్నికల సందర్భానికి ఉచితంగా ఉండేది. లేదా గుంతకల్ స్పిన్నింగ్ మిల్లు గురించి, దాని మూసివేత వల్ల జీవనం కోల్పోయిన వేలాది కార్మిక కుటుంబ సభ్యుల గురించి మాట్లాడుకున్నా అది కూడ ఉచితంగానే ఉండేది. హిందూపురంలో మూతపడి ఎక్కడో కర్ణాటకలో వేరే యాజమాన్యం కింద పునరుజ్జీవం పొందుతున్న చక్కెర ఫ్యాక్టరీ గురించి, ఈ క్రమంలో ఉపాధి కోల్పోయిన కార్మికుల గురించి మాట్లాడుకున్నా బాగానే ఉండేది. కరువు గురించి, కరువు నివారణ కోసం మంజూరయిన నిధుల దుర్వినియోగం గురించి, అంటరానితనం గురించి, దానిని ప్రశ్నించిన దళితుల సాంఘిక బహిష్కరణ గురించి మాట్లాడుకున్నా కూడ బాగానే ఉండేది. వీటి గురించి బాధపడి ఆ బాధకు సమాధానం ఎన్నికలలో వెతుక్కోగలిగితే బాగుండేది.

కానీ వారికంత అదృష్టం లేదు. బాంబుల విధ్వంసంలో ఇరుక్కోకుండా ఎన్నికల కాండ ముగించుకుంటే అదే పదివేలని, కనీసం మూడు నియోజకవర్గాలలో ప్రజలు ఊపిరి బిగపట్టుకుని ఎదురు చూస్తున్న పరిస్థితి ఉంది. అందుకే ముఖ్యమంత్రులు రెండుసార్లేమి కర్మ ఎన్నిసార్లయినా హంద్రీ – నీవా పథకానికి వేసినచోటే మళ్ళీ పునాదిరాయి వేసుకుంటూ సాగించుకోగలుగుతారు.

కడపయినా అంతే, కర్నూలయినా అంతే. రాయలసీమలోని అన్ని జిల్లాలలోనూ ఉన్న కొద్దిపాటి పరిశ్రమలు మూతపడుతున్నాయి. ఎమ్మిగనూరులో, ఆదోనిలో నూలు మిల్లులు, నంద్యాలలో, కడపలో చక్కెర ఫ్యాక్టరీలు, ప్రొద్దుటూరులో పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీ ఈ జాబితాలోని పెద్ద ఫ్యాక్టరీలు. కడప జిల్లా రాజకీయాలలో ప్రముఖపాత్ర వహించిన మంగంపేట బరైటీస్ గనులకు కూడ అదే గతి పట్టించడానికి ఆ గని యజమాని అయిన ఎ.పి.ఎం.డి.సి. స్వయంగా కృషి చేస్తున్నది.

కానీ ఈ విషయాలు మాట్లాడుకోవడానికి ప్రజలకు భయం నుండి విరామం ఎక్కడిది? పాత ప్రత్యర్థులు తిరిగి తలపడుతున్న కర్నూలు నుండి కళ్ళు తిప్పలేరు.

రాజకీయ చాణక్యానికి చిహ్నంగా నిలిచిన డోన్ కొట్లాట ఏ రూపం తీసుకుంటుందో అని భయపడకుండా ఉండలేరు. శత్రుశేషం లేకుండా చేసుకుని ప్రశాంతంగా నీతులు చెపుతున్న వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి, పరిటాల రవి వంటి వారి చాతుర్యాన్ని చూసి రెండింతలు భయపడకుండా ఉండలేరు.

బహుశా భయమొక్కటే కాదేమో. ఒక వికృత చారిత్రక క్రమంలో రాయలసీమ ప్రజా జీవిత సంస్కృతిలో బలాన్నీ, పెత్తనాన్నీ – దౌర్జన్యాన్ని సహితం – అభిమానించే బలహీనత చోటు చేసుకుంది. బలప్రదర్శనను, దౌర్జన్యం చేసి సాగించుకునే వారి ఠీవినీ చూసి మురిసిపోయే గుణం చోటుచేసుకుంది.

కారణమేదైనా ఈ పాలెగాళ్ళ విన్యాసాలు మెదళ్ళను ఆక్రమించకపోతే రాయలసీమవాసులు ఈ ఎన్నికల సందర్భంగా ఆలోచించవలసిన విషయాలు చాలా ఉన్నాయి. వాటిలో బహుశా బచావత్ అవార్డు అన్నింటికంటే ముఖ్యమైనది. కృష్ణానదీ జలాల వాడకానికి సంబంధించిన 'చట్టం' ఈ అవార్డు. ఈ సంవత్సరంతో దానికి కాలం చెల్లిపోతుంది. క్రీ.శ. 2000 తరువాత కృష్ణా జలాల వినియోగాన్ని గురించి పరీవాహక ప్రాంత రాష్ట్రాల మధ్య, బహుశా ప్రాంతాల మధ్య కూడ కొట్లాటలు జరగకుండా ఉండాలంటే అందరికీ ఆమోదయోగ్యమైన కొత్త ఒప్పందం అవసరమవుతుంది.

ఆ కొత్త ఒప్పందాన్ని గురించి రాయలసీమ రాజకీయ నాయకులు ఇప్పటికే సీరియస్‌గా ఆలోచించవలసి ఉంది. కానీ వారు ఆ పనిచేసిన దాఖలాలేవీ కనిపించవు. ఆలోచించవలసిన అవసరం ఉందని సైతం వారు అనుకోవడం లేదు. దౌర్జన్యంతో పెత్తనం నెలకొల్పి సాగించుకోవడం నరనరానా జీర్ణించుకున్న వారికి ఇటువంటి అవసరం ఎందుకు తోస్తుంది?

కానీ ఆలోచించకపోతే రాయలసీమ, దక్షిణ తెలంగాణ చాలా నష్టపోతాయి. ఈ చర్చ ప్రస్తుత ఎన్నికలలో జడ్చర్ల నుంచి పెనుకొండ దాకా, నల్లగొండ నుండి రాయదుర్గం దాకా, ఆలూరు నుండి రాయచోటిదాకా ప్రధాన చర్చ కావలసి ఉండింది.

బచావత్ అవార్డు పట్ల ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న సంతృప్తి కర్ణాటకలోగానీ, మహారాష్ట్రలోగానీ లేవు. రాజకీయాలు కొంత మర్యాదపూర్వకంగా ఉన్న ఆ రోజులలో

గొణుక్కుంటూ అయినా ఆ రెండు రాష్ట్రాలు బచావత్ అవార్డును ఆమోదించాయి. కానీ ఈ సంవత్సరం గడిచిన తరువాత పరిస్థితి ఆ విధంగా ఉండబోదు. మన రాష్ట్రం ఈ విషయంలో ఏమి కోల్పోయినా ఆ నష్టం రాయలసీమకు, దక్షిణ తెలంగాణకే తగులుతుంది. కోస్తావాసులు గడువు తేదీ లోపల పులిచింతలకు కేంద్ర ఆమోదం సంపాదించేశారు. అంతకు ముందు కట్టిన ప్రాజెక్టులలో అతి పెద్ద వాటా ఎట్లాగూ వారిదే.

అందుకే కొత్త ఒప్పందాన్ని గురించి చాలా సీరియస్ చర్చ జరగవలసి ఉంది. ఎన్నికలకేమైనా అర్థముంటే ఆ చర్చ ప్రాతిపదికన ఈ ఎన్నికలు జరిగి ఉండాలి. నికర జలాలు, మిగులు జలాలు అంటూ జస్టిస్ బచావత్ సృష్టించిన కల్పన చుట్టూ రాబోయే రోజులలో వివాదం చెలరేగబోతుంది. న్యాయశాస్త్రంలో ఇటువంటి కల్పనలు (ఫిక్షన్స్) మామూలే. వాటి ఉపయోగం వాటికి ఉంది. కానీ కృష్ణా జలాలకు సంబంధించి ఈ కల్పన అవసరం తీరిపోయింది. నికర జలం నికరమూ కాదు, మిగులు జలం మిగులూ కానక్కరలేదు. కాబట్టి  ఈ తేడాను ఎంత త్వరగా పక్కన పెట్టగలిగితే అంత మంచిది.

'నికర జలాల' ప్రాజెక్టులన్నీ అయిపోవస్తున్నాయి కాబట్టి ఇంక మిగులు జలాల గురించే వివాదం ఉండబోతుంది. వాటిమీద ఎవరికీ హక్కు లేదంటూ ఆంధ్రప్రదేశ్ మాత్రం ఏ యేటికాయేడు వాటిని వాడుకోవచ్చునని జస్టిస్ బచావత్ అన్నారు. ఈ నిర్ణయం పట్ల కర్ణాటక, మహారాష్ట్రలలో నిరసన తీవ్రంగా ఉంది.

ఇప్పుడిక ఈ కల్పనను మరిచిపోయి నీళ్ళన్నీ నీళ్ళేనని గుర్తించడం అవసరం. మూడు రాష్ట్రాల్లో ఇప్పటికే ప్రతిపాదించిన అన్ని ప్రాజెక్టులూ కట్టేసుకోవచ్చునని అందరూ అంగీకరించాలి (వాటికి 'నికర జలాలు' ఉన్నాయా లేదా అన్న కాల్పనిక చర్చ పెట్టుకోకుండా.) ఆపైన భాషా ప్రాంతాలను బట్టి నీటి కేటాయింపు చేసుకోకుండా వినియోగ ప్రాంతాల అవసరాన్ని బట్టి ఈ ప్రాజెక్టుల ప్రాధాన్యతను నిర్ణయించి వాటికి మొదటి ప్రాధాన్యత, రెండవ ప్రాధాన్యత, మూడవ ప్రాధాన్యత అంటూ ర్యాంక్‌లు ఇవ్వాలి. ఆల్మట్టికీ, భీమాకూ, జూరాలకూ, శ్రీశైలం కుడి ఎడమ కాలువలకూ, గాలేరు – నగరి, హంద్రీ – నీవాలకు మొదటి ప్రాధాన్యత ఉంటుంది. కృష్ణా డెల్టాకు ఆఖరి ప్రాధాన్యత ఉంటుంది. నదిలోకి వర్షాకాలంలో వచ్చి చేరే మొదటి నీరు మొదటి

ప్రాధాన్యతగల ప్రాజెక్టులకిచ్చి తర్వాత వచ్చినది తరువాతి ప్రాధాన్యతలు గల ప్రాజెక్టులకు వదలాలి. ఈ ఏర్పాటుకు కావలసిన పంట మార్పిడి చేసుకోవడానికి ప్రస్తుతం కృష్ణా జలాలను విపరీతంగా అనుభవిస్తున్న ప్రాంతాల రైతులు సిద్ధం కావాలి.

ఈ రకమైన రాజకీయ నిర్ణయం తీసుకోవడానికి, కోస్తా జిల్లాల రాజకీయ నాయకులను ఒప్పించడానికి కృష్ణానదీ పరీవాహక ప్రాంతం రాజకీయ నాయకులు సిద్ధంగా ఉన్నారా అనేది ప్రస్తుత దశలో అతి ముఖ్యమైన రాజకీయ సమస్యలలో ఒకటి. రాష్ట్రాన్ని ఏలడానికి ముందుకొస్తున్న రాజకీయ పార్టీలు దీనికి సిద్ధమా అనేది ఇంకొకటి. ఈ విషయం తేల్చుకోవడానికి ఉపయోగపడవలసిన ఈ ఎన్నికలు వృథాగా పోవడం విచారకరం.

'ఇది ఇంకా ఎక్కువ కాలం సాగదు' అని అనగలిగితే బాగుండును కానీ నిజాయితీగా మాట్లాడుకుంటే ఆ పరిస్థితి లేదు. నిజమే, భయ రాజకీయాల పట్ల కోపం, నిరసన రాయలసీమలో చాలా ఉన్నాయి. కానీ భయపెట్టి సాగించుకునే నాయకుల బలం కూడ అదే మోతాదులో పెరుగుతున్నదేమో అన్న సందేహం కూడ ఉంది.

దీనికి ఒక కారణం, వాళ్ళ సంపాదనకు పెరిగిన అవకాశాలు. ఇప్పుడది లక్షలలో లేదు. కోట్లలో ఉంది. సివిల్ కాంట్రాక్టులు, నాపరాయి, సున్నపురాయి గనుల నుండి వసూలు చేసే రౌడీ మామూళ్ళు, దొంగ సారా వ్యాపారం, కర్ణాటక నుండి విస్కీ, బ్రాందీల స్మగ్లింగ్, నల్లమల అడవులలో కలప స్మగ్లింగ్, వట్టి బెదిరింపు వసూళ్ళు అన్నీ కలిసి ఈ పాలెగాళ్ళ ఆదాయాన్ని ఎంతగా పెంచాయంటే వారిప్పుడు రౌడీల గుంపులను క్షణాలమీద తయారుచేసుకోగలరు. భారీగా పోషించగలరు. ఆయుధాలు కూడ గతంలో కంటే ఎక్కువగా సమకూర్చుకోగలరు. మన సామాజిక జీవితంలో మొత్తంగా దిగజారిన విలువలు, నైతిక ప్రమాణాలు కూడ గుంపును కూడగట్టి దౌర్జన్యాలు మరింతగా చేయడానికి అనుకూలించే విషయం. దీనితో వారు ఎంతగా భయం కల్పించగలిగితే అంతగా రాయలసీమలోని రాజకీయ సంవాదమంతా ఆ భయం చుట్టూనే తిరుగుతుంది. దట్టంగా ముసిరి ఉన్న ఈ చీకట్లకు అంతమెప్పుడో?

*ఆంధ్రప్రభ దినపత్రిక*
*2 సెప్టెంబర్ 1999*

# మాజీ మిలిటెంట్లతో ప్రజాస్వామ్య దాస్యం



**ఆ**గస్టు 25, వరంగల్ జిల్లా హసన్‌పర్తి మండలకేంద్రం. దాదాపు 300 మంది యువకులు ఒక విచిత్రమైన ఊరేగింపు తీస్తున్నారు. వాళ్ళకు ముందూ వెనకా కాపలాగా సాయుధ పోలీసులు నడుస్తున్నారు. ఆ సాయుధ పహారాలో నడుస్తున్న యువకులు 'నక్సలిజం నశించాలి' అనీ, 'ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి' అనీ నినదిస్తున్నారు. అందరూ తప్పక వోటు వేయాల్సిందే అని కూడ నినాదం  ఇస్తున్నారు.

ఆ యువకులు మాజీ మిలిటెంట్లు. హసన్‌పర్తి మండలంలోని నాగారం, ముచ్చెర్ల, సిద్ధాపురం, వంగపాడు, బైరాన్‌పల్లి, దేవన్నపేట గ్రామాలకు చెందిన వారు. వారు ఆ ఊరేగింపును స్వచ్ఛందంగా తీయడం లేదు. పోలీసుల బలవంతం మీద తీస్తున్నారు. ఒకప్పుడు పీపుల్స్‌వార్ కార్యకర్తలుగా ఉన్నందుకు వారికి ఈ శిక్ష. పీపుల్స్‌వార్ పిలుపిచ్చిన ఎన్నికల బహిష్కరణకు వ్యతిరేకంగా వారు ఈ ఊరేగింపులు తీయాలి. నినాదాలు ఇవ్వాలి. తమను తామే అపహాస్యం చేసుకుంటూ ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి అని నినాదాలు ఇవ్వాలి.

మనుషులను కించపరచడానికి ఇంతకంటె నీచమైన పద్ధతి ఉండదేమో!

కానీ ఈ మాజీ మిలిటెంట్ల పాట్లు ఇక్కడితో అయిపోలేదు. వరంగల్ జిల్లాలో ఎన్నికలు 18వ తేదీన జరుగుతాయి. 16వ తేదీ సాయంత్రం నుండే ఒక్కొక్క పోలీస్ స్టేషన్ పరిధిలోని ఈ 'మాజీ'లంతా ఆయా పోలీస్ స్టేషన్లకు చేరుకోవలసి ఉంటుంది. బ్యాలెట్ పెట్టెలకు తోడుగా తమ తమ గ్రామాలకు తిరిగి రావలసి ఉంటుంది. వాటికి

కాపలాగా పోలింగ్ జరిగే స్కూల్లోనే పడుకోవలసి ఉంటుంది. 18 పొద్దున్న అందరికంటే ముందు వారే లైనుకట్టి వోటువేయాల్సి ఉంటుంది. ఆ తరువాత గ్రామస్తులను ప్రోత్సహించి తగు మోతాదులో వోట్లు వేయించవలసి ఉంటుంది. పెట్టెలు నిండినంత నిండినాక వాటిని తిరిగి వాటి గమ్యానికి చేర్చవలసి ఉంటుంది.

ఇదంతా జరగబోతున్నదని నేను మీకు 16వ తేదీ పొద్దున్నే చెబుతున్నాను. ఒక్క వరంగల్‌లోనే కాదు తెలంగాణలో పీపుల్స్‌వార్ ప్రభావం ఉన్న అన్ని ప్రాంతాలలోనూ జరగబోతున్నదిదే. ఈ విచిత్రమైన తంతు లేనిదే తెలంగాణలో ఎన్నికలు పూర్తి కావు. ప్రజాస్వామ్యాన్ని ఇంతగా అపహాస్యం చేసే ఈ పద్ధతిలో ఎన్నిక కావడానికి తమకు అభ్యంతరం ఉందన్న అభ్యర్థి తెలంగాణలో ఒక్కరూ లేరు. పైగా ఈ తంతు మొదలుకావడం కోసం ఎదురు చూస్తూ పోలీస్ స్టేషన్ ఆవరణల్లో గడుపుతున్న ఈ యువకుల చేతులు పట్టుకొని మీ వోట్లు మాకే వేయండి అంటూ ఏమీ ఎరగనట్టు ప్రచారం చేసుకుని పోవడం తెలంగాణ రాజకీయవేత్తలకు అలవాటయింది. ఎంతటి వికారం మధ్యనయినా అది అలవాటయిపోతే మనుషులు హాయిగా బతికేయగలరనడానికి ఇది ఒక నిదర్శనం మాత్రమే.

ఒకప్పుడు పీపుల్స్‌వార్‌లో పనిచేసినందుకు ఎన్నికల భద్రతకు ఈ యువకులను బాధ్యులను చేసి వారి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ఎన్నికల ప్రక్రియకు వారిని సజీవమైన సెక్యూరిటీగా వాడుకోవడం చాలా అన్యాయమన్న సంగతి అటుంచి, ఈ పని కేవలం పోలీసులు తమ స్వంత బుద్ధితో చేస్తున్నదేనా? హైదరాబాద్‌లో కూర్చొని ప్రజాస్వామ్యాన్ని గురించి నాజూకుగా మాట్లాడే చీఫ్ ఎలెక్షన్ ఆఫీసర్‌గారికి, దేశం మొత్తం మీద ప్రజాస్వామ్యానికి ప్రమాణ నిర్ణేతలుగా తమను తాము భావించుకుంటున్న ఎన్నికల కమిషనర్‌లకు ఈ విషయం తెలీదా? లేక ఇది వారి పాలసీయేనా?

ఎవరి బుర్రలో పుట్టిందో గానీ ఇదిప్పుడు ఒక పాలసీగా భారత ప్రజాస్వామ్యంలో భాగమైపోయింది. మిలిటెన్సీ ఉన్న అన్ని ప్రాంతాలలోనూ ఆ మిలిటెన్సీ నుండి ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికి మాజీ మిలిటెంట్లనూ, సానుభూతిపరులనూ సెక్యూరిటీగా వాడుకోవడం వివిధ రూపాలలో సాగుతూనే ఉంది. ఒకరి రాజకీయ భావాలకు వారికి ఈ రకమైన శిక్ష వేయడం – ఇది భౌతికశిక్ష మాత్రమే కాదు, మనస్సులను కించపరిచే శిక్ష – చాలా అనాగరికమైన చర్య. కానీ భారత ప్రజాస్వామ్యానికి ఇది అవసరమని మన ప్రజాస్వామ్య రక్షకులు భావిస్తున్నారు. కాదని చెప్పడానికి ఈ ప్రజాస్వామ్యం సృష్టించిన నాయకులెవరికీ ధైర్యం చాలదు.

నాగరికం, అనాగరికం అటుంచి దీనివల్ల ఒనగూడే ఫలితమేమిటి? మిలిటెంట్ల దాడి నుండి బ్యాలెట్ పెట్టెలను, వాటికి కాపలాగా వ్యవహరించే పోలీసులను కాపాడటానికి ఇది ఉపయోగపడుతున్నట్టుంది. అదే లక్ష్యమైతే కొంత ఖర్చయితే అయింది గానీ పెట్టెలకు ఏర్పాటుచేసే పోలీసు పహారాలను పెంచడం సరయిన పద్ధతి అవుతుందని గానీ ఈ అమానుషత్వం కాదు.

ఇంక వేరే ఏ ఫలితం ఒనగూడుతుంది? ఇదంతా చేయకపోతే ప్రజలు వోట్లు వేయరా? ఈ ప్రశ్నకు కచ్చితంగా జవాబు చెప్పాలంటే ఇటు మిలిటెంట్లు అటు భద్రతా దళాలు ఈ బలవంతపు బహిష్కరణ, బలవంతపు ప్రజాస్వామ్యం అనే ప్రహసనానికి ఒక్కసారైనా సెలవు ఇయ్యవలసి ఉంటుంది. అంతవరకు ఊహించడం తప్ప ఏమీ చేయలేము.

నక్సలైట్ ప్రభావిత ప్రాంతాలలో కంటే భారత రాజ్యం పట్ల చాలా రెట్లు ఎక్కువ ద్వేషం ఉన్న కాశ్మీర్‌లో సహితం పట్టణాలలో, అందులోనూ రాష్ట్ర రాజధాని శ్రీనగర్‌లో అమలయినంత విజయవంతంగా గ్రామీణ ప్రాంతాలలో మిలిటెంట్ల బహిష్కరణ పిలుపు అమలు కావడం లేదు. వోటు వేయవలసిందేనని సైన్యం పెట్టే ఒత్తిడి ఒక క్రూరమైన సత్యమే అయినప్పటికీ అదొక్కటే దానికి కారణం కాదు. తెలంగాణలోనైతే 1996 పార్లమెంట్ ఎన్నికలలో ఇటు 'అన్న'లు గానీ అటు పోలీసులు గానీ ఎవరిపైనా పెద్దగా ఒత్తిడి పెట్టలేదు. అయినా వోట్లు బాగా పడడమే కాక నక్సలైట్ల ప్రభావం బలంగా ఉన్న కరీంనగర్ గ్రామాలలో సైతం బిజెపి అభ్యర్థికి కుప్పలుగా వోట్లు పడ్డాయి.

అన్ని రాజకీయ పార్టీల పట్ల తమ నిరసనను వ్యక్తంచేయడం కోసం ఒక పరిమిత ప్రాంతంలో ప్రజలే ఎన్నికలను బహిష్కరించిన ఉదంతాలు చాలా ఉన్నాయి గానీ సైద్ధాంతిక బహిష్కరణ ఎప్పుడూ పెద్దగా విజయవంతం కాలేదు. సాయుధ పోరాట రాజకీయవాదులకు ఎన్నికల ప్రక్రియ 'రాజ్యం'లో భాగంగా కనిపిస్తుంది గానీ ప్రజలకది రాజ్యాన్ని ప్రభావితం చేయడానికి తమకు అందుబాట్లో ఉన్న ఒక సాధనంగా కనిపించడం దీనికొక ముఖ్య కారణమేమో!

దురదృష్టవశాత్తు, ఇందులో ఏ వైఖరి ఎంతవరకు సత్యమన్న సున్నితమైన వివేచనకు తావులేని భయ వాతావరణం ఎన్నికలొచ్చినప్పుడల్లా తెలంగాణలో

నెలకొంటుంది. ఎన్నికలలో చర్చలకు రావలసిన విషయాలు తెలంగాణలో చాలా ఉన్నాయి. దక్షిణ భారతదేశంలోని అతి పెద్ద నదులయిన కృష్ణ, గోదావరి నదులు తెలంగాణలో సుదీర్ఘంగా ప్రవహిస్తాయి. అయినప్పటికీ గోదావరి బేసిన్‌లోనూ, కృష్ణా బేసిన్‌లోనూ కూడ కరువు పీడిత ప్రాంతాలున్నాయి. తెలంగాణలో సారవంతమైన భూములున్నాయి, అడవులున్నాయి. పరిశ్రమలకు ఉపయోగపడే రాయి ఉంది, బొగ్గు ఉంది. అయినా పారిశ్రామిక అభివృద్ధి లేదు. సింగరేణి బొగ్గుగనులు ఉపాధి కల్పన విషయంలో కుంచించుకుపోయే పరిస్థితి ఏర్పడింది. రామగుండం ఎరువుల ఫ్యాక్టరీని మూసేయబోతున్నారు. వరంగల్‌లోని ఆజంజాహీ మిల్లు రేపో మాపో అన్నట్టు ఉంది. 'సామాజిక అభివృద్ధి' సూచికలు ఏవి తీసుకున్నా రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలోకీ తెలంగాణ వెనుకబడి ఉందన్న విషయం తేలుతుంది. ఆదివాసులు అధికంగా నివసించే ఆదిలాబాద్ జిల్లా గడచిన సంవత్సరం ప్రాణాంతకమైన రోగాల ఉప్పెనను చూసింది.

ఈ సమస్యల చర్చ లేని ఎన్నికలు జరుపుకోవడం వృథా. నాయకులు చేయకపోతే ప్రజలయినా చేయాలి. ఈ చర్చల ప్రాతిపదికన ఎన్నికలు జరగాలి. అట్లా జరిగే ఎన్నికలలో ప్రజలు మనస్ఫూర్తిగా వోటు వేసినా ఫరవాలేదు, వేయనక్కర లేదనుకున్నా ఫరవాలేదు.

కానీ దీనికి ప్రశాంతి కావాలి. గ్రామాలకు పోవాలంటే నాయకులకు భయం, వాళ్ళొచ్చినప్పుడు 'ఏమైనా' జరిగితే ఆ తరువాత పోలీసులొస్తారేమోనని ప్రజలకు భయం. ఈ భయాలు నిండిన వాతావరణంలో చర్చ, సంవాదం సాధ్యం కావు. ప్రజాస్వామ్యాన్ని భ్రష్టు పట్టించిన నాయకులను చూపించి ఈ వాతావరణాన్ని ఒకరు సమర్థించవచ్చు. కానీ నష్టపోయేది ప్రజలు, నష్టపోయేది తెలంగాణ. ఏ ఒక్క సమస్య మీద ఏ ఒక్క పార్టీ నుండి ఏ ఒక్క అభ్యర్థి నుండి ఒక కచ్చితమైన హామీ పొందకుండా, ఒక అవగాహన ఏర్పడకుండా హింసాభయాల మధ్య, వికారమైన పోలీసు నిర్బంధం మధ్య తెలంగాణలో ఎన్నికలు గడిచిపోతాయి. వోట్లడగడానికి వచ్చిన నాయకులను ప్రజలు నిలదీసి ఇబ్బందిపెట్టిన కొన్ని ఘటనల గురించి తెలంగాణలో వింటుంటాం. కానీ ఎక్కువ భాగం గ్రామాలకు ఏ నాయకులూ పోరు. ఎవరి స్థానిక కార్యకర్తలూ పెద్దగా ప్రచారం చేయరు. నిశ్శబ్దంగా, భయంగా ఎన్నికలు జరిగిపోతాయి.

సరిగ్గా ఎన్నికలకు ముందే పీపుల్స్‌వార్ మూడు వేర్వేరు ఘటనలలో పోలీసులను హతమార్చడం ఈ భయ వాతావరణాన్నీ, అశాంతినీ పెంచడానికి తోడ్పడుతుంది.

ప్రస్తుత రాజకీయ వ్యవస్థను తమ శత్రువుగా భావించే ఆ పార్టీ దృష్టిలో ఈ చర్యలు ఆ వ్యవస్థకు కీలకమైన ఎన్నికల ఘట్టాన్ని సంక్షోభంలో పడేసే చర్యలుగా, వ్యూహాత్మకంగా అర్థవంతమైన చర్యలుగా కనిపించవచ్చు. దాని మంచిచెడులు బేరీజు వేసే ముందు దాని ఫలితాన్ని స్పష్టంగా గుర్తించడం అవసరం. అశాంతి, భయం, పోలీసులలో మరింత ఆగ్రహం, దాని ఫలితం ఎంత క్రూరంగా ఉంటుందో అని ప్రజలలో ఉద్విగ్నత – ఇది ప్రజల సమస్యల చర్చకు గానీ, పరిష్కార ప్రతిపాదనకు గానీ అర్థవంతమైన రాజకీయ నిర్ణయాలకు గానీ తోడ్పడే వాతావరణం కాదు. ఈ గడ్డుకాలం ఎంత త్వరగా గడిచిపోతే అంత బాగుండునని కోరుకుంటూ సెప్టెంబర్ 19 తెల్లవారడం కోసం ఆతృతతో ఎదురుచూసే వాతావరణం. నాయకులు అర్థరహితంగా మార్చిన ఎన్నికల వ్యవస్థను ఇంకొంత అర్థరహితంగా తయారుచేసే వాతావరణం.

పోలీసు యంత్రాంగానికి ఇదే అదను. తమ ప్రాముఖ్యం ఎంత పెరిగితే, తమ పాత్ర ఎంత పెరిగితే వారికి అంత సంతోషం. ఎన్నికలన్నా, ప్రజాస్వామ్యానికి సంబంధించిన ఏ ప్రక్రియ అన్నా వారికున్నంత చులకన భావం ఎవ్వరికీ ఉండదు. తమ తుపాకీ నెలకొల్పే భద్రత మీద మాత్రమే వారికి నమ్మకం. నక్సలైట్లను ఎదుర్కొనడానికి 'ప్రజాస్వామ్యం' అన్నమాట వారికి పనికొచ్చింది. ఎన్నికలమీద గౌరవం ప్రదర్శించడం అక్కరకొచ్చింది. కానీ ప్రజల అభీష్టానికి స్థానం కల్పించడం ద్వారా సార్థకత పొందే రాజకీయ ప్రక్రియలంటే నిజానికి వారికి అమితమైన చులకన.

అందుకే యువకులను బలవంతంగా పోగుచేసి అన్నం, నీళ్ళు లేకుండా ఊరేగింపులు తీయిస్తూ 'ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి' అంటూ నినాదాలు ఇప్పించగలరు. ఎవరికి వోట్లు వేయడం ఇష్టం లేదనుకుంటారో వారి చేతనే మొదటి వోట్లు వేయించి, ఊరందరి చేత వోట్లు వేయించే బాధ్యత వారికే అప్పగించగలరు. మనుషులన్నా, వారి అభిప్రాయాలన్నా, వారి ఆత్మాభిమానమన్నా ఇంతటి చులకన భావం ఉన్న యంత్రాంగం పైన ఆధారపడి ఎన్నికల వ్యవస్థను 'అన్నల' నుండి కాపాడాలని చూసే నాయకులను ఏమనాలి!

*ఆంధ్రప్రభ దినపత్రిక*
*16 సెప్టెంబర్ 1999*



# ఎన్నికల అక్రమాలకు పోలీసుల హింస పరిష్కారం కాదు



సెప్టెంబర్ 5వ తేదీ. రాయలసీమ జిల్లాలలో ఎన్నికలు జరుగుతున్నాయి. కడప జిల్లా జమ్మలమడుగు కాంగ్రెస్ అభ్యర్థి నారాయణరెడ్డి స్వగ్రామానికి పోయే మెటల్ రోడ్డు మొదట్లో ఆ ఊరి యువకుడొకడు నిలబడి ఉన్నాడు. 'దేవగుడికి పోయే రోడ్డు ఇదేనా'? అంటే అవునన్నాడు. 'మాతోబాటు ఊరిలోకి వచ్చి పోలింగ్ స్టేషన్ చూపిస్తావా?' అంటే మొగమాటంగా నవ్వి 'నేను రాను మీరే పోయి రండి' అన్నాడు. ఎందుకని అడిగితే కొంచెం తటపటాయించి 'మూడు ఓట్లు వేయమని ఇచ్చినారు. ఒకటే వేసి వచ్చేసినాను. మళ్ళీ పోతే మిగిలిన రెండూ వేయమంటారు' అన్నాడు. ఒక మనిషి మూడు వోట్లు వేయడం విశేషం కాదు. రాయలసీమలో మాత్రమే జరిగే విషయమూ కాదు. కానీ ఒక గ్రామంలో వేరే ఏ అభ్యర్థి ఏజెంటునూ కూర్చోనీయకుండా చేసి ఊరిలో ఉన్న యువకులకు చెరి మూడు నాలుగు వోట్లు వేయమని 'చిట్టీలు' పంచి, అందుకు సిద్ధంగా లేని వాళ్ళు కనీసం ఆ పూటకైనా ఊరు విడిచిపెట్టి పోయే పరిస్థితి కల్పించగల 'సమర్థులు' అన్నిచోట్లా ఉండరు.

జమ్మలమడుగు కాంగ్రెస్ అభ్యర్థి తన స్వంత ఊరయిన దేవగుడిలోనే కాదు, ఆ పరిసరాలలోని మొత్తం 8 గ్రామాలలోనూ ఈ పని చేయగలిగాడు.

అతని తెలుగుదేశం ప్రత్యర్థి కూడ తక్కువవాడేం కాదు. నిజానికి వీరిద్దరి కుటుంబాలకూ చాలా ఏళ్ళుగా ముఠాకక్షలున్నాయి. ఒకప్పుడు జమ్మలమడుగు ఎం.ఎల్.ఏ అయిన తెలుగుదేశం నాయకుడు శివారెడ్డిని ప్రస్తుత కాంగ్రెస్ అభ్యర్థి నారాయణరెడ్డి

వర్గం హతమార్చింది. ప్రస్తుత తెలుగుదేశం అభ్యర్థి, సిట్టింగ్ ఎం.ఎల్.ఏ అయిన రామసుబ్బారెడ్డి శివారెడ్డి దగ్గరి బంధువే. శివారెడ్డిది గుండ్లకుంట. ఆ ఊరు వ్యూహాత్మకంగా చాలా అనుకూలమైన చోట ఉంది. ఆళ్ళగడ్డ నుండి జమ్మలమడుగు వచ్చే రోడ్డు, కోవెలకుంట్ల నుండి జమ్మలమడుగు వచ్చే రోడ్డు గుండ్లకుంట దగ్గర కలుసుకుంటాయి. జమ్మలమడుగులో బయలుదేరిన వారెవరయినా గుండ్లకుంటను దాటనిదే ఈ రోడ్డు మీదగాని, ఆ రోడ్డు మీదగాని ఉన్న గ్రామాలను చేరుకోలేరు. గుండ్లకుంటను గుప్పిట్లో పెట్టుకుంటే ఆ ఊరికి ఆవలనున్న గ్రామాలను సునాయాసంగా ఏలవచ్చు. దివంగత శివారెడ్డి ఆ పనే చేశాడు.

అతని వారసుడు అదే ఒరవడిలో మొన్నటి ఎన్నికలనాడు గుండ్లకుంటతో కలుపుకొని ఏడు గ్రామాలలో కాంగ్రెస్ ఏజెంట్ లేకుండా చూసుకున్నాడు. ఒక్కచోట తిప్పన్నపాడులో ఏజెంట్ కూర్చోగా అతని బంధువు చేతనే అతనిని బయటికి ఈడ్పించి పంపించేశారు. ఆ ఏడు గ్రామాలలోనూ ఉల్లాసంగా ఆడుతూ పాడుతూ వోట్లు వేసుకున్నారు. మధ్యాహ్నం మూడున్నర తరువాత ప్రత్యర్థుల గుంపేదయినా జమ్మలమడుగు నుండి వస్తుందనుకున్నారో లేక మిగిలిపోయిన వోట్లన్నీ ప్రశాంతంగా వేసుకుందామని అనుకున్నారో గానీ ఒక ఎడ్లబండిని ఎడ్లు విప్పేసి గుండ్లకుంటలోకి ప్రవేశించే చోట రోడ్డుకు అడ్డంగా పెట్టారు. అంటే తమ రాజ్యానికి గేటు మూసేశారు. ఆపైన ఆ ఊరిలోనూ దానికి ఆవలనున్న ఊర్లలోనూ ఏం జరిగిందో ఆ పెరుమాళ్ళకే ఎరుక.

జమ్మలమడుగు గురించే ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు. పులివెందుల, పెనుకొండ, పత్తికొండ – రాయలసీమలో చాలాచోట్ల మొన్నటి అయిదవ తేదీన కనిపించింది ఈ చిత్రమే. ఈ వికారమైన రాజకీయ సంప్రదాయాన్ని గురించి ఈ మధ్యకాలంలో చర్చ చాలా జరుగుతున్నది.

అయితే దీనిని ఎదుర్కొనడానికి అధికార యంత్రాంగం కొంతకాలంగా అనుసరిస్తున్న పద్ధతి కూడ అంతే వికారంగా ఉంది. ముఠా నాయకుల రాజకీయ విన్యాసాలను ఆపలేరు కాబట్టి మొత్తంగా ప్రజలమీద పడి చావగొట్టే అధికారాన్ని పోలీసు, పారామిలిటరీల చేతిలో పెట్టి టోకుగా ఎన్నికల 'శాంతి'ని కాపాడడం ఈ పద్ధతి. శేషన్ దేశ ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా ప్రవేశపెట్టిన సంస్కరణాత్మక కృషిలోనే ఈ లక్షణం బీజరూపంలో ఉంది. ఎన్నికలలో ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికి అధికార యంత్రాంగం చేతిలో విపరీత అధికారాలు పెట్టడం శేషన్ నమూనా సంస్కరణల

సారాంశం. ఎన్నికల కమిషన్ నుండి జిల్లా కలెక్టర్ దాకా ఎన్నికల సందర్భంగా దాదాపు విచ్చలవిడి అధికారాలు చలాయిస్తున్నారు. ఎన్నికల హింస అధికంగా ఉండే రాయలసీమ వంటి ప్రాంతాలలో ఈ అధికారం పోలీసులకు సహితం సంక్రమించింది.

కొంతకాలంగా ఎన్నికల దినం రాయలసీమలో సాధారణ పౌరులు – అందరూ ఆ రోజున పడీపడీ దండాలుపెట్టే ఓటరు మహాశయులు – రోడ్లో నక్కి నక్కి నడవాలే తప్ప స్వేచ్ఛగా సంచరించలేని పరిస్థితి ఉంది. ఓటు వేయడానికయితే ఇంటి నుండి బయటికి రావచ్చు గానీ అప్పుడు కూడ 'ఓటు వేయడానికి పోతున్నాం, మమ్మల్ని తన్నొద్దు' అని తోవలో ఎదురుపడిన పోలీసులకు దండం పెట్టుకుంటూ పోవాలి. ఆ రోజున వేరే ఏ పనిమీదా ఇంటి నుండి బయటకు రావడం శ్రేయస్కరం కాదు. పోలీసులూ పారామిలిటరీ జవాన్లూ గొడ్లను తరిమినట్లు ప్రజలను తరిమికొడుతున్న దృశ్యం ఎన్నికలప్పుడు ఈ మధ్యకాలంలో రాయలసీమలో ఎక్కడ చూసినా కనబడుతుంది.

ఈసారి ఎన్నికలలో కడప జిల్లా ప్రొద్దుటూరులో స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేసిన ఎం.వి. రమణారెడ్డి నుండి ఎన్నికలను కాపాడడానికి మైదుకూరు రోడ్డును పోలీసులు సీల్ చేసేశారు. అతని విలాసం, అతని సామ్రాజ్యం ఆ రోడ్లో ఉన్నాయి కాబట్టి ఆ వైపు నుండి పురుగు కూడ – అభ్యర్థి జీపుల్లో కూర్చున్న లైసెన్స్ పురుగులు మినహా– ప్రవేశించకుండా ప్రొద్దుటూరును కట్టుదిట్టం చేయడం తప్ప ఎన్నికలను అతని జగద్విదితమైన రౌడీయిజం నుండి కాపాడడానికి వేరే మార్గం లేదని ఎన్నికల అధికారులు భావించినట్టున్నారు.

ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసే ఈ నిర్బంధ అధికారాలు ఎవరి దౌర్జన్యాలను అరికట్టడానికి ఉద్దేశింపబడ్డాయో వారికే ఉపయోగపడడం కూడ కద్దు. అధికారం ఎక్కడున్నా అక్కడ అవినీతి, ఆశ్రిత పక్షపాతాలు కూడ ఉంటాయి. అపరిమితమైన అధికారాలు అవినీతికి మరింత అవకాశం ఇస్తాయి.

అనంతపురం జిల్లా పెనుకొండ తెలుగుదేశం అభ్యర్థికి ఆ జిల్లా కలెక్టరు, పోలీసులు సహకరించి అక్రమాలను అరికట్టడానికి తమ చేతిలో పెట్టబడ్డ విపరీత అధికారాలను అతని అక్రమాలకు అండగా వినియోగించిన వైనం దీనికొక ఉదాహరణ. ఆ అభ్యర్థి పరిటాల రవి. రాయలసీమలో వేరే ఏ ముఠా నాయకుడూ ఈ మధ్యకాలంలో కలిగించనంత భయం కలిగించిన వ్యక్తి.

ఈసారి అతను రాజశేఖరరెడ్డితో ఒడంబడిక చేసుకొని తాను అనంతపురం జిల్లాలో వేరే నియోజకవర్గాలలో కాంగ్రెస్ గెలుపు కోసం కృషిచేసేటట్లూ, పెనుకొండలో మాత్రం కాంగ్రెస్‌వారు బలహీనమైన ప్రత్యర్థిని పెట్టేటట్లూ అంగీకారం కుదుర్చుకున్నాడు. ఇక అతనికి మిగిలింది 'జనశక్తి' మద్దతు ఇచ్చిన స్వతంత్ర అభ్యర్థి రాంకుమార్ ఒక్కడే. అతనిని ఎదుర్కోవడానికి రవికి ఆ జిల్లా ఎన్నికల అధికారి అయిన కలెక్టరు, పోలీసులు పనికొచ్చారు. ఎన్నికల సందర్భంగా వారికి ఇవ్వబడిన అపరిమితమైన అధికారాలు పనికొచ్చాయి.

రవిని కాదని ఆ జిల్లా వాళ్ళు అతని ప్రత్యర్థికి పోలింగ్ ఏజెంట్లుగా కూర్చోలేరు కాబట్టి బయటి జిల్లాల వాళ్ళెవరూ కూడ కూర్చోకుండా బయటి జిల్లాల వాళ్ళెవారూ అనంతపురంలో పోలింగ్ ఏజెంట్లుగా కూర్చోవడానికి వీలులేదని జిల్లా కలెక్టర్ ఆదేశించాడు. వేరే ఏ జిల్లాలోనూ ఏ రోజూ లేని ఈ ఆదేశం పెనుకొండ పోలింగ్ బూత్‌లన్నిటినీ రవికి అప్పగించడానికి పనికొచ్చింది. ఈ ఆదేశాన్ని ఆసరా చేసుకొని పోలీసులు రంగంలోకి దిగి రాంకుమార్ బయటి జిల్లాల నుండి రప్పించిన కార్యకర్తలను అరెస్టుచేసి పనిలో పనిగా చాలామంది మీద రాజద్రోహం కేసులు కూడ పెట్టారు. పెనుకొండలో 'రాజద్రోహం' అంటే అదే మరి!

*ప్రజాతంత్ర వారపత్రిక*
*19 సెప్టెంబర్ 1999*



# ఎన్నికల సంస్కరణలు స్థిరత్వం కోసమేనా?



ఎన్నికల వ్యవస్థలోని లోపాల గురించి ఫిర్యాదు చేయని వారెవ్వరూ లేరు. బహుశా, రాజకీయ విభేదాలకు అతీతంగా ఈ దేశంలో అందరూ అంగీకరించే కొద్ది విషయాలలో ఇదొకటేమో. 'అందరూ' అని ఎందుకంటున్నామంటే ఎన్నికల వ్యవస్థను భ్రష్టుపట్టించ డానికి కారణమైనవారు, దానివల్ల చాలా ప్రయోజనం పొందుతున్నవారు కూడ ఆ వ్యవస్థ దిగజారిపోయిందనీ దానిని సంస్కరించాలనీ వేదికలెక్కి ఉపన్యాసాలిస్తుంటారు.

ఇప్పుడు ఎన్నికల సంస్కరణల కోసం కొన్ని నిర్దిష్టమైన ప్రతిపాదనలను లా కమిషన్ ప్రభుత్వం ముందు పెట్టింది. దానిమీద 200 పేజీల రిపోర్టు తయారుచేసింది.

మామూలుగా లా కమిషన్ తనంతట తాను శాసన సవరణలను రూపొందించదు, ప్రతిపాదించదు. ఫలాన విషయంలో ఇప్పుడున్న చట్టాన్ని పరిశీలించి అందులోని లోపాలను చర్చించి సవరణలు సూచించమని ప్రభుత్వం అడిగినప్పుడు మాత్రమే లా కమిషన్ కదులుతుంది. ఎన్నికల వ్యవస్థకు సంబంధించిన ఒకే ఒక్క అంశం గురించి కేంద్రప్రభుత్వం 1995 నవంబర్ 2న లా కమిషన్‌ను సూచనలడిగింది. అది – ఎలక్షన్ పిటిషన్లు (గెలిచిన అభ్యర్థి ఎన్నిక చట్టవిరుద్ధమని ఓడిపోయిన అభ్యర్థి వేసే కేసు) త్వరగా విచారించడానికి అవసరమయిన సూచనలు చేయమని. ఎలక్షన్ పిటిషన్‌ను కోర్టులు సివిల్ దావాలలాగ విచారిస్తుండడం వల్ల సాధారణంగా తప్పొప్పులు తేలేసరికి ఎన్నికయిన పదవి గడువు తీరిపోతుంటుంది. అందువల్ల వాటిని త్వరగా విచారించే ప్రత్యామ్నాయ విధానాన్ని సూచించమని ప్రభుత్వం లా కమిషన్‌ను కోరినట్టుంది.

లా కమిషన్ నుంచి స్పందన రానందువల్లనేమో, ప్రభుత్వం 1998 ఆగస్టు 3న ఒక రిమైండర్ పంపించింది. అయితే అప్పటికే లా కమిషన్ ఛైర్మన్ బాధ్యతలు చేపట్టిన జీవన్‌రెడ్డిగారు ఎవరూ అడగకుండానే కేవలం ఎలక్షన్ పిటిషన్ల మీదనే కాకుండా మొత్తంగానే ఎన్నికల వ్యవస్థ గురించి అభిప్రాయసేకరణ మొదలుపెట్టి ఉన్నారు. ఈ రిమైండర్ లభించినదే తడవుగా ఆయన మొత్తంగానే ఎన్నికల వ్యవస్థను సంస్కరించే ప్రతిపాదనలను ప్రభుత్వం ముందు పెట్టారు. 1999 మే 29న ఆయన కేంద్ర న్యాయశాఖమంత్రి రాంజెత్మలానీకి సమర్పించిన ఆ నివేదిక ఇప్పుడు కేంద్రప్రభుత్వం పరిశీలనలో ఉంది.

అడగకుండానే చొరవ తీసుకున్నందుకు జీవన్‌రెడ్డి గారిని మనం తప్పు పట్టనవసరం లేదు. ఆయన నిజానికి తన శక్తి మేరకు శాసనవ్యవస్థను సమూలంగా మార్చడానికి ఉబలాటపడుతున్నారని లా కమిషన్ ఛైర్మన్‌గా ఆయన అనేక విషయాలలో తీసుకుంటున్న చొరవను బట్టి అర్థం అవుతుంది. అయిదేళ్ళకు పైగా పెండింగ్‌లో ఉన్న కొత్త టాడా బిల్లుకు ఆయన తుదిరూపం ఇచ్చేశారు. రాజ్యాంగ సమీక్ష కమిషన్‌లో దాని ఛైర్మన్ వెంకటాచలయ్య గారి కంటే చురుకైన పాత్ర నిర్వహిస్తున్నారు. ఇప్పుడు అడగకుండానే ఎన్నికల సంస్కరణల కోసం రాజ్యాంగం నుండి ప్రజాప్రాతినిధ్య చట్టం దాకా అనేక సవరణలు ప్రతిపాదించే ఈ రిపోర్టు తయారుచేశారు. బాధ్యత గలవాళ్ళు తమ పైవాళ్ళు పురమాయించేదాకా నాకెందుకొచ్చింది లెమ్మనే వైఖరితో కబుర్లతో కాలక్షేపం చేసే అధికార సంస్కృతి నెలకొని ఉన్న ఈ దేశంలో స్వంత చొరవ తీసుకున్న వ్యక్తిని ఆ కారణంగా నిందించనవసరం లేదు.

ఆ చొరవ ఏ గమ్యానికి పోతున్నదనేదే ప్రశ్న.

పాలనలో ప్రజలకు ప్రాతినిధ్యం కల్పించడం కోసం ఎన్నికలు జరుపుకుంటాం. ప్రజలందరూ ప్రత్యక్షంగా పాలనా నిర్ణయాల ప్రక్రియలో పాల్గొనడం గ్రామపంచాయతీ స్థాయిలో సహితం కష్టం కాబట్టి ఏదో ఒక రూపంలో ఎన్నికలు జరుపుకొని ప్రజా ప్రతినిధులతో ఏర్పడే ప్రభుత్వాన్ని ఎన్నుకోక తప్పదు. ఎన్నికలే ప్రజాస్వామ్యం కాదు గానీ ఎన్నికలు లేని ప్రజాస్వామ్యం ఉండజాలదు. ఎటొచ్చీ ఆ ఎన్నికల వ్యవస్థ రూపు రేఖలలో చాలా వైవిధ్యం ఉండగలదు. వీటి తులనాత్మక పరిశీలనకు ఒకే ఒక ప్రమాణం ఉంటుంది. ప్రజలకు పాలనా వ్యవస్థలో ఎంత లోతయిన ప్రాతినిధ్యం లభిస్తుందనేది ఆ ప్రమాణం.

అందువల్ల ఎన్నికల సంస్కరణల గురించి మాట్లాడుకోవడమంటే ప్రాతినిధ్య స్వభావాన్ని పెంచే మార్గాల గురించి మాట్లాడుకోవడం. ఆ లక్ష్యంతో జరిపే చర్చే ప్రజాస్వామ్యం పెంపుదలకు తోడ్పడుతుంది. వేరే ఏ లక్ష్యంతోనో చర్చించి ఎన్నికల వ్యవస్థను సంస్కరిస్తున్నామనడంలో అర్థం లేదు.

ఎన్నికల సంస్కరణలకు సంబంధించిన ప్రతిపాదనలు చేయడంలో తన లక్ష్యమేమిటో లా కమిషన్ ప్రకటించింది. ప్రకటించిన లక్ష్యాలను నిజంగా అనుసరించక పోవచ్చుననేది అటుంచి, ఈ లక్ష్యాలలో 'ఎన్నికల వ్యవస్థ ద్వారా పాలనలో ప్రజాభీష్టానికి లభించే ప్రాతినిధ్యాన్ని మరింత లోతుగా అభివృద్ధి చేయడం' అనేది లేదు. మరి ఏముందంటే, లా కమిషన్ ప్రకటించుకున్న ప్రధాన లక్ష్యం – ఎన్నికల వ్యవస్థను మరింత 'పారదర్శకంగా, న్యాయబద్ధంగా' తయారు చేయడం. రెండవ లక్ష్యం 'ప్రభుత్వాల స్థిరత్వాన్ని పెంచడం'. ఇందులో రెండవ దానికి ప్రాతినిధ్య స్వభావం పెంపుదలతో ఏమీ సంబంధం లేకపోగా దానికి వ్యతిరేకం కాగలదు కూడ. మొదటది దానంతటదే ఆహ్వానించదగ్గదే కాక ప్రాతినిధ్యాన్ని పెంపొందించడానికి పరోక్షంగా ఉపయోగపడగలదు. అయితే నిజంగా ఉపయోగపడుతుందా లేదా అనేది ఆ లక్ష్యసాధన కోసం ప్రతిపాదించే విధాన సంస్కరణలను బట్టి ఉంటుంది. ప్రభుత్వాల స్థిరత్వం సంస్కరణల ప్రధాన లక్ష్యమైతే, పారదర్శకత కోసం సూచించే సంస్కరణలు కూడ ఆ రంగే పులుముకుంటాయి. అప్పుడు పాదర్శకత ప్రాతినిధ్యానికి పెద్దగా దోహదపడకపోవచ్చు.

ఇవి మా లక్ష్యాలు అని లా కమిషన్ ప్రకటించిన చోట పై రెండు లక్ష్యాలనే ప్రస్తావించింది గానీ దిగువన వేరొక ముఖ్య లక్ష్యాన్ని పలుచోట్ల పేర్కొనింది. అది, కులం ప్రాంతం మతం ప్రాతిపదికన ఏర్పడిన పార్టీలకు ఎన్నికల రంగంలో చోటు లేకుండా చేయడం. జాతీయ పార్టీలు మాత్రమే ఉండాలి అంటే మొత్తంగా సమాజం అంతటికీ ప్రాతినిధ్యం వహించే పార్టీలే ఉండాలి. ఏదో ఒక సామాజిక వర్గానికి ప్రాతినిధ్యం వహించే రాజకీయాలు లా కమిషన్ దృష్టిలో సంకుచిత రాజకీయాలు. అటువంటి రాజకీయాలకు ఎన్నికల వ్యవస్థలో చోటులేకుండా చేయాలని (ఎన్నికల వ్యవస్థ నుండి బలవంతంగా బయటికి నెట్టేస్తే ఆ రాజకీయాలు వేరే రూపంలో కొనసాగవా? అప్పుడు వాటికోసం టాడా చట్టం ఉంటుంది. దానికి కూడ ఇదే లా కమిషన్ ఆమోదముద్ర వేసి చట్టం చేయమని ప్రభుత్వానికి అప్పగించింది) చెప్పింది.

అంటే ఎన్నికల రాజకీయాలలో జాతీయ పార్టీలు మాత్రమే ఉండాలి. అవి కూడ రెండు మూడు మాత్రమే ఉండాలి. (ఎందుకు? బ్రిటన్‌లో మూడు పార్టీలే ఉన్నాయి, అమెరికాలో రెండే ఉన్నాయి, జర్మనీలో నాలుగే ఉన్నాయి. ఆ దేశాలు ఎంత బాగున్నాయి చూడండి! అందుకు.) ఒకవేళ 'సంకుచిత' ప్రాతిపదిక మీద చిన్న పార్టీలు ఏర్పడినా అవి ఏదో ఒక 'జాతీయ కూటమి'లో భాగం కావాలి. చట్టం వాటిపైన ఆ రకమైన ఒత్తిడి పెట్టి బలవంతంగా ఆ పరిణామాన్ని సాధించాలి.

ఇదీ లా కమిషన్ ప్రతిపాదన. అందుకోసం రాజ్యాంగానికీ ప్రజాప్రాతినిధ్య చట్టానికీ అనేక సవరణలను లా కమిషన్ ప్రతిపాదించింది. ఈ ప్రతిపాదన 'స్థిరత్వాన్ని' లక్ష్యంగా పెట్టుకున్న ప్రతిపాదన. అయితే పరిపాలనలో స్థిరత్వమే ఎన్నికల సంస్కరణల లక్ష్యం కాగలదనుకున్నా దానికి ఇదొక్కటే సాధనం కానక్కరలేదు. కాబట్టి రెండు లేక మూడు పెద్ద పార్టీల వ్యవస్థే ఉండాలని కోరుకోవడం దానంతటదే ఎన్నికల సంస్కరణలకు లా కమిషన్ ఎంచుకున్న ఒక లక్ష్యమని భావించవలసి ఉంటుంది. చిల్లర మల్లర పార్టీల గుంజులాటలో చకచకా నిర్ణయాలు తీసుకొని గబగబా దేశాన్ని అభివృద్ధి చేసేయగల ఎఫిషియెన్సీని భారత ప్రజాస్వామ్యం కోల్పోయిందన్న అసహనం – ఇవ్వాళ మధ్యతరగతి, ధనిక వర్గాల్లో తరచు వినిపించే అసహనం – లా కమిషన్ ప్రతిపాదనల వెనుక స్పష్టంగా ఉంది. పాలనా వ్యవస్థలో స్థిరత్వాన్ని కోరుకోవడం కూడ 'అభివృద్ధి' వేగంగా కావాలన్న లక్ష్యంతోనే తప్ప పాలనలో ప్రజాస్వామ్యానికి మరింత లోతయిన ప్రాతిపదిక కల్పించాలన్న ఆరాటంతో కాదు. స్థిరత్వం తప్పనిసరిగా ప్రజాస్వామ్యాన్ని పెంపొందిస్తుందన్న నమ్మకమేం లేదు. అది పరిస్థితులను బట్టి ఉంటుంది.

అటువంటి స్థిరత్వాన్ని ఎన్నికల సంస్కరణల లక్ష్యంగా ఎంచుకొని, దానికి సాధనంగా రెండు లేక మూడు జాతీయ పార్టీల లేక కూటములలోకి దేశ రాజకీయాలను బలవంతంగా నెట్టే శాసన సవరణలను ప్రతిపాదించే సంస్కరణలు ఎన్నికల వ్యవస్థలో ప్రజాస్వామ్యాన్ని పెంపొందించే బదులు మరింత దిగజార్చే ప్రమాదం ఉంది.

ఈ సూచనల వివరాలు దిగువ చూద్దాముగానీ, ఎన్నికల వ్యవస్థలో పారదర్శకతను దృష్టిలో పెట్టుకొని లా కమిషన్ చేసిన సూచనల గురించి మొదట చెప్పుకుందాం. అందులో ప్రధానమైనది, ఎన్నికలలో పాల్గొనే ప్రతీ పార్టీలోనూ అంతర్గత ప్రజాస్వామ్యం

ఉండాలనేది. అంతర్గత ప్రజాస్వామ్యం ఉందని ఎన్నికల కమిషన్‌ను ఒప్పించలేని పార్టీ తన గుర్తింపును కోల్పోతుంది. ఎన్నికలలో పాల్గొనే అర్హతను కోల్పోతుంది.

ఇది నిస్సంకోచంగా ఆహ్వానించదగ్గ ప్రతిపాదనే. 'తన అంతర్గత వ్యవహారాలలో ప్రజాస్వామ్యం పాటించని పార్టీ, దేశాన్ని పరిపాలించేటప్పుడు ప్రజాస్వామ్య సూత్రాలను గౌరవిస్తుందని నమ్మలేము' అన్న లా కమిషన్ అభిప్రాయంతో ఏకీభవించవచ్చును. రాజకీయ పార్టీల కార్యవర్గాన్ని రహస్య బ్యాలెట్ ద్వారా ఎన్నుకోవాలి. అన్ని స్థాయిలలోనూ తీర్మానాలు, నిర్ణయాలు రహస్య బ్యాలెట్ ద్వారా మెజారిటీ సభ్యులు ఆమోదించాలి. క్రమశిక్షణకు ఒక కచ్చితమైన నియమావళి ఉండాలి, దాని ప్రకారం మాత్రమే క్రమశిక్షణ చర్యలు తీసుకోవాలి. పార్టీ నిధుల విషయంలో జమాఖర్చు లెక్కలు స్పష్టంగా ఉండాలి. ఎన్నికల కమిషన్‌కు ఈ అన్ని నియమాలూ సక్రమంగా అమలవుతున్నాయా లేదా అని పర్యవేక్షించే అధికారం ఉంటుంది. అమలుకాని పక్షంలో ఎన్నికల కమిషన్ ఆ పార్టీ గుర్తింపును రద్దు చేస్తుంది.

పార్టీ సభ్యులకు పార్టీ తీర్మానాల పైన రహస్య బ్యాలెట్ ద్వారా ఓటువేసి అభిప్రాయం తెలియచేసే హక్కు, కార్యవర్గాన్ని రహస్య బ్యాలెట్ ద్వారా ఎన్నుకునే హక్కు ఉన్న రాజకీయ పార్టీలు దేశంలో ఏవీ లేవు. ఒక్కొక్క పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం కొంతమేరకు ఉంటే ఉండవచ్చునుగాక. అందువల్ల (కమ్యూనిస్టు పార్టీలతో సహా) ఎవ్వరికీ ఈ ప్రతిపాదనలు నచ్చకపోవచ్చును గానీ వీటిని ఆహ్వానించవలసిందే.

అయితే రిజిస్ట్రేషన్ అర్హత పొందడానికి లా కమిషన్ సూచించే మరొక నియమం కొంత ఆలోచించతగింది. రాజకీయ పార్టీల లక్ష్యాలు భారత రాజ్యాంగ లక్ష్యాలే అయి ఉండాలన్నది ఈ నియమం. ప్రతీ రాజకీయ పార్టీకీ తన లక్ష్యాలు తెలిపే ప్రణాళిక ఒకటి ఉండాలనీ, రిజిస్ట్రేషన్ కోరేటప్పుడు దానిని ఎన్నికల కమిషన్‌కు సమర్పించాలనీ, ఈ లక్ష్యాలు భారత రాజ్యాంగ లక్ష్యాలకూ ఆదర్శాలకూ లోబడి ఉండాలనీ, లేకపోతే ఆ పార్టీకి రిజిస్ట్రేషన్ నిరాకరించాలనీ లా కమిషన్ అంటుంది. వేరొకచోట ప్రజాస్వామ్యం, సోషలిజం, లౌకికవాదం అనే రాజ్యాంగ ఆదర్శాలకు అన్ని పార్టీలూ కట్టుబడి ఉండాలనీ, కట్టుబడి ఉండని వాటికి ఎన్నికలలో పాల్గొనే అర్హత ఉండకూడదనీ లా కమిషన్ అంటుంది.

భారత రాజ్యాంగ లక్ష్యాలలోని సమతా న్యాయాలతో మాకేమీ పేచీ లేదుగానీ, ఈ నియమాన్ని గురించి కొంచెం ఆలోచించడం అవసరం. ఒకటి, సోషలిజం లౌకికవాదం ప్రజాస్వామ్యం సామాజిక న్యాయం అనే మాటలకు ఒకే ఒక అర్థం ఉందని చెప్పలేము. ఒక పార్టీ లక్ష్యాలు వీటికి అనుగుణంగా ఉన్నాయా లేదా అని ఎవరు నిర్ణయించాలి? బిజెపి లౌకికవాద పార్టీ కాదని తక్కిన పార్టీలన్నీ అంగీకరించినా, వారిదే కుహనా లౌకికవాదమనీ, హైందవ సంస్కృతే నిజమైన లౌకిక సంస్కృతి అనీ బిజెపి అంటుంది. దళిత, వెనుకబడిన కులాల అవసరాల ప్రాతిపదికన నడిచే రాజకీయాలు లౌకికవాద రాజకీయాలు కావని వాదించేవారు ఈ దేశంలో చాలామంది ఉన్నారు. ఆ రాజకీయాలను 'కమ్యూనల్' రాజకీయాలు అనడం కద్దు. అయితే భారత దేశంలో కులనిర్మూలనా రాజకీయాలే నిజమైన లౌకికవాద రాజకీయాలు కాబట్టి, దళిత కులాల ఆకాంక్షల ప్రాతిపదికన నడిచే రాజకీయాలే నిజమైన రాజకీయాలని ఇవతలి వైపు నుండి వాదించే అవకాశం ఉంది. ఈ సంవాదాన్ని తేల్చగలవారెవ్వరు? ఎన్నికల కమిషన్ తేల్చగలదా? తేల్చి కదా రిజిస్ట్రేషన్ ఇవ్వాలి?

రాజ్యాంగ ప్రవేశికలో సామాజిక ఆర్థిక రాజకీయ న్యాయం అనే లక్ష్యాలేకాక దేశ సమగ్రత, ఏకత కూడ అంతర్భాగాలే. కానీ దేశంలోని సరిహద్దు రాష్ట్రాలలో ఈ 'ఏకత'ను ప్రశ్నించే రాజకీయాలే బలమైనవి. ఏ పార్టీకీ ఆ రాజకీయాలు ఉండడానికి వీలు లేదనీ, ఉంటే అటువంటి పార్టీకి ఆ రాష్ట్రంలో ఎన్నికలలో పాల్గొనడానికి అవసరమైన రిజిస్ట్రేషన్ దక్కదనీ నియమం పెడితే ఎన్నికల నుండి ప్రధాన రాజకీయ ఆకాంక్షను వెలివేయడమవుతుంది కదా?

వేర్పాటు హక్కుల ఉద్యమం దృష్టిలో ఇది అభ్యంతరకరమైన ఆకాంక్ష కాదు. ఏ ప్రజలకైనా తమ మనుగడకు సంబంధించిన స్వయం నిర్ణయాధికారం ఉంటుందనేది ఒక రాజకీయ హక్కు. అయితే అభ్యంతరకరమైన రాజకీయాల విషయంలో కూడ వాటిని వెలివేయడం ఎంతవరకు సబబనే ప్రశ్న వస్తుంది. ప్రజాస్వామ్యం పేరు మీద అప్రజాస్వామికమైన రాజకీయ పోకడలకు సహితం స్వేచ్ఛ ఇవ్వాలా అనేది సులభంగా జవాబు చెప్పగల ప్రశ్న కాదు. టర్కీ, అల్జీరియా వంటి దేశాలు ఈ సమస్యను బలంగా ఎదుర్కొంటున్నాయి. టర్కీలో ముస్లిం మతవాద పార్టీల కూటమికి ఎన్నికలలో మెజారిటీ సీట్లు లభించినప్పటికీ వారి రాజకీయ లక్ష్యం ఆ దేశ లౌకిక రాజ్యాంగానికి విరుద్ధం

కాబట్టి వారి చేతికి అధికారం ఇవ్వకుండా సైన్యం అడ్డుపడింది. దాని ఫలితంగా ప్రజలలో చెప్పుకోదగ్గ మద్దతు ఉన్న మతవాదం హింసాత్మక రూపం తీసుకొని అంతర్యుద్ధ పరిస్థితి ఏర్పడింది. మన లా కమిషన్ పెట్టే షరతులు కూడ ఇటువంటి పరిస్థితికే దారితీయవచ్చు. అట్లాగని ఫాసిస్టు పోకడలకు కూడ పూర్తి స్వేచ్ఛ ఇయ్యవలసిందేనా అంటే ఆ ప్రశ్నకు సులభమైన జవాబు ఉందని అనలేము గానీ, నిషేధం కంటే సంవాదాన్ని నమ్ముకోవడం మొత్తంమీద ప్రజాస్వామ్య సంరక్షణకూ పురోగమనానికీ ఎక్కువ ఉపయోగపడుతుందని చెప్పగలము.

అదెట్లాగున్నా పార్టీలలో అంతర్గత ప్రజాస్వామ్యాన్ని తప్పనిసరి చేసిన కారణంగా ఫిరాయింపులను పూర్తిగా నియంత్రించవచ్చునని లా కమిషన్ భావించింది. ప్రస్తుతమున్న చట్టం ప్రకారం ఎన్నికయిన ప్రజాప్రతినిధి పార్టీ ఫిరాయిస్తే తన సీటు కోల్పోవలసి ఉంటుంది గానీ, చట్టసభలో ఆ పార్టీకి చెందిన వారిలో మూడవవంతు కంటే ఎక్కువ మంది ఫిరాయిస్తే అది 'ఫిరాయింపు' కాక 'చీలిక' కిందికి వస్తుంది కాబట్టి సీట్లు వదులుకోనక్కరలేదు. ఇది విపరీతంగా దుర్వినియోగానికి గురయింది కాబట్టి ఈ మినహాయింపును తొలగించాలని లా కమిషన్ ఇప్పుడు ప్రతిపాదించింది. అంటే ఒకసారి ఒక పార్టీ టికెట్‌పైన ఎన్నికయిన వ్యక్తి ఎట్టి పరిస్థితిలోనూ అయిదేళ్ళు ఆ పార్టీలో కొనసాగవలసిందే. లేదా తన సీటు కోల్పోవాలి. పార్టీలు తీసుకునే నిర్ణయాలను పార్టీ సభ్యులు రహస్య బ్యాలెట్ ద్వారా మెజారిటీగా ఆమోదించాలన్న అంతర్గత ప్రజాస్వామ్య సూత్రాన్ని ప్రవేశపెడుతున్నాము కాబట్టి, ఆ పార్టీ టికెట్‌పైన ఎన్నికయిన వ్యక్తి అయిదేళ్ళపాటు ఇష్టమున్నా లేకున్నా ఆ పార్టీకే కట్టుబడి ఉండాలనీ, లేకపోతే సీటు వదులుకోడానికి సిద్ధపడాలనీ నియమం పెట్టడం ప్రజాప్రతినిధుల హక్కులకు భంగకరం కాదని లా కమిషన్ వాదన. మన రాజకీయ నాయకులు దీనికి కూడ ఏదో ఒక విరుగుడు కనిపెట్టరని నమ్మగలిగితే, ఇది ఆలోచించదగ్గ ప్రతిపాదనే!

నేర చరిత్రగల అభ్యర్థులను పోటీకి అనర్హులు చేసే విషయంలోనూ లా కమిషన్ ఒక ప్రతిపాదన చేసింది. ఎన్నికల పోటీ న్యాయంగా, నిష్పక్షపాతంగా జరగడానికి అది అవసరమనింది. ఇప్పుడున్న చట్టం ప్రకారం నేరం రుజువయి శిక్షపడితేనే అనర్హత వర్తిస్తుంది. అయితే ఈ రకమైన నేరాలకు పాల్పడే వ్యక్తులు రాజకీయ బలం, పరపతి గలవారు కావడం వల్ల వారికి వ్యతిరేకంగా మాట్లాడడానికి స్వతంత్రులయిన

సాక్షులు ముందుకు రారు కాబట్టి నేరాలు రుజువు కావడం కష్టమనీ, అందువల్ల కొన్ని రకాల నేరాలలో నేరం రుజువయ్యేదాకా ఆగకుండా కోర్టులో అభియోగాలు మోపితే చాలు వారిని ఎన్నికలలో పోటీచేయడానికి అనర్హులుగా భావించాలని లా కమిషన్ ప్రతిపాదన, జీవితఖైదు విధించగల అన్ని నేరాలు, విభిన్న ప్రజావర్గాల మధ్య విద్వేషాన్నీ శతృత్వాన్నీ రెచ్చగొట్టే నేరాలు ఈ కోవలోకి రావాలని లా కమిషన్ ప్రతిపాదన.

నేరం రుజువయ్యేదాకా ఆగకుండా ఛార్జిషీటు ఆధారంగా న్యాయస్థానం అభియోగాలు మోపితే అనర్హులుగా భావించాలన్న ప్రతిపాదనతో సూత్రప్రాయంగా అభ్యంతరం ఉండనవసరం లేదు గానీ ఇక్కడ రెండు విషయాలు ఆలోచించాలి. నేరాలన్నిటినీ ఒకే గాటనకట్టి, అభియోగాలు ఏ కారణంగా ఎదుర్కొంటున్నా వారిని 'నేరచరిత్ర గలవారు' అనడం భావ్యం కాదు. కార్మిక రైతాంగ ఉద్యమాల నుండి గానీ ఇతర రాజకీయల ఉద్యమాల నుండి గానీ ఎన్నికల రంగంలోకి ప్రవేశించిన వ్యక్తుల మీద తప్పుడు కేసులో, సరయిన కేసులో గానీ మొత్తానికి కేసులుండే అవకాశం ఉంది. నేరం రుజువయ్యేదాకా ఆగాలా లేదా అన్న సంగతి అటుంచి, అసలు ఈ నేరాలను అనర్హత కలిగించేవిగా భావించడం సబబా? ఉద్యమకారుల నడవడిక ఎల్లప్పుడూ సరిగ్గానే ఉంటుందని అనలేము గానీ ఉద్యమాలలో భాగంగా నేరాలకు పాల్పడిన వారిని కూడ 'నేరచరితులు' అనే అనైతిక జీవుల కోవలో చేర్చడం కరెక్టా? పైగా ఇప్పుడు అభియోగం మోపితే చాలునని లా కమిషన్ భావించే నేరాలలో విభిన్న వర్గాల మధ్య విద్వేషం, శత్రుత్వం రెచ్చగొట్టే నేరాలను (సెక్షన్ 153ఎ, 505 ఐపిసి) చేర్చారు. అనేక ప్రజాతంత్ర ఉద్యమ నినాదాలకు ఈ ముద్ర వేయొచ్చు. ప్రజాతంత్ర ఉద్యమాలలో గట్టిగా పాల్గొంటే ఎన్నికలకు అనర్హులయ్యే పరిస్థితి వస్తుందేమోనన్న భయం ఉండడం ప్రజాస్వామ్యానికి మంచిదా? రెండు, నిజంగా హేయమైన నేరాలలో అభియోగాలు ఎదుర్కోవడాన్ని అనర్హతగా భావించడంలో అర్థం ఉంది గానీ 'జీవితఖైదు విధించగల నేరాలు' అని టోకుగా అనడం ఎంతవరకు ఉచితం? చట్టం చేసే ఏ వర్గీకరణ అయినా తన లక్ష్యానికి అనుగుణంగా ఉండాలన్న ప్రాథమిక న్యాయసిద్ధాంత సూత్రాన్ని జీవన్‌రెడ్డి గారికి జ్ఞాపకం చేయనవసరం లేదు. ఎన్నికలు ప్రజాస్వామ్య ప్రక్రియ కాబట్టి సాంఘికంగా అప్రజాస్వామికమైన నేరాలు ఎన్నికల విషయంలో అనర్హతకు ప్రమాణం కాగలవు గానీ ఎక్కువ శిక్ష ఉన్న నేరాలు ప్రమాణం ఎందుకవుతాయి?

ఉదాహరణకు అంటరానితనం, లైంగిక అత్యాచారం, అవినీతి, ఎన్నికల అక్రమాలు మొదలయిన నేరాలలో న్యాయస్థానం అభియోగం మోపితే చాలు ఆ వ్యక్తి ఎన్నికల పోటీకి అనర్హులయినట్టే అని అంటే కొంత అర్థం ఉంటుంది.

## స్థిరత్వం

ఎన్నికల వ్యవస్థ పారదర్శకంగా, న్యాయంగా ఉండాలన్న లక్ష్యంతో లా కమిషన్ చేసిన సూచనలను చూసిన తరువాత స్థిరత్వం అనే లక్ష్యం నుండి వచ్చిన సూచనలను చూద్దాం. ఇవి ప్రాథమికంగానే అభ్యంతరకరమైనవని మొదట్లోనే చెప్పాము.

“చిన్న చిన్న పార్టీలు అనేకం ఉండడం దేశపాలనలో అస్థిరతకు దారితీస్తున్నది. విశాలమైన జాతీయ ప్రయోజనాలు కాక సంకుచితమైన కులం, ప్రాంతం మొదలయిన పాక్షిక ప్రయోజనాలు గల పార్టీలు ఉండడం కూడ అస్థిరతకు దారితీస్తున్నది. కేవలం రెండు లేక మూడు జాతీయ పార్టీలు మాత్రమే ఉండే స్థితికి దేశ రాజకీయాలను బలవంతంగా నెట్టాలి. వెంటనే అది సాధ్యం కాదు కాబట్టి కేవలం రెండు లేక మూడు జాతీయ కూటములలోకి అన్ని పార్టీలనూ నెట్టాలి”. ఇదీ లా కమిషన్ స్థిరత్వం కోసం చేసిన సూచనల లక్ష్యం.

అసంఖ్యాకమైన భాషలు, కులాలు, జాతులుగా విడిపోయి ఉన్న భారతదేశంలో విభిన్న ప్రయోజనాలను, దృక్పథాలను వ్యక్తంచేసే అనేక రాజకీయ లక్ష్యాలుండడం సహజం. ఈ భిన్న ప్రయోజనాలను కాదని ఒక జాతీయ ప్రయోజనాన్ని గుర్తించి దానికి కట్టుబడి ఉండే రాజకీయ లక్ష్యాలు సహితం ఉండవచ్చునుగాక, కానీ అవి మాత్రమే ఉండాలనడంలో అర్థం లేదు. దాని కోసం చట్టమే రాజకీయ లక్ష్యాలపైన ఒత్తిడి పెట్టాలనడం అణచివేత తప్ప వేరే ఏమీ కాదు. స్థిరత్వానికి ప్రజాస్వామ్యాన్ని తాకట్టు పెట్టే వైఖరి ఎన్నికల సంస్కరణలకు చోదకశక్తి అయితే ఇటువంటి వికారమైన సూచనలే పుడతాయి.

ఒక రాష్ట్రంలో ఎన్నికలు జరుగుతున్నాయనుకోండి. ఆ ఎన్నికలలో పోటీచేసే ఏ పార్టీకయినా ఆ రాష్ట్రంలో మొత్తం పోలయిన వోట్లలో అయిదు శాతం రావాలంట. వచ్చినట్లయితేనే ఆ పార్టీ గెలిచిన సీట్లు ఆ పార్టీకి దక్కుతాయి. లేకపోతే గెలిచిన సీట్లు కూడా వారికియ్యకుండా రద్దుచేసి రెండవస్థానంలో ఉన్నవారికి ఇచ్చేస్తారు. ఇది లా కమిషన్ ఇంకొక సూచన.

అంటే ఒక చిన్న కులం లేక తెగకు చెందిన ప్రజల కోసం పనిచేస్తూ వారి ఓట్లు పెద్దసంఖ్యలో ఉన్న ఒకటో రెండో నియోజకవర్గాలలో పోటీచేసి గెలిచి, వారికి నిజాయితీగా చట్టసభలలో ప్రాతినిధ్యం వహించాలన్న ఆలోచనకు ఎన్నికల ప్రజాస్వామ్యంలో చోటు ఉండకూడదనేది లా కమిషన్ అభిప్రాయం. అటువంటి పార్టీ తనకిష్టమున్నా లేకున్నా ఏదో ఒక పెద్ద కూటమిలో భాగం కావాలి. అంతే కాదు, రాష్ట్రం మొత్తంమీద పోలయిన ఓట్లలో ఆ కూటమి 5 శాతమైనా పొందితేనే ఆ పార్టీకి తాను గెలిచిన ఆ ఒకటో రెండో సీట్లయినా దక్కుతాయి.

ఉదాహరణకు, మన రాష్ట్రంలో ఆదివాసుల జనాభా 6 శాతం. కేవలం ఆదివాసులలో పనిచేసే రాజకీయ పార్టీ అన్ని ఆదివాసీ నియోజకవర్గాలలోనూ పోటీ చేసి గెలిచినా, ఆదివాసుల ఓట్లలో అన్నీ ఆ పార్టీకే పడకపోవచ్చును కాబట్టి ఆ పార్టీకి వచ్చే ఓట్లు రాష్ట్ర జనాభాలో 5 శాతం మించకపోవచ్చు. అప్పుడు అన్ని ఏజెన్సీ నియోజకవర్గాలలోనూ ఆ పార్టీ గెలుపును రద్దుచేసి రెండవ స్థానంలో ఉన్న టిడిపి లేక కాంగ్రెస్ అభ్యర్థికి ఆ సీట్లు ఇస్తారు. ఈ పరిస్థితిని తప్పించుకోవాలంటే ఆ ఆదివాసీ పార్టీ ఒంటరిగా పోటీ చేయకుండా తెలుగుదేశం కూటమిలోనో కాంగ్రెస్ కూటమిలోనో చేరి తన అర్హతను నిలబెట్టుకోవాలి. ఏ రకంగా చూసినా ఆ ఆదివాసీ పార్టీపైన తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల పెత్తనం నెలకొనడమే ఈ సవరణ ఫలితంగా జరిగేది.

ఇది స్థిరత్వానికి తోడ్పడుతుందేమో గానీ ప్రజాస్వామ్యానికి నష్టకరం. స్థిరత్వం దానికదే ప్రజాస్వామ్యానికి దోహదకారి అయినట్టు ఎన్నికల సంస్కరణలకు స్థిరత్వాన్ని ముఖ్య ప్రమాణంగా లా కమిషన్ ఎంచుకుంది గానీ లేకపోతే ఇటువంటి సూచనలు చేయగలిగేది కాదు.

చిన్న పార్టీల మనుగడే ప్రశ్నార్థకం అయితే ఇంక ఏ పార్టీ లేని స్వతంత్ర అభ్యర్థుల సంగతేమిటి? స్వతంత్ర అభ్యర్థులను అసలు పోటీ చేయనీయకూడదని లా కమిషన్ సూచన. స్వతంత్ర అభ్యర్థులందరూ నాన్ సీరియస్‌గానే పోటీ చేస్తారంట. వాళ్ళ వల్ల బ్యాలెట్ పేపర్ సైజు పెరగడం తప్ప ఒరిగేదేమీ లేదంట. ఒకవేళ వాళ్ళు గెలిచినా ఏ కూటమిలో చేరతారో తెలియక అస్థిరత తెచ్చిపెడతారంట.

ప్రజాఉద్యమకారులుగా, సంస్కర్తలుగా ప్రజలలో పనిచేసి మన్ననలు పొంది ఏ పార్టీలోనూ చేరడం ఇష్టంలేక స్వతంత్రంగా పోటీచేసి గెలిచి చట్టసభలలో నిజాయితీగా ఆ ప్రజలకు ప్రాతినిధ్యం వహించినవారు చాలామంది ఉన్నారన్న సంగతి లా కమిషన్ గుర్తించదలచుకోలేదు. ఇప్పుడు అటువంటి వారి సంఖ్య తగ్గిపోయిందంటే దానికి కారణం మొత్తంగానే రాజకీయాలలో వచ్చిన భ్రష్టత్వం. ఆ కారణం చాలుననుకుంటే మొత్తంగా ఎన్నికల వ్యవస్థనే రద్దు చేసేయొచ్చు, కేవలం స్వతంత్ర అభ్యర్థిత్వాన్ని మాత్రమే రద్దు చేయడం ఎందుకు?

నిజానికి ఎన్నికల వ్యవస్థలో ప్రజాస్వామ్యాన్ని, ప్రాతినిధ్య స్వభావాన్ని పెంచే సవరణలు అనేకం సమాజంలో చర్చకు వస్తుంటాయి. ఎన్నికల సంస్కరణల మీద 200 పేజీల సుదీర్ఘమైన వర్కింగ్ పేపర్ రాసిన లా కమిషన్ వాటిలో ఒక్క దానిని కూడ చర్చించలేదంటే కారణం ఎన్నికల సంస్కరణలకు లా కమిషన్ ఎంచుకున్న లక్ష్యాలలో ప్రజాస్వామ్యాన్నీ, ప్రాతినిధ్యాన్నీ పెంచాలన్నది లేకపోవడం.

అయిదేళ్ళకొకసారి ప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకోవడమే కాకుండా, ఆ అయిదేళ్ళ పర్యంతం ఆ ప్రజాప్రతినిధులు ప్రజలకు ఏదో ఒక రూపంలో జవాబుదారులుగా ఉండాలన్నది సమాజంలో తరుచుగా చర్చ జరిగే విషయాలలో ఒకటి. ప్రజలకు నచ్చకపోతే ఆ ప్రజాప్రతినిధిని 'రీకాల్' చేసే హక్కు ఉండాలనే ప్రతిపాదన ఇందులో భాగమే. దీనిని వ్యవస్థీకరించడంలో ఇబ్బందులుండవచ్చు. నియోజకవర్గంలో ఎంతమంది కోరుకుంటే 'రీకాల్' కోసం వోటింగ్ నిర్వహించాలి, ఎంతమంది ఆ ప్రతిపాదనకు అనుకూలంగా వోటు వేస్తే అది గెలిచినట్టు భావించాలి అనేవి సులభంగా నిర్ణయించగల విషయాలు కాకపోవచ్చు. కానీ ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే లా కమిషన్ చేసే ఎన్నికల సంస్కరణల చర్చలో ఈ ప్రస్తావనే లేకపోవడం.

ప్రాతినిధ్యం దృష్టితో చూసినప్పుడు నియోజకవర్గాల సైజు కూడ ఒక సమస్యే. మన పార్లమెంటు సభ్యులొక్కొక్కరు 10 లేక 15 లక్షల మందికి ప్రతినిధులు. వాళ్ళ పార్టీ విధానాలు, వ్యక్తిగత నిజాయితీల సంగతి అటుంచి, ఈ రకమైన ప్రాతినిధ్యానికి నిజంగా అర్థం లేదు. ఇంగ్లండ్‌లో ఒక్కొక్క పార్లమెంట్ నియోజకవర్గం మన మండలమంత ఉంటుంది. అంటే అక్కడ ఎం.పి మన ఎం.పి.పి అధ్యక్షునితో సమానం. మన

పార్లమెంట్ నియోజకవర్గాన్ని అంతగా తగ్గిస్తే పార్లమెంటు సైజు విపరీతంగా పెరిగిపోతుంది కాబట్టి అది ఆచరణయోగ్యమైన పరిష్కారం కాకపోవచ్చును గానీ అధికార వికేంద్రీకరణ పెద్దఎత్తున చేపట్టి స్థానిక సంస్థల అధికారాలు పెంచడం ఆచరణ యోగ్యమైన పరిష్కారం కాగలదు. ఏ స్థాయిలో చేయగల నిర్ణయాలను ఆ స్థాయికి చెందిన పాలనా వ్యవస్థకు, ప్రతినిధుల సభలకు అప్పగించినట్టయితే కొద్ది అధికారాలు మాత్రమే ఢిల్లీకి చెందుతాయి. ఇది కొత్తగా మేము చేస్తున్న ప్రతిపాదన కాదు. రాజ్యాంగం రాసిన రోజుల నుండి ఈ చర్చ ఉన్నదే. ప్రస్తుతమున్న ప్రాదేశిక నియోజకవర్గాలు ఆయా ప్రదేశాలలోని పెత్తందారీ వర్గాలకే ప్రాతినిధ్యం ఇస్తాయనీ, దళితులకు ఆదివాసులకు వేరే నియోజకవర్గాలు ఉండాలనీ ఒక డిమాండ్ స్వాతంత్ర పూర్వకాలం నుండి ఉంది. చట్టసభలు మగవాళ్ళ సభలుగా ఉన్నాయనీ, స్త్రీలకు రిజర్వేషన్ కల్పించాలనీ డిమాండ్ ఉండడం మాత్రమే కాదు, అది రాజ్యాంగ సవరణ దాకా వచ్చి ఆగిపోయింది. దీని చర్చే లా కమిషన్ చేయలేదు.

చివరిగా - ఎన్నికల సంస్కరణలకు ప్రభుత్వాల స్థిరత్వం లక్ష్యం కావడానికి వీలు లేదు. పారదర్శకత ఒక లక్ష్యం కాగలదు కాని ప్రాతినిధ్యం దాని ప్రధాన లక్ష్యం కావాలి. ప్రాతినిధ్యాన్ని పూర్తిగా వదిలిపెట్టి స్థిరత్వాన్ని ప్రధానం చేసి, పారదర్శకతను రెండవస్థాయి లక్ష్యంగా పెట్టుకొని ప్రాతినిధ్యాన్ని నిజానికి దిగజార్చే ప్రతిపాదనలు చేసిన లా కమిషన్ విజ్ఞతను ఏమనాలి?

*మానవహక్కుల వేదిక బులెటిన్ 2*
*జూన్ 2000*

* 'ఎన్నికల సంస్కరణలు - రాజ్యాంగ సమీక్ష ఎందుకోసం?' పేరుతో వచ్చిన మానవహక్కుల వేదిక కరపత్రంలోనూ, 'ఎన్నికల 'ఆరోగ్యానికి' లా కమిషన్ చిట్కాలు' పేరుతో ఆంధ్రప్రభ దినపత్రికలో వచ్చిన వ్యాసంలోనూ ఇవే విషయాలు ఉన్నాయి కనుక వాటిని ఈ పుస్తకంలో చేర్చలేదు.



# ఎన్నికలలో పోటీచేయడానికి నేరస్తులందరూ అనర్హులేనా?



**సు**ప్రీంకోర్టు తీర్పు మేరకు ఎన్నికల కమిషన్ జారీ చేసిన ఆదేశాలను వమ్ము చేయడానికి సకల రాజకీయ పార్టీలూ ఒకటయి శరవేగంగా ఒక చట్టం రూపొందించటం వెక్కిరింతకూ అపహాస్యానికీ గురికావడం సహజం.

సుప్రీంకోర్టు గొప్ప బుద్ధితో సంస్కరణలు ప్రవేశపెట్టాలని ప్రయత్నించగా, క్షుద్రమైన రాజకీయ శక్తులు దానిని వమ్ము చేస్తున్నాయని అభిశంసించడం జరుగుతున్నది. కానీ ఒక విషయంలో మాత్రమే ఇది సత్యం. ఎన్నికలలో నిలబడేవారు ముందుగానే తమ ఆస్తిపాస్తుల లెక్కలు ప్రమాణ పత్రం మీద రాసి ఎన్నికల కమిషన్‌కు ఇవ్వాలన్న ఆదేశాన్ని రాజకీయ పార్టీలు తిరస్కరించడం వారి ప్రయోజనాలకు అవసరమే కావచ్చును గానీ ప్రజలకూ ప్రజాస్వామ్యానికీ కాదు. రాసి ఇచ్చినంత మాత్రాన వాళ్ళకొచ్చే నష్టమేమీ లేనప్పుడు ఇంత గట్టిగా ఎందుకు వ్యతిరేకిస్తున్నారా అని మనం ఆశ్చర్యపోవచ్చు. కానీ అఫిడవిట్ మీద రాసి ఇవ్వాలన్న నియమాన్ని ఆమోదిస్తే 'ఎటుపోయి ఎటు వస్తుందో'నని ఆందోళన చెందడం ముందుచూపు గల వారికి సహజమే కాబట్టి ఆశ్చర్యపోయేవాళ్ళే అమాయకులు.

అయినప్పటికీ వామపక్ష పార్టీలు సహితం ఇతర పార్టీలతో ఈ విషయంలో గొంతు కలపడం విచిత్రమే. వామపక్ష పార్టీలు తాము చెప్పుకునేంత పరిశుద్ధంగా లేవని అందరికీ తెలుసును గానీ అభ్యర్థులు తమ ఆస్తిపాస్తుల వివరాలు ముందుగా

ప్రకటించాలన్న నియమానికి భయపడే స్థితిలో ఉన్నాయనుకోలేదు. లేక ఈ అభ్యంతరానికి ఏదో నిగూఢమైన గతితార్కిక కారణం ఉందా?

అయితే అభ్యర్థులు తమ విద్యార్హతలను కూడ ఎన్నికకు ముందు ప్రమాణ పత్రంలో ప్రకటించాలన్న సుప్రీంకోర్టు ఆదేశాన్ని రాజకీయ పార్టీలు తిరస్కరించడం సబబేనని చాలామందే గుర్తించారు కానీ, ఆస్తులకు సంబంధించిన ఆదేశాన్ని తిరస్కరించినందుకు రాజకీయ పార్టీలను విమర్శించినంత ఘాటుగా కాదు సరికదా, అందులో నూరవ వంతు తీవ్రత కూడ సుప్రీంకోర్టు చేసిన ఈ ప్రతిపాదనపైన వచ్చిన విమర్శలో ధ్వనించడం లేదు. కానీ నిజానికి ఈ ప్రతిపాదన కేవలం తప్పు కాదు, అవమానకరమైనది. తక్కువ చదువుకున్న వారి కంటే ఎక్కువ చదువుకున్న వారు మెరుగైన ప్రజా ప్రతినిధులవుతారని ఎవరైనా అనగలరా? చదువుకునే అవకాశాలు కుదించివేస్తూ, నువ్వెంత చదువుకున్నావో చెప్పు అని అడగడం పేదలను అవమానపర్చడం కాదా? సుప్రీంకోర్టు ఈ రకమైన అభిప్రాయం వ్యక్తం చేయడం యాదృచ్ఛికం కాదు. ఈ మధ్య కాలంలో దేశంలోని శిష్టవర్గాలు 'ఎన్నికల సంస్కరణల' గురించి ఎప్పుడు మాట్లాడినా ప్రజల నుండి రాజకీయ వ్యవస్థను ఎట్లా కాపాడాలన్నది వారి ప్రధాన లక్ష్యంగా ఉంటున్నది. జస్టిస్ జీవన్‌రెడ్డి గారి ఆధ్వర్యంలో జాతీయ లా కమిషన్ రూపొందించిన ఎన్నికల సంస్కరణల రిపోర్టు స్వభావం కూడ అదే. ప్రభుత్వాలు స్థిరంగా ఉండాలి. 'ప్రజాకర్షక' పథకాలు అమలుచేయాలన్న ఒత్తిడికి ప్రభుత్వాలు లొంగకూడదు. సంక్షేమం స్థానంలో 'అభివృద్ధి'కి పెద్దపీట వేసే రాజకీయ ఆర్థిక 'సంస్కరణల'లో చట్టసభలు భాగం కావాలి – ఇత్యాది ఆలోచనల ప్రేరణ ఇక్కడ ప్రధానంగా పనిచేస్తున్నది. సుప్రీంకోర్టు చేసిన ఈ సూచన ఈ కోవకు చెందినదే.

చదువుకున్న వాళ్ళకు మాత్రమే ఓటు హక్కు ఉండాలనీ లేదా పోటీ చేసే అర్హత వారికే పరిమితం కావాలనీ గతంలో కొందరు వాదించారు. రాజ్యాంగకర్తలు దానిని నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. సమర్థమైన ప్రాతినిధ్యానికి అది తప్పనిసరి కాదని గుర్తించి తిరస్కరించారు. ఇప్పుడు ప్రజలలో చదువులు పెరిగాయే తప్ప తగ్గలేదు. అయినప్పటికీ పాత వాదన ముందుకు తీసుకురావడం ఇప్పుడు వీస్తున్న ప్రజా వ్యతిరేకమైన కొత్త గాలుల వల్లనే తప్ప వేరే ఏమీ కాదు. ఇక నేరాలు, నేర చరిత్రలు గురించి ఇద్దరి ప్రతిపాదనలూ అసంతృప్తికరమైనవే. అభ్యర్థులు తమ నేరచరిత్రను

కూడ ఎన్నికలకు పూర్వం ప్రమాణ పత్రంలో ఎన్నికల కమిషన్‌కు తెలియజేయాలని సుప్రీంకోర్టు అనింది. రాజకీయ పార్టీలు దానికి అంగీకరించలేదు గానీ, రెండు కేసులలో కోర్టు ఒక అభ్యర్థిపైన అభియోగాలను ప్రకటించినట్టయితే, అవి 'తీవ్రమైన' నేర అభియోగాలైతే, ఆ అభ్యర్థిని అనర్హునిగా ప్రకటించాలని చట్టమే చేయబోతున్నారు.

'తీవ్ర అభియోగం' అంటే ఏమిటి? పత్రికలలో వచ్చిన వార్తలను బట్టి చూస్తే శిక్ష తీవ్రతను బట్టి నేరాన్ని తీవ్రమైనదిగా భావించాలని రాజకీయ పార్టీలు భావిస్తున్నట్టున్నాయి. ఇది చాలా అసంతృప్తికర అభిప్రాయం. సుప్రీంకోర్టు తీర్పును మొదట చర్చించినప్పుడు, 'రాజకీయ నేరాలను' మినహాయించాలని వామపక్ష పార్టీలు అన్నాయి. రాజకీయ నేరాలను నిర్వచించడంలో ఇబ్బందులున్నప్పటికీ, ఇది సరైన దిశలో సాగిన ఆలోచనే.

కాని నిజానికి వేటిని మినహాయించాలి అని చర్చించడం కంటే ఏ నేరాలకు ఎన్నికల చట్టంలోని నిషేధాన్ని పరిమితం చేయాలి అని చర్చించడం సబబుగాను, ఫలప్రదంగాను ఉంటుంది. ఒక వ్యక్తి ప్రజాప్రతినిధిగా ఉండడానికి తగడు అనే అభిప్రాయానికి రాగల నేరాలకు ఆ జాబితాను పరిమితం చేయాలి. రేప్ చేసిన వ్యక్తి, అంటరానితనం పాటించిన వ్యక్తి, వ్యాపార లావాదేవీలలో మోసంచేసి వేరొకరి ఆస్తిని కాజేసిన వ్యక్తి, ప్రజాధనాన్ని స్వంతం చేసుకున్న వ్యక్తి ఇత్యాది నేరాలకు పాల్పడిన వ్యక్తులు ప్రజాప్రతినిధులు కావడానికి అనర్హులంటే అర్థం ఉంది. ఇవన్నీ శిక్ష పరిమాణం రీత్యా 'తీవ్రమైన' నేరాలు కాకపోవచ్చును. కాని నైతికంగా తీవ్రమైన నేరాలు.

విచిత్రంగా అనిపించవచ్చును గానీ హత్యా నేరాన్ని మొత్తంగా ఈ కోవలో వేయలేము. కారణాన్ని బట్టి, ఉద్దేశ్యాన్ని బట్టి, పరిస్థితులను బట్టి ఒక హత్య ఈ కోవలోకి రావచ్చు, రాకపోవచ్చు. చట్టం తీవ్రమైనదిగా భావించే బందిపోటు చర్య అయినా అంతే. రాజద్రోహం, ప్రభుత్వంపైన యుద్ధం చేయడం మొదలైన నేరాలు కూడ అంతే. ఇవి శిక్షరీత్యా తీవ్రమైన నేరాలే. కానీ ఈ కోవకు చెందిన నేరాలు రెండింటిలో అభియోగ పత్రాన్ని కోర్టు స్వీకరించినట్టయితే ఇంక ఆ వ్యక్తి ఎన్నికలకు అర్హత కోల్పోవాలనడం ప్రజా ప్రాతినిధ్య ప్రమాణం దృష్ట్యా అవసరం కాదు. న్యాయమూ కాదు. బందిపోటుగా ఉండిన పూలన్‌దేవి బలహీన వర్గాల ప్రతినిధిగా రాజకీయాలలోకి

ప్రవేశించడం హర్షించదగ్గ పరిణామంగా చాలామంది భావించారు. ఈ కొత్త చట్టం అప్పుడు ఉన్నట్టయితే అది సాధ్యం అయ్యేదా?

కాశ్మీరులో మిలిటెంట్లందరినీ సాయుధ పోరాటం విడిచిపెట్టి ఎన్నికలలో పాల్గొనవలసిందిగా పెద్దలంతా ఆహ్వానిస్తున్నారు. అది కాశ్మీరీల ప్రయోజనాల రీత్యా సరైన నిర్ణయమవుతుందా కాదా అన్నది మన దృష్టిని బట్టి ఉంటుంది. అయితే రేపు పార్లమెంటులో ఈ ప్రతిపాదిత చట్టాన్ని చేసినట్టయితే కాశ్మీరీ మిలిటెంట్లెవ్వరూ ఎన్నికలలో పాల్గొనలేకపోవచ్చు. ఎందుకంటే వారెవ్వరిపైనా రెండు కంటే తక్కువ అభియోగ పత్రాలు ఉండవు. మరి అది ప్రజాస్వామ్యానికి మంచిదా?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*21 జూలై 2002*



# ప్రజాస్వామ్యం అధిక సంఖ్యాక వర్గాలకేనా?



**తె**లంగాణ రాష్ట్ర సమితికి ఒకే ఒక ఎన్నికల చిహ్నం కేటాయించాలని ఆ పార్టీ కేంద్ర ఎన్నికల కమిషన్‌కు పెట్టుకున్న అభ్యర్థన వింత వింత పరిణామాలకు దారితీస్తున్నది. కనీసం మూడవ వంతు అసెంబ్లీ సీట్లకూ పార్లమెంటు సీట్లకూ పోటీ చేయాలన్న నియమంతో ఒకే చిహ్నం ఇవ్వడానికి కమిషన్ అంగీకరించినట్టు నిన్న మొన్నటి వార్త. అంటే టిఆర్ఎస్ కాంగ్రెస్‌తో గానీ వేరే ఏ పార్టీతో గానీ ఎన్నికల సర్దుబాటు చేసుకోవడానికి వీలుండదనే అనుకోవాలా? సీట్ల సర్దుబాటు చేసుకోదలచుకుంటే చిహ్నాన్ని పోగొట్టుకోవలసిందేనా?

అసలు మొదట ఆ పార్టీ అభ్యర్థనపైన ఎన్నికల కమిషన్ ఏ నిర్ణయమూ తీసుకోలేదు. దాని కోసం ఆ పార్టీ కోర్టుకెక్కవలసి వచ్చింది. ఏదో ఒక నిర్ణయం చేయమని హైకోర్టు ఆదేశించిన తరువాత ఎన్నికల కమిషన్ ఈ నిర్ణయం ప్రకటించింది. సాంకేతిక కారణాలవల్ల అసలు విషయం దెబ్బతినడం బ్యూరోక్రసీ వ్యవహారశైలి వల్ల తరచుగా కలిగే అనర్థం. అది జరగకూడదన్న స్పృహ ప్రజాస్వామ్యాన్ని గౌరవించే వారెవరికైనా ఉండాలి.

ఒక పార్టీ ఎన్ని సీట్లలో పోటీ చేసినా ఒకే గుర్తుతో పోటీ చేయాలన్న కోరికలో మరొకరిని ఇబ్బంది పెట్టే విషయమేమీ లేదు. హక్కులమీద ఆంక్షలు పెట్టడానికి ఉండగల ప్రధాన హేతువు ఇతరుల హక్కులకు కలగగల హాని. అటువంటిదేమీ

లేనప్పుడు ఆ హక్కు ఇవ్వడం వల్ల ఏదయినా ప్రాథమిక నాగరికతా విలువ దెబ్బతినేటట్టయితే తప్ప ఆంక్షలెందుకు పెట్టాలి? అధికారం ఉంది కదా అని అడిగే వారిని ఇబ్బంది పెట్టే హెడ్‌గుమాస్తా గుణం కాకపోతే!

తెలంగాణ రాష్ట్ర సమితి ఆ షరతుకు ఒప్పేసుకుందని పత్రికలు రాశాయి. అది పత్రికల వార్తే కాబట్టి అది ఎంత నిజమో తెలీదు. చంద్రబాబు ఎట్లాగయినా ఓడిపోతే బాగుండునని కోరుకునే వాళ్ళకు ఇది కొంచెం ఆందోళన కలిగించక మానదు. టిఆర్‌ఎస్ తెలంగాణలోని అన్ని సీట్లలో స్వంత బలం మీద పోటీచేస్తే ఎక్కువ సీట్లు గెలవలేకపోవచ్చు. త్రికోణపు పోటీ వల్ల చంద్రబాబే ప్రయోజనం పొందవచ్చు. కేవలం ఒక బ్యూరోక్రాటిక్ ఆంక్ష దీనికి దారితీయడం భావ్యమా అని ఆగ్రహించేవారు తప్పక ఉంటారు.

అయితే రాష్ట్రంలోని ప్రస్తుత రాజకీయ సందర్భాన్ని పక్కకు పెట్టి ఆలోచించినా ఈ రకమైన నిర్ణయం ఆందోళన కలిగించవలసిన విషయమే. తెలంగాణ సుమారయిన జనాభాగల ప్రాంతం కాబట్టి టిఆర్‌ఎస్ ఆ రకమైన హామీ ఇవ్వడం సాధ్యమయినా అయింది. లేకపోతే ఏమై వుండేది? ఒక చిన్న జనాభాకు ప్రాతినిధ్యం వహించే పార్టీకి ఆ జనంలో నూరుశాతం సపోర్టు వున్నా ఎన్నికల సంఘం దానిని గుర్తించదా? ఎన్నికలలో పోటీ చేయడానికి 'ప్రజలందరి' ప్రతినిధి కావలసిందేనా? మొత్తం ఓట్లలో ఒక కనీస శాతం పొందవలసిందేనా? ఒక రాజకీయ పార్టీకి ఎన్నికల విషయంలో గుర్తింపు లభించడానికి ఆ పార్టీ రాజకీయాలకు సార్వజనీనత ఉండాలని ఆంక్ష పెట్టడం ఏ విధంగా హేతుబద్ధం?

ఇప్పుడున్న ఎన్నికల చట్టాలలో అటువంటి ఆంక్ష స్పష్టంగా లేదు కాబట్టి దానిని ఎన్నికల చట్టాలలోనే రాయాలని కొంతకాలం క్రితం జాతీయ లా కమిషన్ సూచించింది. చిన్న చిన్న పార్టీలు ఉనికిలో ఉండడం రాజకీయ అవకాశవాదానికీ అస్థిరతకూ దారి తీస్తున్నది కాబట్టి ఒక రాష్ట్రంలో 'పోల్' అయ్యే మొత్తం వోట్లలో ఒక కనీస శాతం లభించిన పార్టీకి మాత్రమే ఉనికి ఉండాలని లా కమిషన్ సూచించింది. ప్రస్తుతం ఉమ్మడి ఎన్నికల చిహ్నానికీ, దానితో పోల్చదగ్గ ఇతర వసతులకూ తగులుతున్న దెబ్బ రేపు ఉనికికే తగలగలదు.

అవకాశవాదానికి కారణం పరిమిత ప్రజావర్గాలకు ప్రాతినిధ్యం వహించే చిన్న పార్టీలు ఉండడం కాదు. రాజకీయాలలో నీతి లేకపోవడం. దేశంలోని రెండు ప్రధాన రాజకీయ పక్షాలుగా పత్రికలవారి గుర్తింపు పొందిన కాంగ్రెస్, భారతీయ జనతా పార్టీలే ఈ విషయంలో అగ్రభాగాన నిలిచాయి కాబట్టి చిన్న పార్టీలను నిందించ నవసరం లేదు. ఇక అస్థిరత మాటకొస్తే అది ప్రజాస్వామ్యంలో అన్ని వేళలా అవాంఛనీయం కాదు. ఎడతెగని 'అభివృద్ధి', అచంచలమైన జాతీయ వ్యక్తిత్వం, అంతర్జాతీయ రాజకీయాలలో చెక్కుచెదరని దృఢత్వం మొదలైన సంశయాస్పదమైన లక్షణాలను సద్గుణాలుగా భావించే జాతీయతా భావానికి దేశ అంతర్గత రాజకీయాలలో స్థిరత్వం దానంతటదే కాంక్షణీయం కానవసరం లేదు.

మనది చాలా వైవిధ్యం ఉన్న సమాజం. టూరిజం అవసరాల కోసం దానిని శ్లాఘిస్తుంటాము కూడ. ఆ వైవిధ్యాన్ని గౌరవించే రాజకీయ వ్యవస్థను రూపొందించు కోకపోయినట్టయితే ఇక్కడ ప్రజాస్వామ్యం అన్న మాటకు అర్థం ఉండదు. రాజ్యాంగం రాసినప్పుడే ఈ విషయంలో కొంత అన్యాయం జరిగిపోయింది. పాకిస్తాన్ ఏర్పాటును అడ్డం పెట్టుకొని 'బలమైన కేంద్రం' అవసరం అన్న ఆలోచనను అప్పటి నాయకులు రాజ్యాంగ పరిషత్‌కు నూరిపోశారు. 'దేశ విచ్ఛిన్నాన్ని' అరికట్టడం రాజ్యాంగ రచనకొక ప్రమాణం అయిపోయింది. ఫలితంగా మన సమాజంలోని వైవిధ్యానికి అతకని కేంద్రీకరణ రాజ్యాంగ రచనలోనే చోటు చేసుకుంది.

అయినా కొంతమందికి చాలడం లేదు. గోల్వాల్కర్ రాజ్యాంగాన్ని ఈ కోణం నుండి ఆనాడే తిట్టిపోశాడు. శక్తివంతమైన హైందవ సమాజాన్ని నిర్మించడానికిది పనికిరాని రాజ్యాంగం అన్నాడు. అయినా రాజ్యాంగం రాసిన తరువాత నలభై ఏళ్ళపాటు ఈ అసంతృప్తి ఆర్‌ఎస్‌ఎస్ శాఖల వెలుపల ఏమంత బలంగా వినిపించేది కాదు. కానీ 1990 తరువాత ఇది ఒక సాధారణ అసంతృప్తి అయిపోయింది. 'హైందవ సమాజం' పేరు మీదనే కాక ఆధునీకరణ, ఆర్థిక సంస్కరణలు, వేగవంతమైన అభివృద్ధి, టెర్రరిజాన్ని ఎదుర్కొనే అవసరం మొదలయిన పేర్ల మీద కూడ కేంద్రీకరణ కాంక్ష వ్యక్తమవుతున్నది. రాజ్యాంగంలో, చట్టాలలో పెద్దగా మార్పులేవీ రాలేదు గానీ నిర్ణయాత్మక స్థానాలలో ఉన్న వారి వైఖరులలో మాత్రం మార్పు బలంగా వచ్చేసింది.

చిన్న పార్టీల ఉనికి అస్థిరతకు దారితీస్తుంది కాబట్టి వాటిని ఎన్నికల చట్టమే నిషేధించాలన్న లా కమిషన్ ప్రతిపాదన ఈ కోవకు చెందినదే.

అది ఇప్పటికింకా ఆచరణలోకి రాకున్నా ఎన్నికల కమిషన్ ఇప్పటకే అనుసరిస్తున్న ప్రమాణాలు పరిమిత ప్రజాశ్రేణుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే పార్టీల ఉనికికి నష్టకరంగా ఉన్నాయనేది ఎన్నికల చిహ్నం విషయంలో ఆ కమిషన్ విధిస్తున్న ఆంక్షలు స్పష్టం చేస్తున్నాయి.

తెలంగాణ వంటి ఒక ప్రాంతాన్ని పక్కన పెట్టండి, కేవలం ఆదివాసుల కోసమో లేదా ఏదో ఒక నోరులేని కులం ప్రజల కోసమో పనిచేసే ఒక పార్టీ ఏర్పడిందనుకోండి. ఆ పార్టీ ఎన్నికల కమిషన్ కోరుకున్నన్ని నియోజకవర్గాలలో పోటీచేయదు. తన వారెక్కడ ఉంటే అక్కడ మాత్రమే చేస్తుంది. ఆ ప్రజల వోట్లు కూడ ఆ పార్టీకి టోకున లభించక పోవచ్చు. అటువంటి పార్టీకి కనీసం దాని గుర్తింపులో భాగం చేసుకోవడానికి ఒక ఎన్నికల చిహ్నం లభించదా? ఒక గుర్రం బొమ్మో, గాడిద బొమ్మో దాని ముఖాన కొట్టడానికి కూడ భారత ప్రజాస్వామ్యానికి సారథ్యం వహించే ఎన్నికల కమిషన్‌కు సాధ్యం కాదా? ఆ ప్రజలప్పుడు మాకీ ప్రజాస్వామ్యమూ అక్కరలేదంటే ఏం చేస్తారు?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*26 జనవరి 2004*



# పార్టీలకూ, అభ్యర్థులకూ ముప్పైఒక్క ప్రశ్నలు



ఎన్నికలను అర్థరహితం చేయడానికి ఏమేం చేయాలో అంతా చేసేసి అన్ని పార్టీలూ కలిసి ఎన్నికలు జరుపుకుందాం రమ్మంటున్నాయి. మీడియా కూడ వారికి సహకరిస్తూ ఏ నాయకుడు ఏ పార్టీ నుంచి ఏ పార్టీకి ఫిరాయిస్తున్నాడన్నదే ప్రధాన వార్తగా వ్యవహరిస్తున్నది. పొత్తులు, ఎత్తులు తప్ప ఎన్నికల గురించి రాయడానికేమీ లేనట్టు ప్రవర్తిస్తున్నది. సత్యం చెప్పడం కార్టూనిస్టుల వంతయింది.

ఎంత తిట్టుకున్నా విసుక్కున్నా ప్రభుత్వాలనూ, ప్రభుత్వ విధానాలనూ నిర్ణయించడంలో ఎన్నికలకొక పాత్ర ఉంది. కాబట్టి తిట్టుకొని కూర్చోవడం తగదు. ఎన్నికల రంగంలో ఉన్న అన్ని పార్టీలనూ, అభ్యర్థులనూ మనం ప్రధానం అనుకునే సమస్యలకు నిర్దిష్టమైన జవాబులు చెప్పమనీ, వాటికి వారి మేనిఫెస్టోలో చోటు కల్పించి ఎన్నికలకు దిగమనీ డిమాండ్ చేయాలి. ఇక్కడ 'నిర్దిష్టం' అనేది అతి ముఖ్యమయిన పదం. ఊరికే వీరికి మేలు చేస్తావా, వారికి మేలు చేస్తావా అంటే చేసేస్తాం అంటారు. మానవహక్కులను కాపాడుతావా అంటే కాపాడేస్తాం అంటారు. వివాదంలో ఉన్న అంశాలపైన నిర్దిష్టమైన జవాబు కోరాలి. ఆ జవాబును బహిరంగంగా ప్రకటించి ఎన్నికలకు దిగమని డిమాండ్ చేయాలి. తెలంగాణ ఉద్యమకారులు ప్రత్యేక తెలంగాణ గురించి మీ వైఖరేమిటో స్పష్టంచేసి ఎన్నికలలోకి దిగమని ఏ విధంగా అయితే అడుగుతున్నారో ఆ విధంగా ఒక్కొక్క ప్రజావర్గం తన సమస్యల గురించి అడగాలి.

మేము మానవహక్కుల కోణం నుండి కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు అభ్యర్థుల ముందు ఉంచదలచుకున్నాం. ఇవి తప్ప మానవహక్కుల గురించి అడగవలసినదేమీ లేవని కాదు. ఇంకా చాలా ఉన్నాయి. కానీ ప్రస్తుతం చర్చలో ఉన్న విషయాలను దృష్టిలో ఉంచుకొని ఒక్కొక్క రంగానికి సంబంధించి ఒకటి రెండు ముఖ్యమైన ప్రశ్నలు పార్టీలనూ, అభ్యర్థులనూ అడగదలచుకున్నాం. సూటిగా జవాబు చెప్పి ఎన్నికలకు దిగమని డిమాండ్ చేస్తున్నాం.

**ఈసారైనా నీళ్ళ సమస్యను పరిష్కరిస్తారా?**

1. కరువు సమస్యకు సాగునీటి కల్పన ప్రధాన పరిష్కారం అని గుర్తిస్తారా? అన్ని ప్రాంతాల రైతులకూ సాగునీటిని ఒకే వెలకు పొందే హక్కు ఉండాలని అంగీకరిస్తారా? ఈ రెండు విషయాలనూ గుర్తించి సాగునీటి కల్పనకు ప్రభుత్వ అభివృద్ధి ప్రణాళికలో మొదటి ప్రాధాన్యం ఇచ్చి, విద్యుదుత్పత్తి, సరఫరా భూగర్భ జలాల పెంపుదల, చెరువుల మరమ్మతు, సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణం తదనుగుణంగా చేపడతారా?

2. రాష్ట్రం వాటాకు వచ్చిన కృష్ణా నదీ జలాలను న్యాయబద్ధంగా పునఃపంపిణీ చేసి, అన్ని అనుమతులూ ఉన్న భీమా ప్రాజెక్టుతో మొదలుపెట్టి తెలంగాణ, రాయలసీమలలోని అన్ని పెండింగ్ ప్రాజెక్టులనూ నిర్దిష్ట కాలంలో పూర్తి చేస్తారా?

3. గోదావరి జలాలపైన తెలంగాణకు మొదటి హక్కుందని గుర్తించాలి. మాటల గారడీలు మానేసి దాని వినియోగానికి సమగ్రమైన ప్రణాళికా రచన చేసి ప్రాజెక్టులను నిర్దిష్ట కాలంలో పూర్తిచేయాలి. చేస్తారా?

4. ప్రాజెక్టుల (అది నీటిపారుదల ప్రాజెక్టుగానీ, విమానాశ్రయంగానీ, భారీ పరిశ్రమ గానీ) వల్ల నిర్వాసితులయ్యే ప్రజల పునరావాసం విషయంలో ప్రస్తుతం అమలులో ఉన్న ద్వంద్వ విధానాన్ని విడనాడాలి. ప్రపంచ బ్యాంకు నిధులు లభిస్తున్న ప్రాజెక్టులలో నిర్వాసితులకు చెప్పుకోదగ్గ మోతాదులో పునరావాసం కల్పిస్తున్నారు కాని ఇతర ప్రాజెక్టుల నిర్వాసితులకు ఏ పునరావాసమూ కల్పించడం లేదు. నిధులు ఎవరిచ్చినా నిర్వాసితుల సమస్యలొక్కటేనని గుర్తించి అందరికీ ఒకే రకమైన – సమగ్రమైన – పునరావాసం కల్పించాలి. దీనికి ఒప్పుకుంటారా?

ఈ రిజర్వేషన్లన్నీ ఇస్తారా?

5. ప్రభుత్వరంగం మాదిరిగానే ప్రైవేట్ రంగంలోనూ ఎస్.సి, ఎస్.టి, బి.సి.లకూ, స్త్రీలకూ విద్యా, ఉద్యోగ రంగాలలో రిజర్వేషన్ కల్పించే చట్టాన్ని చేయాలి. ప్రపంచ బ్యాంకు, బహుళజాతి సంస్థలు కాదన్నా దానిని అమలు చేయాలి. చేస్తారా?

6. చట్ట సభలలో స్త్రీలకు రిజర్వేషన్లు ఇవ్వడానికి అన్ని పార్టీలూ సిద్ధమేనంటూ, రాజ్యాంగ సవరణ మాత్రం జరగనీయకుండా అందరూ కలిసి ఆడుతున్న ప్రహసనాన్ని చూసి ప్రజలు విసిగిపోయారు. ఎన్నికల తరువాత ఆరునెలలు తిరిగే లోపల ఎవరిమీద ఎవరూ నెపం పెట్టి తప్పించుకోకుండా రాజ్యాంగ సవరణ చేస్తారా?

7. రాష్ట్రంలో ఉద్యోగాలలో స్థానికులకు రిజర్వేషన్లు కల్పించే రాజ్యాంగ నియమాలు అమలు కావడం లేదని గుర్తించి వాటిని సక్రమంగా అమలు చేయడం కోసం 1986లో జారీ అయిన జీవో 610 పద్దెనిమిది సంవత్సరాలుగా అమలు కాకుండా ఉంది. దాని అమలు కోసం నియమించిన గిర్‌గ్లాని కమిషన్ సూచనలు కూడ అమలుకు నోచుకోలేదు. అధికారానికి వస్తే ఆరునెలల గడువు లోపల వీటిని సమగ్రంగా అమలు చేస్తామని హామీ ఇస్తారా?

8. వికలాంగులకు అన్ని ఉద్యోగాలలోనూ విద్యా సంస్థలలోనూ మూడు శాతం రిజర్వేషన్ కల్పించాలని చెప్పే చట్టపరమయిన నియమం ఎక్కడా సక్రమంగా అమలు కావడం లేదు. ఆ చట్టం చేసిన 1996 సంవత్సరంతో మొదలుపెట్టి బ్యాక్‌లాగ్‌ను గుర్తించి ఆ రిజర్వేషన్‌ను అమలు చేయాలి. దానిని ప్రైవేట్ రంగానికి కూడ విస్తరింపజేసే చట్ట సవరణ చేపట్టాలి. చేస్తారా?

9. జనాభాలో ముస్లింల వాటాకూ, విద్యా ఉద్యోగ రంగాలలో వారి వాటాకూ మధ్య హస్తిమశకాంతరం ఉంది. విద్యా ఉద్యోగ రంగాలలోనూ, స్థానిక సంస్థల లోనూ ఎస్.సి, ఎస్.టి, బి.సిలకు ఇస్తున్న రిజర్వేషన్లు ముస్లింలకు కూడా ఇవ్వాలి. దీనికి అవసరమైతే రాజ్యాంగాన్ని సవరించాలి. చేస్తారా? అలాగే దళిత బౌద్ధులలాగ దళిత క్రైస్తవులను కూడ ఎస్.సి జాబితాలో చేర్చాలి. దీనికి పార్లమెంటు చట్టం చేయాలి. చేస్తారా?

**పున్నయ్యగారి సూచనల మాటేమిటి?**

10. ఎస్.సి, ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టాన్ని బలహీనపరుస్తూ మన రాష్ట్ర హైకోర్టు, సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులను అధిగమించడానికి జస్టిస్ పున్నయ్య కమిషన్ ముందు హాజరయిన దళిత, ప్రజాతంత్ర సంఘాలు చేసిన సూచనలు ఆ కమిషన్ రికార్డులలో పదిలంగా ఉన్నాయి. వాటిని వెలికితీసి ఆ సూచనల ననుసరించి ఆ చట్టాన్ని సవరించాలి. ఆ పని చేస్తారా?

11. కుటుంబ హింసను నేరంగా ప్రకటించే ఐ.పి.సి సెక్షన్ 498ఎ ని మన రాష్ట్ర అసెంబ్లీ ఈ మధ్యనే సవరించింది. ముద్దాయిలు బాధితురాలిని 'రాజీ'కి ఒప్పించి, నేరం రుజువయినా శిక్షపడకుండా తప్పించుకునే అవకాశం కల్పించింది. ఈ చట్ట సవరణను రద్దుచేసి వెనుకటి స్థితిని పునరుద్ధరించాలి. ఆ పని చేస్తారా? సామాజిక అసమానతల నుంచి పుట్టిన నేరాలను అదుపు చేయడం కోసం రూపొందించిన నేర విచారణ ప్రక్రియలో 'రాజీ'కి చోటు కల్పించడానికి వీలులేదని అంగీకరిస్తారా?

**ఆదివాసుల పొట్టకొట్టబోమని హామీ ఇస్తారా?**

12. రిజర్వ్ అడవులలోని 'చొరబాటు'దార్లందరినీ వెంటనే తొలగించాలంటూ కేంద్ర ప్రభుత్వ అటవీశాఖ 2002 మే నెలలో జారీచేసిన ఆదేశాలను ఆదివాసులు, ఇతర భూమిలేని పేదలపైన అమలు చేయకూడదు. ఆ ఆదేశాలను ఆ మేరకు సవరించాలి. కేంద్ర ప్రభుత్వం సవరించినా, లేకున్నా ఆ ప్రజల పైన దానిని ప్రయోగించబోమని రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి లిఖితపూర్వకంగా తెలపాలి. ఆ పని చేస్తారా?

13. ఏజెన్సీ ఆదివాసుల భూముల బదలాయింపును నిషేధించే 'వన్ ఆఫ్ సెవన్టీ' నియమాలను సక్రమంగా అమలు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం 1998లో పశ్చిమ గోదావరి జిల్లా అధికారుల నుద్దేశించి ఒక సర్క్యులర్ జారీచేసింది. కాని అది ఒకే ఒక్క ఏజెన్సీ గ్రామంలో – అది కూడ కొంతమేరకు మాత్రమే – అమలయింది. దానిని రాష్ట్రమంతటా అన్ని ఏజెన్సీ గ్రామాలలోనూ నిర్దిష్టమైన గడువు లోపల సమగ్రంగా అమలు చేయాలి.

**ఎన్‌కౌంటర్లూ, పోటాలూ ఆపుతారా?**

14. అదుపులోకి తీసుకున్న వ్యక్తిని, ఆదమరచి ఉన్న వ్యక్తిని కాల్చి చంపే 'ఎన్‌కౌంటర్' విధానానికి పూర్తిగా స్వస్తి చెప్తారా? 'విచారణ జరిపి అది బూటకమని రుజువయితే శిక్షిస్తారా' అని మేము అడగడం లేదు. పోలీసుల దుశ్చర్యలకు వ్యతిరేకంగా విచారణలు జరగవు, పోలీసులు జరగనివ్వరు. ఎన్‌కౌంటర్‌లు పాలనా విధానంలో భాగంగా జరుగుతున్నాయన్న వాస్తవాన్ని బహిరంగంగా గుర్తించి, దానికి స్వస్తి చెప్తారా అని అడుగుతున్నాం.

15. పోటా చట్టం దుర్వినియోగాన్ని అరికడతామంటే చాలదు. పూర్తిగా రద్దు చేయాలి. రద్దయ్యేదాకా మన రాష్ట్రంలో దానిని ఎట్టి పరిస్థితిలోనూ ప్రయోగించకూడదు. అవే అవలక్షణాలున్న ఆంధ్రప్రదేశ్ సంఘటిత నేరాల చట్టాన్ని కూడ రద్దు చేయాలి. ఈ పనులు చేస్తారా?

16. అక్రమ నిర్బంధాన్నీ కస్టడీలో చిత్రహింసలనూ నివారించడం కోసం అరెస్టు చేసేటప్పుడూ, ఇంటరాగేషన్ చేసేటప్పుడూ పోలీసులు అనుసరించవలసిన పద్ధతి గురించి సుప్రీంకోర్టు 'డి.కె. బసు' కేసులో 1997లో జారీచేసిన మార్గదర్శక సూత్రాలకు చట్ట రూపం ఇవ్వాలి. ఇస్తారా?

17. పీపుల్స్‌వార్ పైన పెట్టిన నిషేధాన్ని ఎత్తివేస్తారా? ఆ పార్టీని నిషేధించడం కోసం జారీచేసిన ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సెక్యూరిటీస్ చట్టాన్ని రద్దుచేస్తారా? నక్సలిజాన్ని ఒక రాజకీయ ఉద్యమంగా గుర్తించి దానితో రాజకీయంగా వ్యవహరిస్తారా?

**కార్మికులను రోడ్డున పడేయకుండా ఉంటారా?**

18. కార్మికుల హక్కులను బలహీనపరచే ఏ చట్టమూ చేయకూడదు. పార్లమెంటు ఒకవేళ అటువంటి చట్టం చేస్తే దాని నుంచి మన రాష్ట్రాన్ని మినహాయించే చట్టాన్ని రాష్ట్ర అసెంబ్లీ చేయాలి. దానికి రాష్ట్రపతి ఆమోదం పొందడానికి కేంద్రంతో పోరాడాలి. సమ్మతమేనా?

19. స్త్రీ పురుషులకు సమాన పనికి సమాన వేతనం ఇవ్వని ప్రతి యజమానినీ 'సమాన వేతనాల చట్టం' కింద అరెస్టుచేసి శిక్షించాలి. ఆ పని చేస్తారా?

20. ప్రభుత్వరంగ సంస్థలను ఒకటొకటిగా వదిలించుకుంటామనీ, ప్రభుత్వ శాఖలలో ఉద్యోగాలు సాలీనా తగ్గించుకుంటూ పోతామనీ గత ప్రభుత్వం ప్రపంచ బ్యాంకుకు ఇచ్చిన హామీని రద్దుచేసి ఆ విషయాన్ని బహిరంగంగా ప్రకటించాలి. ఆ పని చేస్తారా? ఈ విషయాలలో ప్రజా పాలనావసరాలు, ఉపాధి కల్పన ప్రమాణాలు కావాలి తప్ప వేరే ఏదీ కాదు అని ఒప్పుకుంటారా?

21. ప్రభుత్వం చేపట్టే అభివృద్ధి పనులలో మనుషులను నియమించగల చోట యంత్రాలను నియమించకూడదు. ఉపాధి కల్పన అభివృద్ధి పనుల ప్రధాన లక్ష్యంగా ఉండాలి. ఒప్పుకుంటారా?

22. చేనేత రంగానికి కొంత కనీస భద్రత కల్పించే 1985 నాటి హాండ్లూమ్ రిజర్వేషన్ ఆర్డర్‌ను తు.చ. తప్పకుండా అమలు చేయాలి. ఆధునీకరణ పేరిట చేనేత రంగం గొంతు నులిమివేసే సత్యం కమిటీ సిఫారసులను తిరస్కరించాలి. నూలు ధర, రంగుల ధర చేతి మగ్గాలకు అందుబాట్లో ఉంచాలి. కొనుగోలు మార్కెట్ కల్పించాలి. ఈ పనులు చేస్తారా?

**టూరిజం పేరుతో పేదల్ని తరమకుండా ఉంటారా?**

23. పట్టణాల సుందరీకరణ పేరిట పేదలను పట్టణాల నుంచి బయటకు పంపించ కూడదు. వారు నివసిస్తున్న స్థలాలలోనే వారికి పట్టాలు ఇచ్చి వారి కాలనీలను నివాసయోగ్యం చేయడానికి అవసరమైన అన్ని వసతులూ కల్పించాలి. దీనికి ఒప్పుకుంటారా?

24. టూరిజం పేరిట తీరప్రాంతంలో మత్స్యకారులను, ఏజెన్సీలో ఆదివాసులను వారి ఆవాసాల నుంచి తొలగించకూడదు. వారి పరిసరాలపైన వారికి ఉన్న హక్కులను కుదించకూడదు. ప్రకృతి మీద మొదటి హక్కు దానిని ఆధారం చేసుకొని బతికే ప్రజలదేనని ఒప్పుకోవాలి. ఒప్పుకుంటారా?

**విద్యా వైద్యాలు మీ బాధ్యతని గుర్తిస్తారా?**

25. రాష్ట్ర ప్రభుత్వం వైద్య ఆరోగ్య శాఖ జారీచేసిన జీవో 90ని రద్దుచేయాలి. ప్రజారోగ్య వ్యవస్థ ప్రభుత్వం బాధ్యత అని గుర్తించాలి. దీనికి సిద్ధమేనా?

26. విద్యారంగంలో కట్టలుతెగి ప్రవహిస్తున్న ప్రైవేటీకరణకు అడ్డుకట్టవేసి, అన్ని స్థాయిలలోనూ విద్య ప్రజల హక్కు, ప్రభుత్వం బాధ్యత అని గుర్తిస్తారా?

## విద్యుత్ లోపాలను సవరిస్తారా?

27. విద్యుత్ రంగంలో ప్రైవేట్ విద్యుత్ ఉత్పత్తి సంస్థలతో చేసుకున్న అన్ని కొనుగోలు ఒప్పందాలనూ రద్దుచేయాలి. విద్యుత్తు అందుబాట్లో ఉండడం అతి పేదలకు సహితం ఒక హక్కు అని గుర్తించాలి. ఈ ప్రాతిపదికన విద్యుత్ ఉత్పత్తి, సరఫరా, పంపిణీ వ్యవస్థలను పునర్నిర్మించాలి. ఆ పని చేస్తారా?

## దేవాలయ భూములు పేదలకు ఇప్పిస్తారా?

28. దేవాదాయ చట్టంలోని సెక్షన్ 82 రాజ్యాంగబద్ధమేనని సుప్రీంకోర్టు ప్రకటించిన కారణంగా దాదాపు మూడున్నర లక్షల ఎకరాల భూమి ప్రభుత్వం చేతిలోకి వచ్చింది. అందులో ఒక లక్ష ఎకరాల దాకా ఆ చట్టం ప్రకారమే భూమిలేని పేదలకు దక్కుతుంది. తక్కిన రెండున్నర లక్షల ఎకరాలను కూడ భూమిలేని పేదలకు, అందునా ప్రధానంగా ఎస్.సి, ఎస్.టిలకు చవకగా ఇవ్వాలి. అంతే తప్ప ఆదాయం కోసం బహిరంగ వేలం ద్వారా ధనవంతులకు అమ్మకూడదు. దీనికి ఒప్పుకుంటారా?

29. పారదర్శక పాలన గురించి ఊరికే ఊదరగొట్టడం మానేసి, దానికి సమగ్ర రూపం ఇచ్చే సమాచార హక్కును చట్టబద్ధం చేయాలి. ఇప్పటికే కొన్ని రాష్ట్రాలలో ఉన్న సమాచార హక్కు చట్టాలలోని లోపాలను తొలగించి మన రాష్ట్రంలోనూ చట్టం చేయాలి. ప్రత్యేకించి పట్టణాలలోనయినా, గ్రామాలలోనయినా భూములకు సంబంధించిన సమాచారం ఒక హక్కుగా ప్రజలకు అందుబాట్లో ఉండాలి. ఆ పని చేస్తారా?

## మతద్వేషాన్ని అరికడతారా?

31. మనది చాలా భిన్నత్వం, వైవిధ్యం ఉన్న సమాజమని పాఠ్యపుస్తకాలలో గొప్పలు చెప్పుకుంటూ, ఆచరణలో దానిని ధ్వంసం చేసేవారిని ఉపేక్షించే వైఖరిని మానుకుంటారా? హిందుత్వవాద సంస్థల వీధిరౌడీ చర్యలను అరికడతారా? ఇతర మతస్తులపైన ద్వేషం కక్కడానికీ, హింసను రెచ్చగొట్టడానికీ ఎవరికీ హక్కు లేనట్టే సంఘ్ పరివార్ సంస్థలకు కూడ లేదని గుర్తిస్తారా? అందరిలాగే వారిపైన కూడ చట్టపరంగా చర్యలు తీసుకుంటారా?

*మానవహక్కుల వేదిక కరపత్రంగా వచ్చింది*
*20 ఫిబ్రవరి 2004*

# కొంతమంది ఓడిపోవడం అవసరం



పట్టించుకోవటం వృథా అనుకుంటూ కూడ పట్టించుకోక తప్పని ప్రక్రియలలో ఎన్నిక లొకటి. ఈసారి అసెంబ్లీ అభ్యర్థుల ఎన్నికల ఖర్చు కోటి రూపాయలు తగ్గే ప్రసక్తి లేదని అందరూ అంటున్నారు. చంద్రబాబయితే మిగిలిన ఖర్చంతా పోను పోలింగ్ రోజున వోటుకు వెయ్యి రూపాయలు ఇవ్వబోతున్నాడని కూడ వినికిడి. మనది ఇప్పటికింకా విశ్వాసం గల జాతే కాబట్టి తీసుకున్నాక వేయకపోరని అతని ధీమా కాబోలు.

అటువంటి ఎన్నికల గురించి ఆలోచించడం ఎందుకు అంటే, అటువంటి ఎన్నికలే మన పాలకుల్ని నిర్ణయిస్తున్నాయి మరి. ఆలోచించక ఏం చేయాలి? రెండవది, ఎన్నికలు డబ్బు చుట్టూ తిరుగుతున్నాయనేది ఎంత వాస్తవమైనా, గెలుపును నోట్లే తప్పనిసరిగా నిర్ణయిస్తాయన్న గ్యారంటీ ఏమీ లేదు. నిజానికి రాబోయే ఎన్నికలే ఈ నమ్మకానికొక పరీక్ష కావచ్చు. తెలుగుదేశం పార్టీ విపరీతంగా ఖర్చు పెట్టబోతున్నదనేది అందరూ ఎరిగిన విషయమే. ప్రపంచ బ్యాంకు ఏ ఖాతాకూ చెందని 'అప్పు' అందుకోసమే చంద్రబాబుకు ఇచ్చిందని కూడ వినికిడి. కాంగ్రెస్ దగ్గర, తెలంగాణ రాష్ట్ర సమితి దగ్గర కూడ పైసలు లేకపోలేదు. ఖర్చు విషయంలో వాళ్ళేమీ మడిగట్టుకొని కూర్చోలేదు. అయితే ప్రస్తుత పరిస్థితులలో వారు చంద్రబాబుకు ఈ విషయంలో పోటీకి రాలేరు. అయినప్పటికీ తెలుగుదేశం పార్టీ ఓడిపోయే సూచనలు బలంగానే కనిపిస్తున్నాయి. మూడవది, ఎన్నికల వ్యవస్థను పట్టించుకుంటేనే అది రేపెప్పుడయినా బాగుపడుతుంది.

కారణం ఏమయితేనేం, మామూలుగా ఎన్నికల పేరు చెబితేనే ఈసడించుకునే వారితో మొదలుపెట్టి సమాజాన్ని గురించి కనీస స్పృహ ఉన్నవాళ్ళందరూ ఈసారి ఎన్నికలను సీరియస్‌గా తీసుకుంటున్నారు. ఎప్పటికప్పుడు మన అతిశయం కొద్దీ 'చరిత్ర ఒక కీలకమైన మలుపు వద్ద ఉంది' అని అంటూంటాం గానీ, నేడు నిజంగానే అటువంటి మలుపు వద్ద ఉందన్న భావనే ఈ ఆసక్తికీ, చొరవకూ కారణం కావచ్చు.

రాష్ట్రంలో చంద్రబాబు గెలుపు, కేంద్రంలో భారతీయ జనతాపార్టీ గెలుపు వర్గ సిద్ధాంతాన్నీ వర్ణ సిద్ధాంతాన్నీ అపహాస్యం చేస్తాయన్న అనుమానం అన్ని రకాల అభ్యుదయవాదులనూ పీడిస్తున్నదనుకుంటాను. పేదలకు నూరుపాళ్ళు వ్యతిరేకమైన విధానాలను ప్రకటించి అమలుచేసే పార్టీ ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, మూడుసార్లు గెలవడమా! బ్రాహ్మణీయ ధర్మాన్ని మోసే పార్టీ గెలుచుకుంటూ పోవడమా! ఎక్కడో ఏదో పెద్ద లోపమే ఉంది.

ఆ లోపం ఎక్కడుందన్న విశ్లేషణ నేను ప్రస్తుతం చేయబోవడం లేదు. అయితే మరొక్కసారి ఈ ప్రజావ్యతిరేక శక్తులు గెలవడం జరిగితే అది చరిత్రలో పెద్దమలుపే అవుతుంది. కాంగ్రెస్ వీరి కంటే ఏ విషయంలో మెరుగయినది అని అడగొద్దు. కాంగ్రెస్ అమీబా వంటిది. దాని స్వరూపం ఫలానా అని చెప్పలేం. అయితే ఇక్కడ సమస్య రేపు రాష్ట్రంలోనూ దేశంలోనూ కాంగ్రెస్ గెలిస్తే ఏమైనా మార్పు వస్తుందా లేక ఇప్పుడున్నట్టు ఉంటుందా అనేది కాదు. ప్రజావ్యతిరేక విధానాలను ప్రకటించి అమలు చేసే వాళ్ళకు వోటు ద్వారా బుద్ధిచెప్పే రాజకీయ పరిణతిని సమాజం ప్రకటించడం అవసరం. ఆ వోట్లలో ఎన్ని నోటుకూ సారాయికీ అమ్ముడు పోతున్నప్పటికీ ప్రజా వ్యతిరేక విధానాలను వ్యతిరేకించే పరిణతి సమాజంలో ఉందన్న సందేశం రాజకీయ పార్టీలకు అందటం దానంతటదే ఒక మేలు. ఆ సందేశం అందకపోయినట్టయితే, ప్రజావ్యతిరేకతను ప్రకటించుకొని అమలు చేయడంలో అవివేకత ఏమీ లేదన్న ధీమా రాజకీయ పార్టీలలో పెరిగిపోతుంది. యాభై ఏళ్ళుగా అది అవివేకం అనుకుంటూ వస్తున్నారు భారతదేశంలోని రాజకీయవేత్తలంతా. అది అవివేకం కాదని సమాజం చెప్పేస్తే చాలా నష్టం జరిగిపోతుంది. ఆ అర్థంలోనే దేశ రాజకీయాలు ఈరోజు మలుపు దగ్గర నిలబడ్డాయి.

దేశంలోనే కాదు, అంతర్జాతీయంగా కూడ ఒక తప్పుడు సంకేతం పంపించే ప్రమాదం నుండి చరిత్రను మనం తప్పించవలసిన అవసరం ఉంది. 'నయా ఉదార వాదం' అనే మూర్ఖమైన పెట్టుబడిదారీ సామాజిక ఆర్థిక నీతికీ, రాజకీయ ఉదారవాదానికీ చుక్కెదురు అన్న అభిప్రాయం దక్షిణ, మధ్య అమెరికా దేశాల అనుభవం నుండి బలం పొందింది. పూర్తిగా వామపక్షవాదులు కానివారు సైతం ప్రపంచబ్యాంకు, ఐ.ఎం.ఎఫ్‌ల నీతిని ఈ వాదనతోనే ఎదుర్కుంటున్నారు. ఈ సంస్థలు ప్రతిపాదించే నమూనాలో ఆర్థిక సంస్కరణలు చేపట్టిన అనేక సమాజాలలో రాజకీయ ప్రజాస్వామ్యం, భావ ప్రకటనా స్వేచ్ఛ, చట్టబద్ధ పాలన ఇత్యాది విలువలు, వ్యవస్థలు త్వరలోనే భూస్థాపితం అయ్యాయి. నియంతృత్వ పోకడలు బలపడ్డాయి. అందుకే ప్రపంచబ్యాంకు మార్కు ఆర్థిక సంస్కరణలను వ్యతిరేకించే విషయంలో రాజకీయ ఉదారవాదులు, ప్రజాస్వామ్యవాదులు అంత పట్టుదలగా ఉన్నారు.

ఎన్నికలు సజావుగా జరుపుకుంటూ, పత్రికలను స్వేచ్ఛగా రాయనిస్తూ, ప్రజలకు కూడ ఎప్పుడూ కాకపోయినా అప్పుడప్పుడయినా రాజకీయ భావప్రకటనా స్వేచ్ఛను అనుభవించే అవకాశాన్నిస్తూ కూడ 'సంస్కరణలను' అమలు చేసేయవచ్చునని మనం రుజువు చేసేస్తే, 'సంస్కరణలను వ్యతిరేకించే ఒక బలమైన వాదనను' అబద్ధం చేసిన వారమవుతాము. అది అబద్ధమైతే ఆ విషయం రుజువు కావడంలో తప్పేముంది అంటారేమో. అది అబద్ధం కాదు. అనేక దేశాల అనుభవమే కాక సాధారణ తర్కం కూడ ఈ విషయాన్ని రుజువు చేస్తుంది. డబ్బు కారణంగానో సారాయి ప్యాకెట్ల కారణంగానో ఊదరగొట్టే ప్రచారం కారణంగానో మీడియా మేనేజ్‌మెంట్ కారణంగానో అబద్ధం కానిది అబద్ధమని రుజువు కావటం అవాంఛనీయం.

సంఘ్‌పరివార్ అమానుషత్వం కొంతకాలం కొంతమందికి ఆమోదనీయంగా కనిపించడమే కాదు, దీర్ఘకాలం సగటు మనుషులకు అనభ్యంతరంగా కనిపిస్తుందనీ, కనిపించగలదనీ నమ్మాలంటే మానవత మీద విశ్వాసాన్నే వదులుకోవాలి. దీనికి సహితం సిద్ధపడవలసిందేనా? ఆ మలుపు దగ్గర కూడ మనం ఉన్నాం. గుజరాత్‌తోనే ఆ విషయం స్పష్టం అయింది. అంతటి మారణకాండ తరువాత కూడ సగటు గుజరాతీలు పెద్దెత్తున వోట్లు వేసి నరేంద్రమోడి ప్రభుత్వాన్ని తిరిగి గెలిపించారు. ఆ గెలుపుకు భుజాలు చరచుకుంటూ 'గుజరాత్ ప్రయోగాన్ని' దేశమంతటా అమలు

చేస్తాం అంటూ భారతీయ జనతాపార్టీ నాయకులు నిర్లజ్జగా ప్రకటించారు. దానిని దేశమంతటా అమలుచేయడం అంటే అర్థం ముస్లింలను పెద్దఎత్తున చంపడమే కానక్కర లేదు. మైనారిటీలను ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచి దేశాన్ని పాలించడం, ఎప్పుడయినా ఏ కారణంగానయినా తమ మీద కోపం వస్తే మూకుమ్మడిగా చంపుతారు అన్న భయంలో మైనారిటీలను ఉంచి పరిపాలించటం. ఆ విషయం ప్రకటించి మరీ వాళ్ళు ఎన్నికలలో గెలవగలిగితే సగటు మనుషుల మానవత గురించే మనకు సందేహం రావలసి ఉంటుంది. ఇండియా వెలిగిపోతున్నది అన్న అర్థరహితమైన నినాదపు ఆచ్ఛాదన వెనుక ఈ అమానుషత్వాన్నంతా దాచడం సాధ్యం అని రుజువయినట్టయితే సగటు మనుషుల వివేచనపై కూడ విశ్వాసం కోల్పోవలసి ఉంటుంది. ఈ స్థితి రావడమూ అవాంఛనీయమే.

అందుకే ఎవరు గెలిచినా ఒకటేనని ఎప్పటిలాగే అనుకున్నా, కొంతమంది ఓడిపోవడం అవసరం అనే స్పృహతో ఈ ఎన్నికలను ప్రగతిశీల శక్తులంతా సీరియస్‌గా తీసుకుంటున్నారు. అది రైటే.

*ఉద్యమం మాసపత్రిక*
*జనవరి – మార్చి 2004*



# ప్రజలకు తెలియని ప్రజాభిప్రాయం!



'ఒపీనియన్ పోల్స్'ను నిషేధించడం రాజ్యాంగ విరుద్ధం అవుతుందన్న సోలీ సొరాబ్జీ అభిప్రాయం సరైనదే. కానీ దాని అర్థం పత్రికలు, ఇతర ప్రసార సాధనాలు ఈ విషయంలో కొంత స్వయం నియంత్రణ పాటించకూడదని కాదు.

సత్యాన్ని తెలుసుకుంటే తప్పేముంది అనవచ్చు. ఒకటి, ఒపీనియన్ పోల్స్ రేపు జరగబోయే సత్యాన్ని ముందే చెప్తాయా లేక ఆ సత్యాన్ని రూపకల్పన చేసే ఒక శక్తిగా పనిచేస్తాయా అంటే రెండూ నిజాలేననీ, ఒక్కొక్కసారి మొదటిదాని కంటే రెండవది ఎక్కువ నిజం కాగలదని చెప్పకతప్పదు. రెండు, రోజుకొకటి చొప్పున పత్రికలలో ప్రచురిస్తున్న ఒపీనియన్ పోల్స్‌లోని శాస్త్రీయత ఎంత అంటే సందేహమే. సరైన పద్ధతిలో జరపకపోతే అది వాస్తవాన్ని ప్రతిఫలించేది కాక కల్పనను వాస్తవంగా చలామణి చేసే ప్రక్రియ కాగలదు.

మూడు, ఎన్నికలలో ఎవరు గెలవబోతారన్న కుతూహలం ఉండడం సహజమే అయినప్పటికీ ఎన్నిక రెండు పార్టీల మధ్యనో మూడు పార్టీల మధ్యనో పందెం కాదు. అది ప్రజలు తమ ప్రతినిధులను ఎంపిక చేసుకునే ప్రక్రియ. దానిని గుర్రప్పందెంతో సమానం చేసే వికృతమైన ప్రయత్నం రాజకీయపార్టీలు, విశ్లేషకులు చేస్తూనే ఉన్నారు. 'ఒపీనియల్ పోల్స్' దాని పరాకాష్ఠ.

నిజానికి ఎన్నికల నేపథ్యంలో అసలు విషయాల చర్చ స్థానాన్ని ఎన్ని కృత్రిమ విషయాలు ఆక్రమించుకుంటున్నాయో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఫిరాయింపులు,

పునరాగమనాలు, సినిమాతారల ప్రవేశ నిష్క్రమణలు, తిట్లు, శాపనార్థాలు, ఓట్ల సమీకరణ ఎత్తుగడలు – వీటి మధ్య అసలు ఎన్నికలు ఎందుకోసం జరుపుకుంటున్నామన్న విషయం అందరూ మరచిపోయినట్టున్నాము. ఎవరు గెలవబోతారన్న ఎగ్జయిట్‌మెంట్ (ఉత్కంఠ)ను పెంచే ఒపీనియల్ పోల్స్ ఈ మరపును స్థిరీకరిస్తాయి.

నాలుగు, ప్రజాభిప్రాయ సేకరణ మన మనోభీష్టానికి అనుగుణంగా చేయడం మనకే తెలియకుండా జరిగిపోతుంటుంది. దేశంలో భారతీయ జనతాపార్టీ పట్ల అనుకూలత ఎంత ఉన్నదో ఏమోగానీ మీడియాలో మెండుగా ఉంది. ఆ పార్టీని ఏ మాత్రం ఇబ్బంది పెట్టకుండా వారి వ్యూహాలను, ఎత్తుగడలను వ్యాఖ్యానించడం ప్రసార సాధనాలు బాగా అలవరచుకున్నాయి. రోజూ పత్రికలలోనూ, టీవీ ఛానల్స్ లోనూ బిజెపి గురించి మనకు లభిస్తున్న చిత్రంలో ఎక్కడయినా ఏ మూలనయినా అది రెండంటే రెండేళ్ళ క్రితం గుజరాత్‌లో ఘోరమైన మారణకాండకు పాల్పడిన పార్టీ అన్న జ్ఞాపకానికి చోటుందా? నక్సలైట్ల గురించి ఇవే పత్రికలు ఎప్పుడయినా కొంచెం మంచిగా రాసినా ఒక్క క్షణం కూడ వారు హింసామార్గాన్ని ఎంచుకున్నారన్న విషయం మనల్ని మరచిపోనివ్వవు. కానీ బిజెపి విషయంలో మీడియాయే ఆ విషయాన్ని మరచిపోయింది. ప్రవీణ్ తొగాడియా, నరేంద్రమోడి ఎప్పటికప్పుడు జ్ఞాపకం చేస్తూనే ఉన్నా సంకల్ప పూర్వకంగా ఆ జ్ఞాపకాన్ని పత్రికారంగం తన మెదడు నుండి తొలగించి వేసింది. ప్రజాభిప్రాయ సేకరణ కోసం వారు అడిగే ప్రశ్నల మీద ఈ మరపు ప్రభావం లేదంటే నమ్మడం కష్టం. బిజెపి గురించి అడిగే ప్రతి ప్రశ్నకూ ఉపోద్ఘాతంగా 2002లో ఆ పార్టీ నాయకులు భారతదేశ చరిత్రలో కనీవినీ ఎరుగని మారణకాండ జరిపించారన్న విషయాన్ని జ్ఞాపకం చేస్తూ అడిగినట్టయితే జవాబులు – రేపు వేయబోయే ఓట్లు – కొంచెం భిన్నంగా ఉండవంటే నమ్మడం కష్టం.

ప్రపంచీకరణ విషయమూ అంతే. ప్రసార సాధనాలు చాలావరకు ఈ సంస్కరణలకు అనుకూలమే. అందుకే చంద్రబాబునాయుడు మీడియాలో అంత అందంగా కనిపిస్తాడు. అతను 'ఏదో చేస్తున్నాడు' అనే అభిప్రాయానికి అందుకే అంత ప్రాచుర్యం లభించింది.

ఇదంతా ప్రసార సాధనాలు నిర్వహించే ప్రజాభిప్రాయ సేకరణపైన ప్రభావం చూపగలదు. తిరిగి ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేయనూగలదు. ఒపీనియన్ పోల్స్

వట్టి బూటకమనీ వాటిని నిర్వహించేవారి కోరికల వ్యక్తీకరణే తప్ప వేరే ఏమీ కాదనీ నేననడం లేదు. ప్రస్తుతం దేశంలో ఎన్‌డిఏకే ఎక్కువ మద్దతు ఉందన్న అభిప్రాయం ఏదో ఒక అర్థంలో నిజమనే అనుకుందాం. ఆ నిజం దానిని సేకరించేవారికి నచ్చే నిజం కాబట్టి ఒకరి తరువాత ఒకరు దానిని వెలికితీసి ప్రకటిస్తుంటే ఇంక అది నిజం కాకుండాపోయే అవకాశం ఏమైనా ఉందా? ప్రత్యామ్నాయాలు బేజారయి పోకుండా ఉండే అవకాశం ఉందా? ప్రజాభిప్రాయం అనేది ముందే ఒక రూపం తీసుకొని ఉందని అనుకున్నా దానిని స్థిరీకరించి అదే వివేకం అన్న అభిప్రాయాన్ని ప్రచారం చేసే ప్రక్రియ తన గురించి తాను కేవలం 'సైంటిఫిక్'గా ఉన్నదున్నట్టు చెప్తున్నానని చెప్పుకుంటే ఆమోదించవలసిందేనా?

ఎన్నికలకు నెలరోజుల ముందు ప్రజాభిప్రాయం ఒక రూపం తీసుకొని ఉందనుకున్నా, దానిని ఒకటికి పదిసార్లు తెలియచెప్పే స్వేచ్ఛకు ఉన్న విలువ ఆ రూపాన్ని మార్చడానికి జరగగల కృషికి కూడ ఉండాలి కదా? మొదటిది రెండవ దానికి ఆటంకమైనట్టయితే అది తటస్థమైన విషయ సేకరణ కాదు. పరిశోధన కాదు. అది కూడ ఒక రాజకీయమే అవుతుంది.

ప్రసార సాధనాలు రాజకీయాలకు అతీతంగా ఉండలేవు గానీ అవి ఈ అర్థంలో రాజకీయం చేయడం వాంఛనీయమా అన్నది కొంచెం ఆలోచించుకోగలిగితే బాగుంటుంది.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*20 ఏప్రిల్ 2004*



# మూడవ ప్రత్యామ్నాయం



ప్రతి ఎన్నికలోనూ ప్రజలు అధికారంలో ఉన్నవారిని దించి ప్రతిపక్షంలో ఉన్నవారిని గద్దె ఎక్కిస్తారనీ, అయిదేళ్ళ తరువాత మళ్ళీ అదే జరుగుతుంది కాబట్టి ఈరోజు కుర్చీ దిగిన వాళ్ళు అప్పుడు మళ్ళీ ఎక్కుతారనీ ఇప్పుడు స్థూలంగా అర్థం అవుతున్నది.

ఇది స్థూలంగా సత్యమే. మొత్తంమీద మంచిదే. అధికారంలో ఉన్నవారు మరీ పొగరుబట్టి ప్రవర్తించకుండా ఇది కాపాడుతుంది.

అయితే ఈ రోజు అధికారం పోగొట్టుకునే వారే రేపు పొందబోయేవారు. ఈ రోజు పొందినవారే రేపు పోగొట్టుకోబోయేవారు. వీరిద్దరూ (రెండు పార్టీలు, లేక కూటములు) తప్ప వేరే ఎవరూ అధికారానికి రాలేరా? వేరే ఎవ్వరూ పాలనాధికారాన్ని చేజిక్కించుకోలేరా? మనం గెలిపిస్తూ, ఓడిస్తూ, మళ్ళీ గెలిపిస్తూ ఉన్న పార్టీలు లేక కూటముల మధ్య తేడా స్వల్పం అయినప్పుడు నిజంగా తేడా ఉన్నవారు అధికారానికి రాలేకనే పోతే మన వోటు హక్కుకు ఉన్న విలువ ఏమిటి?

ఇక్కడ తేడా అంటే అర్థం పాలనా విధానాలలో భేదమని మాత్రమే కాదు. అవినీతిలోనూ, అడ్డదార్లు తొక్కి డబ్బు సంపాదించే గుణంలోనూ, అధికార దుర్వినియోగంలోనూ, అసాంఘిక వ్యవహారాలలో భాగస్వాములు కావడానికి సిగ్గుపడక పోవడంలోనూ కూడ వీరి మధ్య పెద్దగా తేడాలు లేవు. ఇంకా విధానాలలో కొన్ని నిజమైన తేడాలుండవచ్చు. ఉదాహరణకు కాంగ్రెస్ పార్టీ మతతత్వవాదులతో ఎన్ని రకాలుగా రాజీపడినప్పటికీ ఒక విధానంగా మైనారిటీల పైన దాడులు ఎన్నడూ చేయలేదు. బహుశా చేయదు. అట్లాగే ఉత్తర భారతదేశంలోని దళితవాద పార్టీలు

తమలో తాము కలహించుకొని తమ భూమిక అయిన సామాజిక వర్గాలకు చాలా నష్టం చేస్తుండవచ్చును గానీ సామాజిక ఆర్థిక రంగాలలో దళిత బహుజన ప్రజానీకం పక్షం వహించే విధాన నిర్ణయాన్ని వదులుకోలేదు.

అయితే రాజకీయ విలువల విషయంలో వీరెవ్వరి మధ్య చెప్పుకోదగ్గ తేడా ఏదీ లేదు. దానివల్ల అనేక సందర్భాలలో తమ ప్రకటిత సిద్ధాంతాల విషయంలో రాజీపడడానికి కూడ ఏ పార్టీ సంశయించడం లేదు.

విధానాలలో ప్రజానుకూలత, విలువలలో స్వచ్ఛత ఉన్న రాజకీయ ప్రత్యామ్నాయం ముందుకు రాకపోవడానికి ప్రస్తుత ఎన్నికల వ్యవస్థలో అటువంటి 'మూడవ ప్రత్యామ్నాయానికి' అవకాశం లేకపోవడమే కారణమా? కాదనాలని మనకెంత గాఢంగా అనిపించినా అవుననడానికి అనేక కారణాలున్నాయి.

ఖర్చు ఒక ముఖ్యమైన కారణం. మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో ప్రధాన రాజకీయ పక్షాలు ప్రతి సీటుకూ 1 కోటి రూపాయలకు తక్కువ కాకుండా ఖర్చుబెట్టాయని అందరికీ తెలుసు. అంత ఖర్చుపెట్టడం విలువలకు ఉచిత స్థానం ఇచ్చే వ్యక్తికి గానీ పార్టీకి గానీ సాధ్యం కాదు. అంత పెద్దమొత్తం కాదు సరికదా అందులో పదవ వంతు ఖర్చు పెట్టడం కూడ సాధ్యం కాదు. అయినప్పటికీ పెద్ద మొత్తాలు ఖర్చు పెట్టకుండానే గెలుస్తున్న అభ్యర్థులు లేరా అంటే కొన్ని ప్రత్యేక పరిస్థితులు, ప్రత్యేక చరిత్ర ఉన్న నియోజకవర్గాలలో మాత్రమే అది సాధ్యం అవుతున్నది.

రెండవది, మనుషులకుండే అనేక రకాల బలహీనతలను ఎన్నికలలో గెలుపు కోసం వాడుకోవడం. డబ్బు, సారాయి పంచడం మాత్రమే కాదు. అభద్రతా భావం నుండి వ్యక్తి ఆరాధన దాకా అనేక మానవ సహజమైన గుణాలనూ పోకడలనూ ఎన్నికల ప్రయోజనాల కోసం నిస్సిగ్గుగా పార్టీలు వాడుకుంటుంటాయి. మత విద్వేషాలను భారతీయ జనతాపార్టీ నేర్పుగా వాడుకున్న వైనం తెలిసినదే. మనుషులలో బలహీనతలున్నట్టే మంచి కూడ ఉంది కాబట్టి దాని బదులు దీనిని వాడుకోవటం – అంటే మనిషిలోని మంచిని మేల్కొల్పడం – సాధ్యం కాదా అంటే అసలే సాధ్యం కాదనే నిరాశావాదానికి లోనుకానవసరం లేదు గానీ అది అనుకున్నంత సులభం మాత్రం కాదు. ముఖ్యంగా, అభద్రత బలంగా ఉన్న పరిస్థితులలో మనిషిలోని శక్తిని మేల్కొలిపి అభద్రతను అధిగమించే ప్రయత్నం చేసే కంటే మనిషిలోని చెడును రెచ్చగొట్టి

ప్రయోజనం పొందే ప్రయత్నాలే సులభంగా విజయవంతం అవుతుంటాయి. సాధారణ పరిస్థితులలో సహితం 'సింబల్స్'కు ఉన్న బలం వివేచన కంటే తక్కువేమీ కాదు. నష్టకరమైన, విధ్వంసకరమైన 'సింబల్స్'ను, సత్యానికి అందమైన ముసుగు వేసే 'సింబల్స్'ను రాజకీయ పక్షాలు నేర్పుగా వాడుకుంటుంటాయి. ఒక్కొక్కసారి విధ్వంసకరమైన 'సింబల్స్'కు వివేచన కన్నా ప్రత్యామ్నాయ సింబల్సే ఫలవంతమైన జవాబు అవుతాయి. అంటే విధ్వంసకరమైన రాజకీయాలపైన వివేచనాత్మకమైన రాజకీయాల కంటే ప్రజానుకూలమైన మార్మికతే సులభంగా గెలిచే పరిస్థితులుంటాయి. బీహార్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో ఒక దశాబ్ద కాలంగా బ్రాహ్మణీయ రాజకీయాలపైన దళిత రాజకీయాలు నెలకొల్పి ఉన్న ఆధిక్యత ఈ కోవకు చెందినదే. దళిత బహుజన పార్టీలు ఉపాధి, జీవనం, విద్య మొదలయిన విషయాలలో తాము పరిపాలించిన కొన్ని సంవత్సరాలలో దళిత ప్రజానీకానికి చేసింది చాలా తక్కువ అయినప్పటికీ అగ్రకుల అహంకారాన్ని ముఖంమీద చెప్పుతో కొట్టిన సామాజిక తిరుగుబాటుకు 'సింబల్స్'గా వాళ్ళు ప్రజల మద్దతు ఎన్నికలలో పొందుతూనే ఉన్నారు. అక్కడ ప్రత్యామ్నాయమంటే అర్థం ప్రజల భౌతిక జీవితానికి నిజంగా మేలుచేస్తూ బ్రాహ్మణవాదాన్ని ఎదుర్కొనడం.

మూడవది, ఒక నియోజకవర్గంలో 'ప్రజలు' అనేవారు భిన్నమైన అవసరాలు, ప్రయోజనాలు కలిగి ఉంటారు. వారి మధ్యనున్న వైరుధ్యాలను వివేచనాత్మకంగా పరిష్కరించి అందరినీ మెప్పించే ప్రయత్నం కంటే అందరికీ అన్నీ అయినట్టు కనిపిస్తూ ఏమీ చేయకుండ కాలక్షేపం చేసే రాజకీయ చతురతే తరచుగా నెగ్గుతున్నది. నిజంగా వైరుధ్యాలను పరిష్కరించే ప్రయత్నం ఒక్కొక్కసారి అందరికీ కంటగింపయ్యే ప్రమాదం ఉంది. అందువల్లనే ప్రగతిశీల స్వభావంగల పార్టీలు సహితం ఎన్నికల అవసరాల రీత్యా ఇటువంటి సమస్యలను దాటవేసి, మార్మిక స్వభావంగల సింబల్స్‌ను ఆశ్రయించడం (ఎర్రరంగు, సుత్తీకొడవలి కూడ ఆ పాత్ర పోషించగలవు) కద్దు. ఏ ప్రయోజనాలను సమాజానికి అనవసరమయివనీ, హానికరమయినవనీ ప్రకటించాలో, ఇతర ప్రయోజనాలలో ఏవి అవసరమని తేల్చి చెప్పాలో సహేతుకంగా నిర్ణయించి మెజారిటీ వోట్లు పొందడం అంత సులభం కాదు.

మనం మొదట్లో వేసుకున్న ప్రశ్నకు 'అవును' అని జవాబు చెప్పడానికి ఇంకా కారణాలు వెతకవచ్చును గానీ ఇవి చాలును. అయితే ఆ ప్రశ్నను 'ప్రస్తుత ఎన్నికల వ్యవస్థలో' అంటూ మొదలుపెట్టడంలో ఒక అసహజమైన సౌలభ్యం ఉంది. వేరే ఏదో రాజకీయ వ్యవస్థలో ప్రజానుకూల రాజకీయాలు చేపట్టడం సులభంగా ఉంటుందనే ఆత్మవంచనకు అది దారితీస్తుంది. ప్రస్తుత ఎన్నికల వ్యవస్థను అనేక రకాలుగా సంస్కరించి ప్రజలకూ ప్రజాభీష్టానికీ మరింత దగ్గరగా తెచ్చే అవకాశం ఉన్నమాట వాస్తవం. స్థానిక సంస్థల అధికారాలు బాగా పెంచి అధికార పీఠాన్ని కిందికి లాగవచ్చు. ప్రాదేశిక నియోజకవర్గాల స్థానంలో వృత్తి నియోజకవర్గాల వంటివి ప్రవేశపెట్టి ప్రాతినిధ్యానికి మరింత అర్థం కల్పించవచ్చు. అదే లక్ష్యంతో అభ్యర్థులందరినీ తిరస్కరించే అవకాశం వోటర్లకు కల్పించవచ్చు. ఇంకా చాలా పనులు చేయవచ్చు. అయితే ఎన్ని చేసినా, మెజారిటీ ప్రజలు రహస్య వోటింగ్ ద్వారా స్వచ్ఛందంగా ఎంపిక చేసినవారే సమాజాన్ని ఏలే అర్హత కలిగి ఉంటారన్న ప్రజాస్వామిక సూత్రాన్ని అనుసరించినంత కాలం పైన పేర్కొన్న సమస్యలన్నీ ఏవో ఒక పరిమాణంలో ఉండనే ఉంటాయి. 'ప్రస్తుత ఎన్నికల వ్యవస్థలో' మాత్రమే కాదు. ప్రజామోదానికి వస్తుగత ప్రమాణమేదీ లేకుండా తుపాకులు చేతబట్టి రాజ్యాధికారాన్ని చలాయించడం సబబే అనుకుంటే మాత్రమే సమస్యలను తప్పించుకోగలుగుతాం. (అప్పుడు వేరే సమస్యలు ఉంటాయనుకోండి అది వేరే సంగతి.)

కాబట్టి ఈ సమస్యల బరువును తగ్గించే సంస్కరణలను ఆహ్వానిస్తూ కూడ ఇవి ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థలో ఏదో ఒక మోతాదులో ఉండేవేనని గుర్తించి 'మూడవ ప్రత్యామ్నాయం' కోసం కృషి చేయడమే ఉత్తమం. అయితే ఎన్నికల రంగంలోకి దిగే ముందు ప్రజల సమస్యలపైనా, ప్రజల మధ్యా విస్తృతంగా పనిచేసి వివేచనాత్మకమైన ప్రజాతంత్ర రాజకీయాలకు ప్రజా చైతన్యంలో గుర్తింపు సాధించాలి. ఆ పని చేసిన చోట మాత్రమే ఎన్నికల రంగంలోకి దిగాలి.

అటువంటి రాజకీయ శక్తి అధికారంలోకి రావాలంటే ఒకే పేరు, ఒకే గుర్తింపు ఉన్న రాజకీయ శక్తిగా విస్తృత ప్రాతిపదికన పనిచేయవలసి ఉంటుంది. బహుశా, పైన పేర్కొన్న అన్ని సమస్యల కంటే ఇదే ఈ రోజు మూడవ రాజకీయ ప్రత్యామ్నాయానికి బలమైన అవరోధం. అన్ని సమస్యలను అర్థం చేసుకోగల ఒకే ఒక సిద్ధాంతం,

అన్నిటినీ పరిష్కరించగల ఒకే ఒక రాజకీయ ఉద్యమం ఉండగలవన్న అవాస్తవిక తాత్విక దృక్పథం నుంచి అభ్యుదయ రాజకీయాలు బయటపడడం మంచిదే అయింది. భిన్న దృక్పథాలతో, భిన్న ఉద్యమాలు ముందుకు రావడమూ మంచిదే అయింది. అయితే ఎక్కడో ఒకచోట ఏదో ఒక నమూనాలో అభ్యుదయ రాజకీయాలు పునరేకీకరణ కాకున్నా ఒక సమగ్ర సంఘీభావ రూపాన్ని పొందవలసి ఉంది. ఆ దశ దగ్గరకు రాకపోగా మరింత దూరం అవుతున్నది. ఎవరి దుకాణం వాళ్ళు పెట్టుకొని ఏదో ఒక పద్ధతిలో కాలక్షేపం చేసే ఎన్జీవో సంస్కృతి ప్రాచుర్యం పొందడం ఈ అవాంఛనీయ స్థితిని స్థిరీకరించే దిశగా అభ్యుదయ రాజకీయాలను నడిపిస్తున్నది.

ఎన్నికల రాజకీయాలు మనుషులలో ఉండే కొన్ని బలహీనతలను వాడుకున్నట్టే 'నా కోడి కూస్తేనే తెల్లవారుతుంది' అని నమ్మే స్థితిని చేరుకున్న ప్రగతిశీల రాజకీయ శకలాలు మానవ సహజమైన వేరే బలహీనతల్ని ఆసరా చేసుకున్నాయి. వ్యక్తిగత గుర్తింపు కాంక్ష, మరొకరితో కలిసి పనిచేయలేని అహంభావం, భిన్నత్వం పట్ల అసహనం మొదలయిన గుణాలు ఈ రోజు ప్రగతిశీల రాజకీయ రంగంలో రాజ్యం చేస్తున్నాయి.

అభ్యుదయ రాజకీయ ఉద్యమం ఈ స్థితి నుండి ముందు బయటపడాలి. భిన్న దృక్కోణాలనూ భిన్న సిద్ధాంత కోణాలనూ సగౌరవంగా స్వీకరించే పునస్సంఘీ భావాన్ని సాధించాలి. ఆ ప్రాతిపదికన ప్రజలలో లోతుగా పనిచేస్తూ ఎన్నికల రాజకీయ వ్యవస్థలో ప్రజానుకూల సంస్కరణలు కోరుకుంటూ అందులో పాల్గొన్నట్టయితే బొమ్మా – బొరుసు రాజకీయాల నుండి దేశాన్ని బయటపడేయడం సాధ్యం కావచ్చు.

*ఉద్యమం మాసపత్రిక*
*ఏప్రిల్ – మే 2004*



# గోడమీది ప్రజాస్వామ్యం



అవినీతి నుండి ఆశపోతుతనం నుండి ఏ వ్యవస్థనూ ఎవరూ కాపాడలేరు. వ్యవస్థలలో మంచీ చెడూ రెండూ ఉంటాయి. అది వేరే విషయం. కానీ ఏ వ్యవస్థనయినా దానిలోని అధికార దాహం నుండీ నీతిమాలినతనం నుండీ కాపాడడం కష్టం.

జార్ఖండ్ ఎన్నికల ప్రహసనం చూశాం. అసెంబ్లీ ఫలితాలన్నీ వెలువడినాక, ఎన్నికలయిన శాసనసభ్యులలో ఎవరు స్థిరమయిన ప్రభుత్వం ఏర్పాటు చేయగలరో వారిని గవర్నర్ పిలిచి ప్రభుత్వం ఏర్పాటు చేయమని ఆహ్వానించాలి. రాజ్యాంగంలో రాజకీయ పార్టీల ప్రస్తావన ఎక్కడా లేదు కాబట్టి మెజారిటీ సీట్లు గెలిచిన పార్టీ నేతనే గవర్నర్ ఆహ్వానించాలని రాజ్యాంగం చెప్పదు. అయితే అసెంబ్లీలో 50 శాతం సీట్లు మించి పొందిన పార్టీకి చెందిన శాసనసభ్యులు స్థిరమయిన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలరు కాబట్టి వారిలో వారు ఎవరిని తమ నేతగా ఎన్నుకుంటే ఆ వ్యక్తిని పిలిచి ప్రభుత్వం ఏర్పాటు చేయమని గవర్నర్ కోరడం ఆనవాయితీ అయింది. అట్లా చేయాలని ఏ చట్టంలోనూ లేదు, రాజ్యాంగంలోనూ లేదు గానీ ప్రభుత్వం ఏర్పాటు కోసమే ఎన్నికలు జరుగుతాయి కాబట్టి ఆ లక్ష్య సాధన కోసం ఈ సంప్రదాయం పుట్టింది, స్థిరపడింది.

ఏ పార్టీకీ 50 శాతం మించి సీట్లు రాకపోయినా గవర్నర్ చేయవలసింది స్థిరమయిన ప్రభుత్వం ఏర్పాటు చేయగల శాసనసభ్యుడిని, లేక సభ్యురాలిని ఆహ్వానించడమే. ఎటొచ్చీ ఎవ్వరికీ 50 శాతం మించి సీట్లు రానప్పుడు ఆ పని ఏ విధంగా చేయాలనడానికి ఏ ప్రమాణమూ లేదు. సుప్రీంకోర్టు ఒకటి రెండు తీర్పులలో ఏవో కొన్ని ప్రమాణాలు సూచించింది గానీ ఏదీ 'ఫూల్‌ప్రూఫ్' కాదు.

సంతకాలు సమర్పించమని అడుగుతాడా? రెండు లిస్టులలోనూ సంతకాలు చేసే మహాత్ములుంటారు. మనుషులను తీసుకొచ్చి రాజ్‌భవన్ ముంగిట ప్రదర్శించమని అడుగుతాడా? వారిని ఎత్తుకుపోయి దాచిపెడతారు. లేదా వారే దాక్కొని ఇరుపక్షాలతో బేరం పెడతారు.

ఈ మధ్య గవర్నర్లు అందుకే వేరే మార్గం ఎంచుకున్నారు. స్థిరమైన ప్రభుత్వం ఏర్పరిచే సామర్థ్యం ఎవరికి ఉందో నిర్ణయించి వారికి ప్రభుత్వం నెలకొల్పే అవకాశం ఇవ్వాలన్న సూత్రాన్ని తలకిందులు చేసి, ప్రభుత్వాధికారం అప్పగించేస్తే స్థిరమయిన పాలన నెలకొల్పే సామర్థ్యం దానంతటదే వచ్చేస్తుందని నిర్ణయించుకున్నారు. 'మనవాడు' అనుకున్న వాడిని ఆహ్వానించి కానిమ్మంటున్నారు. కొద్దిరోజులు టైమిస్తే కావలసినన్ని మనసులు మారుతాయి కాబట్టి 'మనవాడి'కి పట్టంగట్టి రుజువు చేసుకోవడానికి కావలసినంత టైం ఇస్తున్నారు.

పెద్దలు ఇది ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేయడమేనంటున్నారు. కరక్టే. కాని ఈ ఘోరంలో అసలు ముద్దాయి గవర్నర్ కాదు. ఆశ చంపుకోలేక అమ్ముడు పోవడానికి తయారుగా వున్న సగటు ప్రజాప్రతినిధులు. అందులోనూ ఏ పార్టీకి చెందనివారు, 'రెబెల్స్' అని పిలవబడే వారు గెలవగానే గోడెక్కి కూర్చుని బేరాలను ఆహ్వానించడం అసలు సమస్య. పెట్టిన పెట్టుబడి రాబట్టుకోవడానికి, అయిదేళ్ళ తరువాత ఎటుపోయి ఎటొస్తుందో తెలీదు కాబట్టి ఆపైన కూడ మిగుల్చుకోవడానికి ఎన్నికలయిన మొదటిరోజు నుండి శాసనసభ్యులు తయారుగా ఉన్నారు. అందుకోసమే గోడెక్కి కూర్చుంటున్నారు.

దీనిని నివారించడానికి కొత్త చట్టం తీసుకురావాలని కొందరు బుద్ధిజీవులు అంటున్నారు. తీసుకొస్తే బాగే. కానీ సిగ్గు విడిచిపెట్టిన ఆశపోతుతనానికి జవాబు చెప్పగల చట్టమేదీ లేదు. అభివృద్ధి పేరు మీద జరిగే ఖర్చులో పెద్దవాటా పొందే అవకాశం పదవిలో ఉన్న రాజకీయ నాయకులకు ఉన్నంతకాలం వారు ప్రజాసేవ పదవిలో ఉండే చేయదలచుకుంటారు తప్ప ప్రతిపక్షంలో ఉండి కాదు.

బీహార్‌లో రాంవిలాస్ పాశ్వాన్ ఆడుతున్న ఆట చూస్తున్నాం. దక్షిణ భారతదేశంలో అబ్రాహ్మణ సామాజిక రాజకీయ చైతన్యం, ఉద్యమం దాదాపు ఒక శతాబ్ద కాలపు చరిత్ర కలిగినవి. ఒక్క ఆంధ్రప్రదేశ్‌ను మినహాయిస్తే తక్కిన మూడు రాష్ట్రాలలోనూ

శక్తివంతమైన అబ్రాహ్మణ ఉద్యమాలు నడిచాయి. (మన రాష్ట్రంలో ఆ చోటును కమ్యూనిస్టు ఉద్యమం నింపింది.) కానీ ఉత్తర భారతదేశంలో దానికంత లోతయిన చరిత్ర లేదు. జయప్రకాశ్ నారాయణ్ తట్టిలేపిన రెండవ తరంలో లోహియావాదుల రాకే ఉత్తర భారతదేశంలో విస్తృత అబ్రాహ్మణ రాజకీయ ఉద్యమానికి నాంది అయింది. లాలు ప్రసాద్ యాదవ్, ములాయంసింగ్ యాదవ్, రాంవిలాస్ పాశ్వాన్, అంబేద్కర్ వాదులయిన కాన్షీరాం, మాయావతి ఈ చైతన్యానికి వైతాళికులుగా ముందుకొచ్చారు.

వీరందరిలోకీ తెలివితేటలలోనూ, చురుకయిన ఆలోచనా సామర్థ్యంలోనూ పాశ్వాన్ ఎక్కువ ఆకర్షణీయంగా కనిపించాడు. దళిత–బహుజన ఉద్యమానికి సంఖ్యా బలాన్ని కలిగించడంలో వీరందరి పాత్ర ఉన్నప్పటికీ ఆలోచనాత్మకమైన రాజకీయ సామాజిక కృషి పైన దృష్టి సారించిన వారు పాశ్వాన్‌పై ఎక్కువ ఆశలు పెట్టుకున్నారు.

అయితే ఈ నాయకులంతా కూడ పదవిలో తప్ప ప్రతిపక్షంలో ప్రజాసేవ చేయలేక పోవడం అనే జబ్బు వాతపడ్డారు. పదవి కోసం దాదాపు ఏమైనా చేయడానికి సిద్ధపడ్డారు. కనీసం ములాయం, లాలు ప్రసాద్‌లు మనువాదులతో పదవి కోసం చేతులు కలపడానికి సిద్ధపడలేదు (ములాయం గురించి ఈ మధ్యకాలంలో సందేహాలు వస్తున్నప్పటికీ) కాని కాన్షీరాం, మాయావతి, పాశ్వాన్‌లు దానికి సైతం తెగించారు. ఈ చతురతను చూసి ముచ్చట పడిన దళిత–బహుజన మేధావులు లేకపోలేదు గానీ దానివల్ల జరిగిన, జరుగుతున్న నష్టం అంతా యింతా కాదు.

ఇప్పుడు పాశ్వాన్ ఏ కూటమిలోనూ చేరకుండా బీహార్‌లో స్వంతంగా పోటీ చేశాడు. దానిని తప్పుపట్టం. బీహార్‌లో బ్రాహ్మణ, భూమిహార్, ఠాకూర్‌ల (మూడూ జంధ్యం వేసుకునే కులాలే) స్థానంలో బి.సి. రాజకీయాలను అధికార పీఠం మీదికి తెచ్చి స్థిరంగా నిలబెట్టినందుకు న్యాయమైన ఘనతనూ గౌరవాన్నీ పొందిన లాలు ప్రసాద్ యాదవ్ దాని మీద బతికేయసాగాడు. అయితే రాజకీయ సంవాదంలోని సామాజిక న్యాయం పాలనా విధానాలలోకి తర్జుమా అయింది చాలా తక్కువ. మన దగ్గర మనం అతి సామాన్య సంక్షేమ విధానాలుగా భావించే సోషల్ వెల్ఫేర్ హాస్టళ్ళు, గ్రామాలకు ఎర్రబస్సులు, కరువు పనులు, ఎస్.సి. కార్పొరేషను, ఐ.టి.డి.ఎ వంటి సంస్థల కృషి – ఇటువంటివి సహితం ఇన్నేళ్ళ లాలు ప్రసాద్ పాలనలో బీహార్‌లో నామమాత్రం అనదగ్గ స్థాయిని మించి లేవు. ఇంక హింసా దౌర్జన్యాలను అరికట్టడం,

స్కూళ్ళు, ఆస్పత్రులు సజావుగా నడపడం, ప్రభుత్వ ఉద్యోగుల చేత పనిచేయించడం వంటి పనులు సరేసరి. ఈ స్థితిలో సామాజిక న్యాయానికి కట్టుబడిన నాయకుడు లేక పార్టీ లాలుకు ప్రత్యామ్నాయాన్ని తయారుచేసే ప్రయత్నంలో భాగంగా స్వతంత్రంగా పోటీచేయాలన్న నిర్ణయం తీసుకుంటే దానిని సూత్రప్రాయంగా తప్పుపట్టలేం.

ఎన్నిక ముగిసింది. పాశ్వాన్ మద్దతుతో తప్ప ఎవరూ ప్రభుత్వం నెలకొల్పే పరిస్థితి లేదని అర్థం అయింది. ప్రజలను పిచ్చివాళ్ళుగా, పరిపాలనను ఒక తమాషాగా చూడడం మానేయమని లాలు ప్రసాద్‌కు గట్టి హెచ్చరిక చేసే విధంగా కచ్చితమైన షరతులతో కూడిన మద్దతు ఇవ్వడం అన్ని విధాలా పాశ్వాన్‌కు ఉచితమైన చర్య అయి వుండేది. కానీ పాశ్వాన్ ఆ పని చేయడు. గోడ ఎక్కి కూర్చుంటాడు. బీహార్‌లో రాష్ట్రపతి పాలన రానిస్తాడు. పనిలో పనిగా, ఎన్నికయిన ప్రభుత్వాల కంటే ఐఎఎస్ ఆఫీసర్ల పాలన మంచిది అనే నికృష్టపు ఆలోచనకు బహిరంగంగానే మద్దతు ఇస్తాడు. కానీ తాను మాత్రం ఎన్నికల రాజకీయ బరిలో నుండి తొలగడు. ఎత్తయిన గోడ ఎక్కి కూర్చుని ఆరునెలలు సాగబోయే ఆటకు నాంది పలికాడు. అతని ధ్యేయం ఒక్కటే. తాను ముఖ్యమంత్రి కావాలి. వీరో వారో దానికి అంగీకరించి తనకు మద్దతు ఇవ్వాలి. మనువాదులిచ్చినా, లోహియావాదులిచ్చినా ఫరవాలేదు. పదవి ముఖ్యం. వీరో వారో తప్పక ఇస్తారని అతని ధీమా, ఎందుకంటే మళ్ళీ ఎన్నికలు రావడం ఎవరికీ ఇష్టం లేదు. వచ్చినా ఇంతకంటే భిన్నమైన ఫలితం వస్తుందన్న నమ్మకం లేదు.

రాష్ట్రపతి పాలన ఈ ఆటకు ఆరునెలల గడువు ఇస్తుంది. జార్ఖండ్ గవర్నర్ శిబూసోరెన్‌కు రెండు వారాలు గడువిచ్చి చేసుకునేది చేసుకొమ్మనగా, బీహార్‌లో పాశ్వాన్ తనకు తాను ఆరు నెలల గడువు ఇచ్చుకున్నాడు. కుర్చీ కోసం ఆట మొదలుపెట్టాడు.

ఇంతటి అధికార దాహం నుండి, నీతిమాలినతనం నుండి దేశ రాజకీయాలను, ప్రజాస్వామ్యాన్ని ఎవరు కాపాడగలరు? ఏ సంస్కరణలు, ఏ చట్ట సవరణలు కాపాడగలవు? న్యాయమూర్తులు హూంకరించగలరు గానీ న్యాయవ్యవస్థలో పైకి ఎగబాకడానికి వారు సహితం ఈ గోడమీది ప్రజాస్వామ్యానికి రుణపడి ఉన్నవారే కాబట్టి వారయినా ఎంతసేపు హూంకరించగలరు?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*13 మార్చి 2005*

# అవకాశవాద ప్రజాస్వామ్యీకరణ



**సి**పిఐ(ఎం) అవకాశవాదం గురించి ఇప్పటికే చాలామంది చాలా మాటలే అన్నారు. ఇంత చవకగా పరువు పోగొట్టుకున్నందుకు ఆశ్చర్యం ప్రకటించారు కూడ.

ఎన్నికల రాజకీయాల వెలుపల ఉన్న సంస్థలు ఆందోళనలు పెద్దఎత్తున చేపట్టడం, దెబ్బలు తినడం, జైళ్ళపాలు కావడం జరుగుతూనే ఉంది గానీ 'ప్రధాన రాజకీయ స్రవంతి' పార్టీలు ప్రజాందోళనలను రాజకీయ ప్రక్రియగా చేపట్టడం దాదాపు మానేశాయి. టిఆర్ఎస్ దీనికి మినహాయింపు అయివుండవచ్చు గానీ ఆ పార్టీ అధినేత ఆందోళనలు అక్కరలేదని మొదట్లోనే ప్రకటించేశాడు.

కొన్ని సంవత్సరాలుగా మన రాష్ట్రంలో సిపిఐ(ఎం) అందుకు భిన్నంగా నడుచుకుంటూ ఉంది. విద్యుత్ సంస్కరణల గురించి, నిర్వాసితుల గురించి, అంగన్‌వాడి ఉద్యోగుల జీతభత్యాల గురించి, ఇంకా అటువంటి ఇతర సమస్యల గురించి ఆ పార్టీ పెద్ద నాయకులు సహితం వీధిలోకి వచ్చి దెబ్బలు తిన్నారు. పాదయాత్రలు చేపట్టడం ఈ మధ్యకాలంలో అన్ని పార్టీలకూ అలవాటయిపోయినప్పటికీ, అస్పష్టమైన సర్వజనరంజకమైన డిమాండ్లతో కాక మధ్యతరగతి, అగ్రకుల ప్రజాభిప్రాయానికి నచ్చని నిర్దిష్టమైన డిమాండ్లతో సైతం – విశాఖపట్నంలో బాక్సైట్ తవ్వకానికి వ్యతిరేకంగా, రంగారెడ్డి జిల్లాలో అంటరానితనానికి వ్యతిరేకంగా – సిపిఐ(ఎం) నాయకులు పాదయాత్రలు నిర్వహించి సాహసం ప్రదర్శించారు.

ఎన్నికల రాజకీయాలంటే ఏ విలువలూ లేని అవకాశవాదం అని విసిగిపోయిన వారికి ఇది ఆకర్షణీయంగా తోచింది. వామపక్షాలు ప్రజా ఉద్యమాల ద్వారా వోట్లు

సంపాదించుకుని అధికారానికి రాగలవన్న పంతొమ్మిదవ శతాబ్దపు ఆశాభావానికి ఇరవై ఒకటవ శతాబ్దంలో తిరిగి ప్రాణం పోస్తున్నారేమో అని సహితం కొందరికి అనిపించింది. ఇది ఎక్కువ కాలం నిలవదేమోనన్న సందేహం చరిత్ర ఎరిగిన వారికి రాకపోలేదుగానీ ఆశ చావని మానవ నైజం ఆ సందేహాన్ని తొక్కిపెట్టింది. మీడియా సహితం సిపిఐ(ఎం) వారి ఆందోళనలకు మంచి ప్రచారం ఇచ్చింది. పడికట్టు సూత్రాలు తప్ప మామూలు మాటలు మాట్లాడలేని నాయకుల స్థానంలో ఇంగ్లీష్‌లోనయినా తెలుగులోనయినా ఆకట్టుకునేటట్టు మాట్లాడగల కొత్తతరం నాయకులు రావడం ఇందుకు తోడ్పడింది.

కాని నాలుగు జడ్.పి.టి.సి సీట్లకోసం ఈ అందమైన రాజకీయ చిత్రాన్ని సిపిఐ(ఎం) చేజేతులా ఎందుకు ధ్వంసం చేసుకుంది అన్న ప్రశ్న ఇప్పుడు చాలామంది వేసుకుంటున్నారు. పెద్ద ప్రయోజనం వచ్చేటట్టయితే తప్పుడు పనులు చేసినా అర్థం ఉంది అని భావించే నైతిక స్థితికి చేరుకున్నాము కాబట్టి, నిజంగానే సిపిఐ(ఎం) రెండో మూడో జిల్లా పరిషత్ ఛైర్‌పర్సన్ పోస్టులు, యాభయ్యో వందో మండల ప్రెసిడెంట్ పోస్టులు పొందగలనని భావించి పరువు పోగొట్టుకుందా అని లెక్కలు తీస్తున్నారు. పచ్చ రంగునూ ఎర్ర రంగునూ ఏ పాళ్ళలో కలిపినా ఆ లెక్క గట్టెక్కక పోవడంతో ఆశ్చర్యపోతున్నారు.

పెద్ద ప్రయోజనమేమీ లేకపోయినా ఆదర్శవాద ప్రజాభిప్రాయం దృష్టిలో పరువు పోగొట్టుకోవడానికి సిపిఐ(ఎం) నాయకత్వానికి అభ్యంతరం ఉండదన్న సత్యాన్ని గ్రహించడానికి కొంత సమయం పట్టవచ్చు. ఇవాళ కాకపోతే రేపయినా ప్రయోజనం లేనిదే ఎందుకు చేస్తారన్నది అప్రస్తుతమైన ప్రశ్న. ఏదో ఒకటి ఉంటే ఉండవచ్చును కానీ కమ్యూనిస్టు పార్టీల ఆచరణను అర్థం చేసుకోవడానికి ఆదర్శవాదమే అప్రస్తుతమైన ప్రమాణం అని మొదట అర్థం చేసుకోవడం అవసరం. దీనికి అది పార్లమెంటరీ కమ్యూనిస్టు పార్టీయా విప్లవ పార్టీయా అన్న తేడాతో నిమిత్తం లేదు. వారి ఆచరణ సాధారణ మానవుల ఆదర్శవాదానికి అప్పుడప్పుడు దగ్గరవుతుంటుంది. అప్పుడు సాధారణ మానవులు వారిని అభిమానంగా చూస్తారు. అంతలోనే వారి ఆచరణ వీరి ఆదర్శ వాదానికి దూరం అవుతుంటుంది. అంత గొప్ప విషయాలు మాట్లాడే వాళ్ళు ఇట్లా ఎందుకు ప్రవర్తిస్తారా అని వీళ్ళు ఆశ్చర్యపోతుంటారు.

దైనందిన రాజకీయాలలో విలువలు పాటించడం అనే ఆదర్శవాదం పట్ల చులకన భావం కమ్యూనిస్టు సాహిత్యంలో దండిగా కనిపిస్తుంది. దానికి 'పెటీ బూర్జువా' అన్న పేరు తగిలించడం ద్వారా చంచల వర్గ స్వభావాన్ని ఆపాదించడమూ కనిపిస్తుంది. నిజానికి అచంచలమైనది ఏదయినా ఉంటే అది ఆదర్శవాదమే. దానిని చంచల స్వభావం గల మధ్యతరగతికి ఆపాదించి, అప్పటి అవసరాన్ని బట్టి రాజనీతిని మార్చే చంచలత్వాన్ని స్థిర చిత్తం గల కార్మిక వర్గం లక్షణంగా ఎత్తి చూపడం కొంచెం ఆశ్చర్యం కలిగించే తర్కమే. అయితే దీనిని గతితర్కం అనబోతారు కాబట్టి ఈ చర్చ అక్కడితో ఆపుదాం.

దైనందిన రాజకీయ విలువల పట్ల కమ్యూనిస్టు పార్టీలకు ఉండే ఈ వైఖరి చాలా నష్టకరమైనదని మార్క్స్ సమకాలీకుల నుండి మన రాంమనోహర్ లోహియా దాకా చాలామంది ఎత్తి చూపారు. అయితే వారెవ్వరూ 'విజయం' సాధించలేకపోయారు. కాబట్టి వారి విమర్శ ఆచరణ శూన్యమైన ఆవేదనగా కొట్టివేయబడింది. లోహియా ఆలోచనా స్రవంతికి చెందినట్టు చెప్పుకునే లాలుప్రసాద్ యాదవ్, ములాయంసింగ్ యాదవ్ వంటివారు సహితం విలువల పట్ల తృణీకారభావం పెంచుకున్న తరువాతే 'విజయం' సాధించారన్నది కూడ సత్యమే.

దేంట్లో 'విజయం'? అధికారం సంపాదించడంలో, అధికారం నిలబెట్టుకోవడంలో, ప్రపంచాన్ని మార్చడంలో రాజ్యాధికారానికి కీలకపాత్ర ఉందని మార్క్స్ భావించాడు. అంబేద్కర్ కూడ దానికి అంతే కీలకపాత్ర ఆపాదించాడా అనేది కొంత సంశయాస్పదమే అయినప్పటికీ ఆయన ఆలోచనా విధానంగా గుర్తింపు పొందిన దానిలో 'దళితుల రాజ్యాధికారం' అనే లక్ష్యానికి ప్రముఖ స్థానమే ఇవ్వబడింది. ప్రపంచాన్ని బాగుచేయడానికి దానిమీద అధికారం అవసరం అనే ఆలోచన వెనుక చాలా తర్కమే ఉంది. కాదనలేము గానీ ప్రతి రాజకీయ వ్యూహానికి కొన్ని మానవీయ పర్యవసానాలు ఉండగలవని గుర్తించాలి. సర్వోదయ సిద్ధాంతం క్రియాశూన్యమైన నీతి సూక్తుల వల్లింపుకు పరిమితం అయ్యే ప్రమాదం ఉన్నట్టే అధికారాన్ని లక్ష్యంగా పెట్టుకున్న రాజకీయ వ్యూహం అనైతికమైన అవకాశవాదానికి దారితీసే ప్రమాదం ఉంది. సిద్ధాంతవేత్తలు తమ ఆలోచనా రీతికి ఉండే మానవీయ పర్యవసానాల పట్ల స్పృహ కలిగి ఉండకపోతే ఈ ప్రమాదాలు మరింత ఎక్కువ కాగలవు.

ఉత్తరప్రదేశ్‌లో అధికారం అనబడే 'విజయం' సాధించడానికి మాయావతి బ్రాహ్మణులనూ వైశ్యులనూ చేరదీస్తున్న వైనం అనైతిక అవకాశవాదానికి ప్రముఖ ఉదాహరణగా గుర్తింపు పొందవలసింది. కానీ దళితవాదులలో కొందరు 'మన నాయకురాలిని మనమే ఎందుకు విమర్శించాలి' అని వెనకాడుతుండగా, ఇతరులు ఆమె రాజకీయ చతురతకు మురిసిపోతుండడం వల్ల, మీడియాలో రాజకీయ విశ్లేషణ చేసే వారిలో అధికులు బ్రాహ్మణులు కావడం వల్ల ఆమె రాజకీయ అనైతికత చాతుర్యంగా చూపించబడుతున్నది. ఎస్.సి, ఎస్.టి, బి.సి, మైనారిటీల ఐక్యత అనేది దళితవాదు లందరి రాజ్యాధికార వ్యూహం. కానీ ఆ రాజ్యాధికారంలో ఒక ముక్క సంపాదించిన అతిపెద్ద రాష్ట్రంలో దానికి సరిగ్గా విరుద్ధమైన వ్యూహం అమలవుతున్నది. ఎస్.సి, బి.సిలు ఒకటయ్యే బదులు అధికారంలో వున్న బి.సి నాయకుడిని దించడానికి ఎస్.సి నాయకురాలు బ్రాహ్మణులతో దోస్తీ కడుతుంది. మొదట ఆమె బ్రాహ్మణవాదంతో మొదలుపెట్టింది, ఇప్పుడు బ్రాహ్మణుల దగ్గరికే వచ్చింది. ఇది కూడ నిగూఢమైన గతితర్కమా, లేక కేవలం వ్యక్తిగత అధికార దాహమా?

సిపిఐ(ఎం) అవకాశవాదానికి కూడ ఇంతకంటె లోతయిన గతితర్కమేమీ లేదని ఆ పార్టీతో మొన్నటిదాకా సన్నిహితంగా ఉన్నవారు అంటున్నారు. ఎంత కాలమైనా ధర్నాలు, ఊరేగింపులు, ఆందోళనలేనా? కొంచెం అధికారం రుచి కూడ వద్దా? అని కిందిస్థాయి నుండి బలమైన ఒత్తిడి ఉందని అంటున్నారు. కాంగ్రెస్‌తోనే ఉంటే అది కష్టం. రాష్ట్రంలో అధికారంలో ఉన్న పార్టీ కాబట్టి ఆ పార్టీ ఎం.పి.టి.సిగా ఉన్నా సర్పంచ్‌గా ఉన్నా సంపాదనావకాశాలు ఎక్కువ ఉంటాయి కాని ఆ పార్టీతో 'సంతృప్తికరమైన' సీట్ల సర్దుబాటు జరిగే అవకాశం లేదు. అధికారంలో లేని తెలుగుదేశం పార్టీ తన అవసరాల నిమిత్తం ఎక్కువ సీట్లు ఇవ్వగలదు. అప్పుడు సిపిఐ(ఎం) తన కేడర్‌ను ఎక్కువగా సంతృప్తి పరచగలదు. ఈ అవకాశవాద ప్రజాస్వామీకరణేనా సిపిఐ(ఎం) పరువు పోగొట్టుకోవడానికి వెనకాడక పోవడంలోని రహస్యం?

ప్రజాతంత్ర వారపత్రిక<br>18 జూన్ 2006



# పంచాయతీ ఎన్నికలు
# అక్రమాలు, అబద్ధాలు అసలు సమస్యలు



**ఈ**సారి పంచాయతీ ఎన్నికలలో నిజంగానే ఎప్పటికన్నా ఎక్కువగా అక్రమాలు జరిగాయా? జరిగిన అక్రమాలన్నీ కాంగ్రెస్ వారే చేశారా? అన్న సందేహాలు చాలా మందికి వచ్చే ఉంటాయి. ఈ సందేహాలు రావడానికి మనం కాంగ్రెస్ అభిమానులం కానక్కరలేదు. అయినా కాంగ్రెస్ పార్టీ అభిమానులు మాత్రం తమ పార్టీ అక్రమాలు చేయదని ఎప్పుడన్నారని? వారి నాయకులే అనలేదు. డబ్బు ప్రవాహం గురించి, మద్యం ప్రవాహం గురించి తెలుగుదేశం నాయకులు వేసిన నిందకు రోశయ్య వంటి అనుభవజ్ఞుడే 'అందరమూ చేస్తున్నాం కదా – మామీద మీరెందుకు నిందలు వేస్తున్నారు?' అంటూ విసుగుపోవడం చూశాం.

తెలుగుదేశం పార్టీ ఓడిపోయిన నాటి నుండి ప్రతిరోజు ప్రతి విషయం మీదా రచ్చచేసి అల్లరిచేసి వార్తలలో ఉండాలనీ, తన ప్రత్యర్థిని భ్రష్టు పట్టిస్తూ ఉండాలనీ చంద్రబాబునాయుడు సంకల్పించారు. అతను అధికారంలో ఉన్నా లేకున్నా నూటికి 75 శాతం మీడియా అతనికి సహకరిస్తుంది. అంతే తప్ప ఎప్పటికన్నా ఎక్కువగా అక్రమాలు జరిగాయని నమ్మటానికి అధారాలున్నట్లు కనిపించదు.

ఎప్పుడూ జరగనంతగా అక్రమాలు జరిగాయని గొంతు చించుకోవడం వల్ల చంద్రబాబునాయుడు సకల రాజకీయపక్షాలకూ చేసిన మేలు ఏమిటంటే అక్రమాలు ఎప్పుడూ పెద్దఎత్తున ఎందుకు ఉంటున్నాయని, ఎన్నికల ప్రక్రియే ఒక అక్రమ

ప్రక్రియగా ఎందుకు తయారయిందని ఎవరూ అడగకుండా చేయడం. కాంగ్రెస్ నాయకులు సిగ్గు లేకుండా ఒప్పుకున్నట్లు అందరూ తాగబోస్తారు, అందరూ తినబెడతారు, అందరూ చేతనయిన కాడికి దౌర్జన్యాలు చేస్తారు. ఇవి ఎన్నికల ప్రక్రియలో 'అప్రశుతులు' కావు. ఎన్నికల ప్రక్రియలో ఇదే ముప్పావలా వంతు.

నీటిపారుదల ప్రాజెక్టుల టెండర్ల కుంభకోణాలపైన ఒకటే అల్లరిచేసి అసలు నీటిపారుదల విధానంలోని విజ్ఞత ఎంత అన్న చర్చ వినపడకుండా చేసినట్టే ఎన్నికల అక్రమాల గురించి రచ్చచేసి అసలు ఎన్నికలే ఎంత అర్థరహితంగా తయారయ్యాయన్న విషయం చర్చకు రాకుండా చేయగలిగాడు చంద్రబాబు.

స్థానిక ప్రజాస్వామ్యంలో ప్రజాస్వామ్యాన్ని తీసేసి అభివృద్ధి పేరుమీద అరువు తెచ్చుకున్న డబ్బులు గ్రామాలలో వెదజల్లుతున్నారు. వాటికోసం స్థానిక నాయకులు కొట్టుకుంటున్నారు. గ్రామానికిగానీ, మండలానికిగానీ, జిల్లాకుగానీ అభివృద్ధి నిధులేవయినా మంజూరయితే ఆయా స్థాయి పాలనా కమిటీలు కూర్చొని అన్నిటికంటే తప్పనిసరయిన అవసరాలేమిటో నిర్ణయించి వాటిమీద ఖర్చుపెట్టే బదులు, ఒక కొత్త పద్ధతిని స్థానిక ప్రజాస్వామ్యం కనిపెట్టింది. మంజూరయిన డబ్బుల మేరకు అభివృద్ధి పనులు సూచించే అవకాశాన్ని సభ్యులందరికీ సమానంగా పంచుతారు. ఉదాహరణకు మండలానికి 10 లక్షలు మంజూరయితే ఆ మండలంలో 10 మంది ఎం.పి.టి.సిలు ఉంటే తలా ఒక లక్ష రూపాయల పనిని సూచిస్తారు. ఎవరి ఇలాఖాలో వారు సూచిస్తారు కాబట్టి ఒకరి ప్రతిపాదనకు మరొకరు అభ్యంతరం చెప్పటం జరగదు. అందరూ తాము ప్రతిపాదించిన పనులలో ఎంతో కొంత మిగుల్చుకుంటారు. ఈ 'ఎంతో కొంత' అయిదేళ్ళు తిరిగేసరికి లక్షలు కాదు, ఒక్కొక్కచోట కోట్లలో ఉండగలదు.

అందుకే పైకి చూడడానికి ఏ అధికారమూ లేనట్టు కనిపించే ఎం.పి.టి.సి, జడ్.పి.టి.సి పదవుల కోసం ఇంత పోటీ, ఇంత కొట్లాటలు, ఇంతటి దిగజారుడు. ఎం.పి.టి.సి అభ్యర్థులకయ్యే ఖర్చు చాలాచోట్ల పది లక్షలు దాటిందంటున్నారు. ఇందులో తెలుగుదేశం, కాంగ్రెస్ అన్న తేడా లేదు. తాగించడంలోను, తినిపించడం లోనూ కూడ లేదు. తేడా అల్లా ఒకరు నీతిమంతులుగా నటించగలగడం, వారికి మీడియా ప్రచారం ఇవ్వడం.

సెమినార్లలో ప్రజాస్వామ్యాన్ని గురించి మాట్లాడేటప్పుడు స్థానిక ప్రజాస్వామ్యానికి ఇచ్చే ప్రాముఖ్యానికీ, ఆచరణలో దానికి పట్టించిన దుర్గతికీ పొంతనే లేదు. ఎన్నికలు సీరియస్‌గా జరిగినట్టయితే, స్థానిక సంస్థలకు అధికారాల బదలాయింపు ఎందుకు జరగలేదన్న దగ్గర ఎన్నికల సంవాదం మొదలు కావలసి ఉండింది. రాష్ట్రాన్ని మార్చి మార్చి పరిపాలిస్తున్న ఈ రెండు పార్టీలు ఒకే రీతిగా దీనిని అశ్రద్ధ చేశాయి.

పంచాయతీ వ్యవస్థలకుండే బాధ్యతల గురించి చెప్పే పంచాయతీరాజ్ చట్టాన్ని బహుశా సర్పంచ్‌లు, మండల ప్రెసిడెంట్‌లు చదవరనుకుంటాను. చదివితే గుండెపగిలి చస్తారు. ఎన్నో బాధ్యతలున్నాయి గానీ అందుకు సమానంగా అధికారాలు లేవు. అధికారాలన్నీ రాష్ట్ర ప్రభుత్వం దగ్గర ఉన్నాయి.

రాజ్యాంగాన్ని రాసినప్పుడే పంచాయతీరాజ్ వ్యవస్థను బలంగా తీర్చిదిద్ది 'గ్రామ స్వరాజ్యాన్ని' ఆవిష్కరించాలన్న చర్చ జరిగింది. ప్రజలు తమను తాము నిజంగా పరిపాలించుకోవాలంటే అధికారాలు వీలయిన మేరకు స్థానిక సంస్థల చేతిలో ఉంచాలనేది 'గ్రామ స్వరాజ్యం' భావన. ఇది గాంధీ ఆలోచనలలో ముఖ్యమైనది కాగా, గ్రామ స్వరాజ్యం అంటే అగ్రకుల గ్రామ పెత్తందార్లకు దళితులు, పీడితులపైన మరింత అధికారం ఇవ్వడమేనని అంబేద్కర్ భావించాడు. వేరువేరు కోణాలలో ఇద్దరి ఆలోచనలలోను సత్యం ఉందని గుర్తించడం కష్టం కాదు. అయితే రాజ్యాంగంలో స్థానిక సంస్థలకు ఏ స్థానమూ ఇవ్వకపోవడానికి కారణం వేరే. స్వాతంత్ర్య పోరాటం చేసి చాలా చాలా త్యాగాలు చేసిన నాయకులు కొత్తగా తమ చేతికి వచ్చిన అధికారాన్ని వికేంద్రీకరణ పేరిట వదులుకోదలచుకోలేదు.

దాదాపు 40 సంవత్సరాలపాటు రాజకీయపార్టీలూ ప్రభుత్వాలూ పంచాయతీరాజ్ వ్యవస్థతో ఆటలాడుకున్నారు. అయిదేళ్ళకొకసారి జరగవలసిన ఎన్నికలు పదేళ్ళయినా జరిపేవారు కాదు. అన్ని అధికారాలు రాష్ట్ర రాజధానిలో కేంద్రీకరించారు.

చివరికి 1993లో పంచాయతీరాజ్ వ్యవస్థకు రాజ్యాంగ ప్రతిపత్తి కల్పించడం జరిగింది. పంచాయతీరాజ్ వ్యవస్థ ఏ విధంగా ఉండాలో వివరంగా సూచించే రాజ్యాంగ సవరణ జరిగింది. పనిలోపనిగా పంచాయతీరాజ్ వ్యవస్థకు ఉండే అధికారాలనూ ప్రకటిస్తే పోయేది. కానీ రాజకీయ నాయకులు మళ్ళీ అడ్డం పడ్డారు. పంచాయతీరాజ్

వ్యవస్థకు ఇవ్వగల అధికారాలను 11వ షెడ్యూలులో పొందుపరిచి వాటి నిర్ణయం మాత్రం రాష్ట్ర ప్రభుత్వాల చేతిలో పెట్టారు. 13 సంవత్సరాలుగా దేశంలోని ఏ రాష్ట్రమూ 11వ షెడ్యూలు అధికారాన్ని గ్రామాలకు ఇవ్వలేదు.

ఎందుకు ఇవ్వలేకపోయారని ఈ రెండు పార్టీలను ఎన్నికల సందర్భంలో ప్రజలు నిలదీయగలిగి ఉంటే బాగుండేది. దానితోబాటు ఒక్కొక్క ప్రాంతంలో గ్రామీణ ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి ఏ పార్టీ దగ్గర ఏ విధానం ఉందని - వలసల గురించి, రోగాల గురించి, కరువు గురించి - నిలదీయగలిగితే బావుండేది. ఏ ప్రశ్నా ఎదుర్కోనవసరం లేకుండానే ఈ రెండు పార్టీలు ఎన్నికలను దాటేయటమే కాక, ఒకరు అక్రమాలకు పాల్పడుతుంటే మరొకరు వారిని నిలదీస్తున్నారన్న అదనపు అబద్ధమొకటి ప్రచారమయ్యింది. అయినా అంతా మించిపోలేదు. సర్పంచ్ ఎన్నికలు ఇంకా ఉన్నాయి. వాటిలోనయినా ప్రజాస్వామ్యం మేల్కొంటుందని ఆశించగలమా?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*2 జూలై 2006*



# కరీంనగర్ ఉపఎన్నికలో ప్రజల సమస్యలెక్కడ?



కరీంనగర్ ఉపఎన్నిక ఫిబ్రవరి దాకా జరగబోదని ఎవరో అంటే విని గాభరాపడ్డాము. ఇంకొక మూడు నెలలు ఈ తిట్లు, సవాళ్ళు, ఈసడింపులు, దూషణలు వింటూ ఉండవలసిందేనా అని భయపడ్డాము. అది డిసెంబర్ 4న జరిగిపోతుందని తెలిసి సంతోషమనిపించింది. ఆ ఎన్నిక తెలంగాణ మీద రెఫరెండమ్ అయినట్టే నడుచుకుంటూ, కాదు కాదని ముందు జాగ్రత్తగా అందరూ అంటున్నారు కాబట్టి ఒక రకంగా ఆ రోజు ఏం జరిగినా ఒకటే. అయినప్పటికీ తెలంగాణను ప్రేమించే వాళ్ళెవరయినా కెసిఆర్ ఓడిపోకూడదనే కోరుకుంటారు. కెసిఆర్ పరువు పోతుందని కాదు. పరువు నిలబెట్టుకోవడానికి ప్రత్యేకమైన ప్రయత్నమేమీ చేయని వ్యక్తి పరువుపోతే వేరెవరైనా ఎందుకు బాధపడాలి? కానీ తెలంగాణ భావన అవమానానికీ అవహేళనకూ గురి కాకూడదు. కాబట్టి కెసిఆర్ ఓడిపోకూడదు.

అంతకుమించి ఈ ఎన్నికకు వేరే ప్రాముఖ్యమేమీ లేదు. తెలంగాణను వస్తువుగా చేసుకొని టిఆర్ఎస్, కాంగ్రెస్, టిడిపిలు రాజకీయాలను ఎంతగా దిగజార్చాలో అంతగా దిగజార్చాయి. ప్రజలకది టిక్కెట్‌లేని సర్కస్ అయిపోయింది. చోద్యం అలవాటైపోయి మన ఆలోచనలు స్తంభించిపోయాయిగానీ, లేకపోతే అసలు ఈ ఉపఎన్నిక ఎందుకోసం వచ్చినట్టు? పార్లమెంటుకు ఎన్నికయిన వ్యక్తి అయిదు సంవత్సరాల లోపల తన రాజకీయ పంథా గనక మార్చుకున్నట్టయితే తన సీటుకు రాజీనామా చేసి, మళ్ళీ అక్కడే ఎన్నికలకు నిలబడితే అందులో కొంచెం అర్థం ఉంది. ఆ ఎన్నిక ఖర్చు పూర్తిగా దండగ కాదని అనుకోవచ్చు. కెసిఆర్ 2004లో ఏ రాజకీయ లక్ష్యంతో

పోటీ చేశాడో ఇప్పుడూ అదే లక్ష్యంతో ఉన్నాడు. ఇంకొకసారి అతనికే వోటువేసి ఆ రాజకీయ లక్ష్యం పట్ల కరీంనగర్ ప్రజలు తమ నిబద్ధతను రుజువు చేసుకోవాలా? ఒక దొర ఏదో అన్నాడని ఇంకొక దొర అలిగితే ఆ పంతం ఖర్చు ప్రజలు భరించవలసిందేనా? దొరతనం ఇంకా సజీవంగానే ఉందని రుజువు చేయడం కోసమా ఈ ఉపఎన్నిక?

ఎన్నికయినా ఉపఎన్నికయినా కరీంనగర్ పార్లమెంటు నియోజకవర్గం గురించి మాట్లాడదలచుకుంటే చాలా విషయాలు ఉన్నాయి. ఆ నియోజకవర్గంలో ప్రధాన భాగం ఇవాళ రాష్ట్రంలోని అత్యంత అభివృద్ధి చెందిన ప్రాంతాలతో పోటీ పడుతుంది. జగిత్యాల గుడివాడకు ఏ రకంగానూ తీసిపోదు. కానీ శ్రీరాంసాగర్ ఆయకట్టును దాటి కొంచెం దూరంపోతే వార్తలన్నీ చావు కబుర్లే. గడచిన తొమ్మిది సంవత్సరాలుగా సిరిసిల్ల పట్టణంలో పవర్‌లూం కార్మికులు సంవత్సరానికి సగటున 25 మంది ఆత్మహత్య చేసుకుంటున్నారు. ఒక నియోజకవర్గంలో కాదు; ఒక మండలంలో కాదు; ఈ మధ్యనే మునిసిపాలిటీ అయిన ఒకే ఒక ఊరిలో. ఈ ఊరు గురించి కరీంనగర్ ఉపఎన్నికలో మీరు వినరు. ఎవరికీ తెలియక కాదు. అందరికీ తెలిసే వినరు. ఒకరి దగ్గర బ్రహ్మాండమైన 'అభివృద్ధి' ఉంది, మరొకరి దగ్గర తెలుగు దినపత్రికలు 'సెంటిమెంట్' అని పేరుపెట్టిన భావోద్వేగం ఉంది. ఇంక నేత కార్మికుల శవాలతో ఎవరికేం పని?

ఆ ఊరిలో ఏ గల్లీలోకి తొంగిచూసినా పవర్‌లూం టకటకలు వినిపిస్తాయి. ఇంటి ముంగిట బీడీలు చుట్టుకుంటూ స్త్రీలు కనిపిస్తారు. నేత కార్మికులు చేనేత కార్మికులుగా ఉన్న రోజులలో స్త్రీ పురుషులిద్దరూ కలిసి నేసేవారు. పవర్‌లూంలు వారిని విడదీశాయి. 'సాంచాలు' నడిపే పని మగవారి పని అయింది. గతంలో ఒక మగ్గం మీద భార్యభర్త పనిచేసేది. ఇప్పుడు నాలుగు 'సాంచాల'ను మగవాడు ఒక్కడే నడపగలడు. దాంతో స్త్రీలు పూర్తికాలం బీడీ కార్మికులు అయ్యారు. పొద్దున లేచిన కాడి నుండి రాత్రి పండుకునే దాకా వంట చేసుకుంటూ, పిల్లలను చూసుకుంటూ మధ్యమధ్యలో బీడీలు చుడుతూ వుంటారు.

ఆర్థికశాస్త్ర సిద్ధాంతం ప్రకారం ఈ విధంగా ఉత్పాదకత పెరిగి శ్రమ విభజన జరిగినప్పుడు ఆదాయాలు పెరిగి ఉండాలి. అది మాత్రం జరగలేదు. అసలే జరగలేదని

కాదు – సిద్ధాంతం చెప్పిన దానిలో పావు వంతు కూడ జరగలేదు. ఒంటిచేత్తో నాలుగు 'సాంచాలు' నడిపే మగవాళ్ళు నెల తిరిగేసరికి 2000 రూపాయలు సంపాదిస్తే ఎక్కువ. రెండు చేతులతో బీడీలు చుట్టే స్త్రీలు 500 సంపాదిస్తే ఎక్కువ. మరి ఊరేమో పట్టణం అవుతూ ఉంది. బతుకు ఖర్చు పల్లెటూరి ప్రమాణాలు దాటిపోయింది. పిల్లలకు యూనిఫాం వేసి మెడకు టై కట్టి స్కూలుకు పంపాలి. ఒంట్లో బాగాలేకపోతే కరీంనగర్‌లోని వీధివీధిలోనూ వెలిసిన ప్రైవేట్ దవాఖానాలను దర్శించుకోవాలి. నివాసానికి ఎక్కడో ఒకచోట గుడిసె వేసుకోవడానికి వీలు లేదు. అద్దె చెల్లించి కిరాయి ఇంట్లో ఉండాలి. రెండు గదుల ఇంటి అద్దె 500 పైనే ఉండగలదు.

ఇంక అప్పులు చేయక గడిచేదెట్లా? ఒక్కొక్క కుటుంబం 50 వేల రూపాయలు పైబడి బాకీపడి ఉంది. పేదలకు జరుగుబాటుకు అప్పులిచ్చే రుణ వ్యవస్థ భారతదేశంలో లేదు కాబట్టి ప్రైవేట్‌గానే అప్పులు తీసుకోవాలి. వడ్డీ నెలకు 3 రూపాయల నుండి 5 దాకా ఉండగలదు. ఇంకా 'బిడ్డ పెళ్ళి' అనే గండం ఎదురయితే కుటుంబం మునిగినట్టే. జంధ్యంతో సహా అగ్రకులాల లక్షణాలు సుమారుగా ఉన్న పద్మశాలీలలో కట్నాలూ ఎక్కువే.

ఈ భారం ఇక మోయలేమనుకున్న వాళ్ళు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. కల్తీకల్లుకు బానిసలయి శరీరం బలహీనపడి పనిచేయలేక, సంపాదించలేక ప్రాణం తీసుకుంటున్నారన్న విశ్లేషణ ప్రభుత్వం చేస్తున్నది. మగవాళ్ళు తమ సంపాదన కల్లు డిపోలకూ బ్రాందీ షాపులకూ అప్పగించడం, స్త్రీలు కష్టంచేసి కుటుంబాలను పోషించడం మన రాష్ట్రంలో పేద వర్గాలలో సర్వత్రా ఉన్నదే. స్త్రీలోక రాజకీయ శక్తి కాలేకపోవడం వల్ల ఇదొక రాజకీయ సమస్య కాలేదు గానీ, అయివుంటే ఇదే ఒక ప్రధాన రాజకీయ సమస్య అయి వుండేది. దీనికి పేదరికంతోనూ, ప్రజలు తాగనిదే ప్రభుత్వం నడవజాలదన్న ఎక్సైజ్ పాలసీతోనూ తప్ప ప్రాంతాలతో కులాలతో సంబంధం లేదు. అయితే పేదలలో కొన్ని ప్రత్యేకమైన వర్గాలలో మాత్రమే మగవాళ్ళు ఆత్మహత్యను పరిష్కారంగా ఆశ్రయించడం జరుగుతున్నప్పుడు దీనిని దానికి కారణంగా చూపించడం అతి తెలివితనం. తాగుడును పెంచడంలో ప్రధాన పాత్ర ఉన్న ప్రభుత్వమే ఈ విశ్లేషణ చేయడం సిగ్గుమాలినతనం కూడ.

చంద్రబాబు పాలనలోనే ఆత్మహత్యలు మొదలుకాగా అతను ఎప్పటిలాగే 'అభివృద్ధి'ని దీనికి పరిష్కారంగా చూపించాడు. సిరిసిల్ల దగ్గర టెక్స్‌టైల్ పార్క్

నెలకొల్పుతామనీ, ఆ తర్వాత నేత కార్మికులకు కావలసినంత పని దొరుకుతుందనీ ప్రకటించాడు. నిజానికి పని దొరకకపోవడం కాదు సమస్య. సిరిసిల్లకు ఇవాళ ఇతర తెలంగాణ జిల్లాల నుండి కూడ కూలీలు వలసపోయి పవర్‌లూంలలో పనిచేస్తున్నారు. జరుగుబాటు కావలసిన ఆదాయం లభించక పోవటం సమస్య. పవర్‌లూం కార్మికులకు ప్రభుత్వం నిర్ణయించిన కనీస వేతనంలో కేవలం నాలుగవ వంతు దక్కుతున్నది. నూలు సరఫరా నుండి బట్ట అమ్మకం దాకా సమగ్రమైన మార్పు రానిదే ఈ స్థితి మెరుగుపడడం సాధ్యం కాదు. కాగా, చంద్రబాబు హామీ యిచ్చిన టెక్స్‌టైల్ పార్కు రానే వచ్చింది. అయితే ఖరీదయిన ఆటోమేటిక్ లూంలతో పట్టుమని పదిమందికి మాత్రమే పని కల్పించే సంస్థలు అక్కడ వెలుస్తున్నాయి. ఇది నిరుద్యోగానికీ పరిష్కారం కాదు, పేదరికానికీ కాదు.

కరీంనగర్‌లో ఈ రావూ ఆ రావూ సవాళ్ళూ, ప్రతి సవాళ్ళూ విసురుకుంటున్న దశలోనే రాష్ట్ర ప్రభుత్వం నేత కార్మికుల ఆత్మహత్యల వల్ల దెబ్బతిన్న కుటుంబాలను ఆదుకోవడానికని చెప్పి 119 నెంబరు గల నష్టపరిహారం జీవోను జారీ చేసింది. మొదట్లో దానిని రాజశేఖరరెడ్డి హయాంలో జరిగిన ఆత్మహత్యలకే పరిమితం చేసినా, ప్రజలు గొడవ చేయగా చంద్రబాబు ఆత్మహత్యలకు కూడ వర్తింపజేశారు. అయితే ప్రజలకు ఏదిచ్చినా – సారాయి, కల్లు తప్ప – మితంగానే ఇవ్వాలనీ, లేకపోతే వాళ్ళు చెడిపోతారనీ నమ్మే అధికార యంత్రాంగం సరిగ్గా సగభాగం ఆత్మహత్యలు జీవో 119 పరిధిలోకి రావని తేల్చి ఆ కుటుంబాలకు నష్టపరిహారం తిరస్కరించింది.

25 వేల 'సాంచాలు'న్న సిరిసిల్లలో తెలంగాణ భావన ఈ పరిస్థితితో నిమిత్తం లేకుండ గులాబిరంగు పార్టీకి వోట్లు తెచ్చి పెడుతుందనుకుంటే పొరబాటే. సిరిసిల్లలో నైనా వేరే ఊళ్ళలోనయినా చదువుకున్న వర్గాలు ఇతరత్రా తమ రాజకీయాలేవయినా ఈసారి తెలంగాణకు వోటేసి తెలంగాణ పరువు కాపాడాలని నిర్ణయించుకున్నట్టు స్పష్టంగానే కనిపిస్తున్నది. కానీ పేదవర్గాల మాట కూడ అదే అవుతుందా? 'ఆ సైకిలోడే మంచోడు. ఒక్కసారయినా మా తానికొచ్చి చూసిపోయిండు, ఈ కారోడు ఒక్కసారి కూడ రాలే'దన్న ఒక మృత కార్మికుడి భార్య అభిశంసన కెసిఆర్ చెవిన పడుతుందా?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*12 నవంబరు 2006*

# అయ్యవార్లు మూడు రెట్లు పౌరులా?



**రా**ష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ (శాసనమండలి) ఎన్నికలు ఫిబ్రవరిలో జరగనున్నాయి. అదనపు ఓటుహక్కు లభించిన ప్రజాప్రతినిధులు, పట్టభద్రులు, అధ్యాపకులు హడావుడిగా నామినేషన్లు వేసుకుంటూ, ప్రచారం చేసుకుంటూ తిరుగుతున్నారు. తక్కిన ప్రజానీకానికి ఈ ఎన్నికల్లో ఓటుహక్కు లేదు కాబట్టి అది వాళ్ళకేమీ పట్టని విషయం అయింది.

ఇతర ప్రజానీకానికి ఈ ఎన్నికల్లో ఓటుహక్కు ఎందుకు లేదు?

అన్ని స్థాయిల్లో జరిగే అన్ని ఎన్నికల్లోనూ దళితులకూ, ఆదివాసులకూ ఉండే రిజర్వేషన్లు శాసనమండలిలో ఎందుకు లేవు?

'ప్రతి మనిషికీ ఒకే ఓటు' అనేది పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని ప్రాథమికమైన సమానత్వ సూత్రం కాగా, ప్రజా ప్రతినిధులకూ, పట్టభద్రులకూ శాసనసభనూ శాసనమండలినీ కలుపుకొని రెండు ఓట్లు, అయ్యవార్లకయితే మూడు ఓట్లు ఎందుకిస్తున్నారు? వాళ్ళు రెండు రెట్లు, వీళ్ళు మూడు రెట్లు పౌరులా?

నిత్య జీవితంలో జరిగే అన్యాయాలను ప్రజలందరూ గ్రహించగలుగుతారు. కానీ చట్టాలలో, విధాన ప్రవచనాలలో ఉన్న అన్యాయాలను చదువుకున్న వాళ్ళు, ప్రజాప్రతినిధులు మాత్రమే సులభంగా గ్రహించగలుగుతారు. వారు చెప్తేనే ప్రజలు తెలుసుకుంటారు. చదువుకున్న వాళ్ళకూ, ప్రజా ప్రతినిధులకూ ప్రత్యేక హక్కులు కల్పించే చట్టాల గురించి ఎవరు మాట్లాడాలి? వారి స్వప్రయోజనం కోసం వారు గంభీర మౌనం పాటిస్తారు. తక్కిన ప్రజానీకానికి ఎక్కడో ఏదో లోపం ఉందని తోచినా

వివరాలు తెలియకపోవడం వల్ల తప్పనిసరై మౌనం పాటిస్తారు. ఆ అన్యాయం అన్యాయంగా ఉండిపోవలసిందేనా?

శాసనమండలిని ఇంగ్లీష్ వాడి పరిభాషలో 'ఎగువ సభ' అంటారు. అది చట్టాలు చేయదు కానీ చట్టాలు చేసే శాసనసభను (దిగువ సభను) పర్యవేక్షిస్తుంది. శాసనసభ ఆమోదించిన చట్టాలను పరిశీలించి తన అభిప్రాయాలు, సూచనలు తెలుపుతుంది. ఈ అభిప్రాయాలకు ఏ విలువా లేదనుకుంటే శాసనమండలి అనేది ఉండడమే అనవసరం కాబట్టి, వాటికి ఏదో విలువ ఉందనే ఆ వ్యవస్థను రూపొందించారని భావించవలసి ఉంటుంది. మరి అటువంటి వ్యవస్థలో రిజర్వేషన్లు ఉండవు, ఓటు హక్కు కొద్దిమందికే ఉంటుంది అంటే అర్థం చట్టాలు చేసే అధికారాన్ని ప్రజాస్వామీకరించినా, దానిని పర్యవేక్షించే అధికారాన్ని ప్రధానంగా శిష్టవర్గాలకు పరిమితం చేయాలన్న అప్రజాస్వామికమైన ఆలోచనను వ్యవస్థీకరించడం కాదా? అన్ని విషయాలలోనూ గొంతు చించుకునే మేధావి వర్గమూ, రాజకీయ వర్గమూ తమకిద్దరికీ పెద్దపీట వేసే ఈ వ్యవస్థ పట్ల మౌనం పాటించడమే కాక దానిలో స్థానం కోసం ఎవరికి వారు ఆరాటపడడం విచిత్రంగా లేదూ?

శాసనమండలికి ఉండే ఈ అప్రజాస్వామిక స్వభావం రాజ్యాంగంలోనే రచించబడ్డ మాట వాస్తవమే. 'ప్రతి మనిషికీ ఒకే ఓటు ఇచ్చాం – ప్రతి మనిషికీ ఒకే విలువ ఉండే సమాజానికి ఇది సాధనం కావాలి' అని బాబాసాహెబ్ అంబేద్కర్ భారత రాజ్యాంగం నైజాన్ని వివరిస్తూ చేసిన వ్యాఖ్యానానికి, శాసనమండలి రూపంలో కొందరికి రెండు ఓట్లు, కొందరికి మూడు ఓట్లు కల్పించిన ఆర్టికల్ 171 అభావం అనేది కూడ వాస్తవమే. అయితే దీనిని రాజ్యాంగంలోని అప్రజాస్వామిక లక్షణాలలో ఒకటిగా గుర్తించడం సబబుగా ఉంటుంది తప్ప, రాజ్యాంగంలోనే ఉంది కదా అంటూ వెనకేసుకు రావడం తగదు.

చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే రాజ్యాంగం తొలి ముసాయిదాలో శాసనమండలి ప్రస్తావన మరీ ఇంత అప్రజాస్వామికంగా లేదు. బి.ఎన్. రావు తొలి రచన చేసి, అంబేద్కర్ సారథ్యంలోని డ్రాఫ్టింగ్ కమిటీ తుదిరూపం ఇచ్చిన రాజ్యాంగం ముసాయిదాలోనూ శాసనమండలి ప్రస్తావన ఉంది. అయితే అందులో అధ్యాపకులకూ, మేధావి వర్గానికీ పెద్దపీట వేయలేదు. శాసనమండలిలో కొన్ని సీట్లను ప్రజాప్రతినిధులు

(పంచాయతీ స్థాయి నుండి అసెంబ్లీ స్థాయి దాకా ఎన్నికైన వారు) ఎన్నుకుంటారని, కొన్నిటిని రాష్ట్ర గవర్నర్ తన నియామకం ద్వారా నింపుతారని మాత్రమే అన్నారు. తక్కిన సీట్ల ఎన్నిక లేక ఎంపిక ఏ విధంగా జరుగుతుందో చెప్పలేదు గానీ ఎవరిని ఎంపిక చేయాలో మాత్రం సూచించారు. వ్యవసాయ రంగం, పారిశ్రామిక రంగం, విద్యారంగం, కార్మిక రంగం, సాంకేతిక రంగం, కళారంగం, సాహిత్య రంగం మొదలైన సకల సామాజిక రంగాలతో సన్నిహిత పరిచయం ఉన్న నిపుణులను ఎన్నుకోవాలని అన్నారు. వివిధ సామాజిక రంగాలలో నైపుణ్యంగల వారు శాసనసభ చేసే చట్టాలను పర్యవేక్షించి సలహాలూ, సూచనలూ ఇవ్వడం ఉచితంగా ఉంటుందన్నది దీని వెనుక ఉన్న ఆలోచన కావచ్చు. ఈ ముసాయిదాలో కూడ రిజర్వేషన్లు లేవు.

కానీ రాజ్యాంగానికి తుదిరూపం ఇచ్చే నాటికి ఇది మారిపోయింది. రాజ్యాంగ పరిషత్ సభ్యులలో ఒక్క జయప్రకాశ్ నారాయణ్ మాత్రమే శాసనమండలి ఉండనే వద్దన్నాడు. మిగిలిన వాళ్ళు దానికి మరింత అప్రజాస్వామిక రూపం ఇచ్చారు. ఎవరిని ఎన్నుకోవాలనేది తీసేసి ఎవరు ఎన్నుకుంటారనేది చేర్చారు. రాజ్యాంగం ముసాయిదాలోనే ప్రజాప్రతినిధులకు కల్పించిన ఓటుతోపాటు పట్టభద్రులకూ, అధ్యాపకులకూ ఓట్లు కల్పించారు. వారు ఎవరినైనా ఎన్నుకోవచ్చునన్నారు. గవర్నర్ అంటే రాష్ట్ర ప్రభుత్వమే కాబట్టి ఇది రాష్ట్ర ప్రభుత్వానికి ఇచ్చిన 'హక్కు'. ఈ నియామకాలు కళాసాహిత్య వైజ్ఞానిక రంగాలలోనూ, సహకార రంగంలోనూ, సామాజిక సేవలోనూ ప్రత్యేక ప్రవేశం లేక అనుభవంగల వారి నుంచి చేయాలని మాత్రం అన్నారు. ఏ పాలక పార్టీలోనైనా కళాపోషకులకూ, సంఘ సేవకులకూ కొదవలేదు కాబట్టి వారి 'హక్కు'కు ఈ షరతేం అడ్డం రాదు.

ఈ విషయంలో రాజ్యాంగం పేర్కొన్న ఒకే ఒక్క మంచి సంగతి ఏమిటంటే ఏ రాష్ట్ర శాసనసభైనా 2/3 మెజారిటీతో తమకు శాసనమండలి అక్కరలేదని తీర్మానిస్తే పార్లమెంటు తదనుగుణంగా చట్టంచేసి తీసేస్తుందని. అయితే మళ్ళీ ఆ రాష్ట్ర శాసనసభ తమకు కావాలని 2/3 మెజారిటీతో తీర్మానంచేస్తే అది తిరిగి వస్తుంది. మన రాష్ట్ర శాసనమండలిని ఈ ప్రకారంగా ఎన్.టి. రామారావు తీసేయిస్తే, రాజశేఖరరెడ్డి (ప్రతిపక్షాల సహకారంతో) తిరిగి తెచ్చాడు. అప్పట్లో ఎన్.టి. రామారావు ఆ పని చేయడానికి శాసనమండలి కాంగ్రెస్ పార్టీకి అనుకూలంగా ఉండడం కారణం

కావచ్చును గానీ, అతను చేసిన కొద్ది మంచి నిర్ణయాలలో ఇదొకటి. అధికారదాహం శాసనసభతో తీరని పార్టీలన్నీ కలిసి దానిని తిరగదోడాయి.

## ప్రజాస్వామికమైన 'రెండవ సభ' సాధ్యం కాదా?

రెండవ సభ ఉండనే వద్దని మా అభిప్రాయం కాదు. నిజానికి ఒక చారిత్రక దశలో చట్టసభల ప్రాతినిధ్య స్వభావాన్ని గురించి చాలా చర్చ జరిగింది. ఎక్కువ భాగం చట్టసభల ఎన్నికలు ప్రాదేశిక నియోజకవర్గాల ప్రాతిపదికన జరుగుతాయి. అంటే 'ప్రజా ప్రతినిధులు' ఒక ప్రాంతానికి ప్రతినిధులుగా ఉంటారు. అయితే ఒక ప్రాంతంలో లేక భూభాగంలో నివసించే ప్రజలకు కొన్ని ఉమ్మడి సమస్యలు ఉన్నప్పటికీ సామాజిక, ఆర్థిక వర్గాల ప్రాతిపదికన భిన్న ప్రయోజనాలూ ఉంటాయి. కాబట్టి ప్రాదేశిక నియోజకవర్గాలతోబాటు, సామాజిక ఆర్థిక వర్గాలను నియోజకవర్గంగా గల రెండవ సభ ఉండడం ఉచితంగా ఉంటుందన్న చర్చ పందొమ్మిదవ శతాబ్దంలోనూ, ఇరవయ్యవ శతాబ్దపు ప్రథమార్థంలోనూ చాలా జరిగింది. ఇది పర్యవేక్షక అధికారం ఉండే 'ఎగువ సభ' కాదు. శాసనాధికారం ఉండే రెండవ సభ. ఈ ఆలోచనకు రూపం ఇచ్చేటట్టయితే కేవలం పట్టభద్రుల నియోజకవర్గాలు, అధ్యాపకుల నియోజకవర్గాలే కాక అంతకంటే పెద్ద సంఖ్యలో రైతు నియోజకవర్గాలు (అయ్యవార్ల జనాభా కంటే వ్యవసాయదార్ల జనాభా చాలా ఎక్కువ కాబట్టి), వ్యవసాయ కూలీల నియోజకవర్గాలు, పారిశ్రామిక కార్మికుల నియోజకవర్గాలు, వృత్తి పనులవారి నియోజకవర్గాలు వగైరా ఉండాలి. అందులో శాసనసభలో ఉన్నట్టే రిజర్వేషన్ ఉండాలి. సామాజిక వర్గీకరణ ప్రాతిపదికన దళిత కులాల నియోజకవర్గాలు, బి.సి కులాల నియోజకవర్గాలు, స్త్రీల నియోజకవర్గాలు, మైనారిటీ మతాల నియోజకవర్గాలు, ఆదివాసీ నియోజకవర్గాలు వగైరా ఉండాలి. ఇటువంటి శాసనమండలిని రూపొందించి శాసనసభతో సమాన అధికారం కల్పించినట్టయితే అభ్యంతరం ఉండనక్కరలేదు గానీ ప్రజా ప్రతినిధులకూ, పట్టభద్రులకూ, అధ్యాపకులకూ ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించి, పాలక పార్టీకి నియామకం పేరిట కొన్ని సీట్లు నింపే అధికారం కల్పించి, అందులో కనీసం ఎస్.సి, ఎస్.టి రిజర్వేషన్ కూడ ఇవ్వని శాసనమండలి ఏ రకంగా ప్రజాస్వామికమైనది? చదువుకున్న వాళ్ళంతా దానిలో సభ్యత్వం కోసం ఉవ్విళ్ళూరుతుండడాన్ని ఏమనాలి?

*మానవహక్కుల వేదిక కరపత్రంగా వచ్చింది*
*1 జనవరి 2007*

# ప్రజాస్వామ్య వ్యవస్థ,
# అప్రజాస్వామిక రాజకీయాలు



ప్రజాస్వామ్య రాజకీయాలకు తగిన ప్రజాతంత్ర స్వభావం గల మాటతీరు, నడవడిక అలవరచుకోవడానికి నాయకులు గతంలో ప్రయత్నించేవారా? వేరే విషయాలలో ఎట్లాగున్నా రాజకీయాలలో గతమే గొప్ప అని అనుకోవడం జరుగుతున్నది కాబట్టి ఒకప్పుడు ఆ ప్రయత్నం చేసేవారనీ, ఈ తరంలోనే అది నశించిందనీ అనేవారు బహుశా చాలామందే ఉంటారు. ఇది ఎంత నిజమో తెలీదు. గత కాలపు నాయకులు దృశ్య మీడియా లేకపోవడం వల్ల బతికిపోయారేమో. అహంభావాన్నీ వెకిలితనాన్నీ బుద్ధిమాంద్యాన్నీ టీవీ కెమెరాల ముందు దాచడం కష్టం.

రాజకీయ నాయకులు ఎక్కువగా భూస్వామ్య స్వభావంగల పెత్తందారీ కులాల నుండి రావడంవల్ల మన రాజకీయ సంస్కృతికి ఫ్యూడల్ వాసన బలంగా అంటుకుంది. గతంలోనూ ఇంతకంటే భిన్నంగా ఉండి ఉంటుందనుకోను. టంగుటూరు ప్రకాశం పంతులు, విజయభాస్కరరెడ్డి, చెన్నారెడ్డి వారి వారి సామాజిక పునాదుల నుండి వచ్చిన 'పెద్దరికాన్ని' తరచుగా ప్రదర్శించేవారనీ, ఇతరులు నోరునొక్కుకొని భరించే వారనీ వింటుంటాం. అయితే ఆ ఉదంతాలు చేసిన వారికే తెలుసు. ఇప్పుడు టీవీ కెమెరాల పుణ్యాన అందరూ తెలుసుకోగలరు. ఆయా ప్రాంతాల రాజకీయ సంస్కృతితో పరిచయం ఉన్నవారు ఆ ప్రవర్తన వెనకున్న అభిజాత్యాన్ని గుర్తించగలరు. కల్వకుంట్ల చంద్రశేఖరరావు ఉపయోగించే పరుష పదజాలం తరచుగా వివాదాలకు దారితీస్తున్నది. అది తెలంగాణ భాష అని ప్రాంతీయ అభిమానం చాటున దాక్కోవడానికి అతను

ప్రయత్నం చేస్తున్నప్పటికీ కరీంనగర్ వెలమ దొరల సంస్కృతితో పరిచయం ఉన్న వారికి దాని మూలం ఏమిటో తెలుసు.

తెలంగాణకు చెందిన సీనియర్ కాంగ్రెస్‌వాదులకు ఆ పార్టీ అధ్యక్షురాలు కనీసం అపాయింట్‌మెంట్ ఇవ్వకపోవడం మినహాయింపు లేకుండా అందరికీ ఎబ్బెట్టుగా తోచింది. అయితే దాని వెనుక చూడవలసింది సోనియాగాంధీ రాజకీయ సంస్కృతిని కాదు. వై.ఎస్. రాజశేఖరరెడ్డి రాజకీయ సంస్కృతిని. పెద్ద ప్రజాస్వామ్య స్పృహ కాకపోయినా ఏ కొంచెం సామాన్య రాజకీయ విజ్ఞత ఉన్న వ్యక్తయినా, వాళ్ళకు అపాయింట్‌మెంట్ ఇచ్చి ఏవో సాకులు చెప్పి పంపించమని ఆమెకు సలహా ఇచ్చి ఉండేవాడు. వెనక్కిపోయి తమ తమ నియోజకవర్గాల ప్రజలకు చెప్పుకోవడానికి ఒక బహానా ఇచ్చి పంపించమని సలహా ఇచ్చి ఉండేవాడు. కానీ ఫాక్షనిస్టు రాజకీయ బుద్ధికి అట్లా తోచదు. నన్ను కాదనేవాడు అవమానంతో కుళ్ళి చావాలి అని అది భావిస్తుంది. ప్రత్యర్థి అనుభవించే అవమానంతో అది ఆనందం పొందుతుంది. పార్టీ నాశనమైతే కానీ; తెలంగాణ ప్రజలు మరింత దూరమైతే కానీ; కాని నన్ను వ్యతిరేకించే వాళ్ళు మాత్రం తలెత్తుకు తిరగకూడదు. అదే ముఖ్యం.

రాయలసీమ రాజకీయ నాయకులందరూ ఫాక్షనిస్టులు కారు గానీ, ఫాక్షనిస్టు సంస్కృతిలోని ఒకానొక అవాంఛనీయ లక్షణం రాయలసీమ రాజకీయాలలో తరచుగా కనిపిస్తుంది. అది ప్రమాణాలను తేలికగా తీసుకునే వైఖరి. అవినీతి, పక్షపాతం మొదలైన అభియోగాలకు వారు స్పందించే తీరు టీవీలో చూసిన వారికి ఇది కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. రాజకీయాలలో అవినీతి సార్వత్రిక విషయమే గానీ ఇతర ప్రాంతాలకు చెందిన వారు మరీ అంత తొణకకుండా బెణకకుండా ఉండరు. ఆరోపణలకు తేలికగా నవ్వరు. రాజశేఖరరెడ్డి, దివాకరరెడ్డి వంటి వారి ముఖాలలో ఆ తేలిక హాసం టీవీ ప్రేక్షకులు చాలాసార్లు చూసే ఉంటారు.

రాయలసీమకు చెందిన నాయకులే కాదు, 'ఉన్నత' సామాజిక వర్గాల వారందరూ ఈ గుణం ప్రదర్శిస్తారు. 1990–2000 మధ్య కాలం నుండి రాష్ట్రంలో పెద్ద ఎత్తున చేపడుతున్న అభివృద్ధి పనుల కారణంగా రాయలసీమకు చెందిన సివిల్ కాంట్రాక్టర్లు ఇప్పుడు రాష్ట్రమంతటా కనిపిస్తారు. పనులు నాణ్యంగా చేయడం లేదనీ, తప్పుడు లెక్కలు చెప్తున్నారనీ అభియోగాలు ఎదుర్కొన్నప్పుడు వారు స్పందించే తీరు వారి సంస్కృతితో పరిచయం లేని వారికి ఆశ్చర్యం కలిగిస్తుంది. అవినీతిలో వారు

ఇతరుల కంటే అధములని అనలేము గాని ఇతరులు అటువంటి అభియోగాలు ఎదుర్కొన్నప్పుడు సమాధానం చెప్పే ప్రయత్నం చేస్తారు. నిజమో అబద్ధమో ఏదో ఒక సంజాయిషీ ఇచ్చే ప్రయత్నం చేస్తారు. వీళ్ళ తీరు వేరు. ఏం చెప్పుకుంటావో చెప్పుకోపో, ఏం రాసుకుంటావో రాసుకోపో అని దులిపేసుకుంటారు. నీతిమాలిన నడవడికను సహించడం మన సమాజం నేర్చుకుంది గానీ అవినీతి ఆరోపణలను దులిపేసుకొని తిరిగే వైఖరిని సహించడం ఇంకా నేర్చుకోలేదు. తెలంగాణలోని సింగరేణి ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్టులలో కాంట్రాక్టులు చేస్తున్న రాయలసీమ ప్రముఖుల ఈ ప్రవర్తన స్థానికంగా చాలా నిరసనకు దారితీస్తున్నది.

అయితే అభిజాత్యం నుండి, ఫ్యూడల్ అహంకారం నుండి పుట్టిన ఈ రాజకీయ సంస్కృతే కాక పచ్చి అవకాశవాదం, సిగ్గుమాలినతనం కూడ ఇవాళ్టి రాజకీయ సంస్కృతిలో ప్రధానమైనవే. తెలుగుదేశం పార్టీ ఈ గుణాలకు నెలవు. చంద్రబాబు నాయుడు కావడానికి రాయలసీమవాడే గానీ అతని రాజకీయ సంస్కృతి అక్కడిది కాదు. ఈ అరవైఏళ్ళ అభివృద్ధి వల్ల విపరీతంగా ప్రయోజనం పొంది ఇంకా ఇంకా కావాలన్న ఆస్తి దాహం ఉన్న వర్గం తెలుగుదేశం రాజకీయాలకు పునాది. అందులో విభిన్న కులాలవారు ఉన్నప్పటికీ కోస్తాంధ్ర కమ్మవారిది పెద్ద స్థానం. ఈ ఆస్తి దాహం సిగ్గెరుగదు. తెలుగుదేశం రాజకీయాలూ సిగ్గెరుగవు. తొమ్మిది సంవత్సరాల పరిపాలనలో కాదన్న ప్రతి ఒక్కదానినీ ఎన్నికలలో ఓడిపోయిన తెల్లవారి నుండి భుజానికెత్తుకొని రాజకీయ ప్రచారం చేయడం వేరే ఎవ్వరి వల్లా అయ్యేది కాదు. వేరే ఎవ్వరయినా కనీసం ఆరు నెలలు సిగ్గుపడుదురు. అయితే మీడియా యావత్తూ వీరిదే కావడం వల్ల ఈ సిగ్గుమాలినతనం సజావుగా సాగిపోతున్నది. నిన్న నువ్వేమన్నావు? అని అడిగేవారే లేకుండా పోయారు.

చెప్పొచ్చేదేమిటంటే, రాజకీయాలలో విలువల పతనం గురించి తరచుగా మాట్లాడుతుంటాం. లోక్‌సత్తా వంటి సంస్థలైతే ఈ పతనాన్ని గురించి ఆందోళన చేయడమే కార్యక్రమంగా పెట్టుకున్నాయి. అయితే ఈ ప్రచారంలో ఎక్కువ భాగం ప్రజాస్వామ్య వ్యవస్థ ప్రమాణాలు, రాజ్యాంగ విలువలు మొదలైన వాటి నుండి దూరమయిన, లేక అవుతున్న రాజకీయ వ్యవస్థ అనే అమూర్తమయిన విషయమే కనిపిస్తుంది. రాజకీయ వ్యవస్థ పునాదులు ఈ ప్రమాణాలకూ, విలువలకూ దూరమవు తున్నాయి అన్న ఆవేదన వ్యక్తం అవుతుంటుంది. కానీ రాజకీయ వ్యవస్థ పునాదులు

అక్కడ ఎప్పుడూ లేవు. ఆస్తి నుండి, కులం నుండి వచ్చిన అధికారంలోనూ, హోదాలోనూ ఉన్నాయి. ఆ అధికారానికీ, హోదాకూ మన సమాజంలో ఉన్న లక్షణాలు, గుణగణాలే రాజకీయ వ్యవస్థను అంటిపెట్టుకొని ఉన్నాయి. ఆ విషయంలో 60 ఏళ్ళ నాటికీ నేటికీ తేడా లేదు. కొన్ని విలువలూ, కొంత భయం, కొంత లజ్జ అప్పుడు ఉండి ఉండవచ్చు. ఇప్పుడు అవి కూడ లేకుండా పోవచ్చు. ఈ విషయంలో 1975కు ముందు, తరువాత అన్న చర్చ తరచుగా జరుగుతుంది. ముఖ్యంగా రాయలసీమ జిల్లాలలో ఫాక్షనిజం, హింస, దౌర్జన్యాలు రాజకీయాలలోకి ఎప్పటి నుండి ప్రత్యక్షంగా ప్రవేశించాయంటే 1975 తరువాత అంటుంటారు. ఇందిరాగాంధీ ప్రకటించిన 'ఎమర్జెన్సీ' ఈ రకంగా కూడ దేశ రాజకీయాలలో ఒక విభజన రేఖే. స్వతంత్ర భారతంలో మొదటితరం గడిచిపోయి రెండవతరం నాయకులు ముందుకొచ్చిన దశకు అది సంకేతం. రాజకీయాలను శాసించిన సామాజికవర్గాలు అప్పుడూ ఇప్పుడూ ఒకటే. ఆ సామాజిక వర్గాల సంస్కృతే అంతకు ముందూ ఆ తరువాతా కూడ దేశ రాజకీయ సంస్కృతి అని పిలవబడింది. ఒకటే తేడా ఏమిటంటే కొంచెం బిడియం, కొన్ని విలువలు ఉండడం, లేకపోవడం. రాజశేఖరరెడ్డి, చంద్రబాబునాయుళ్ళతో సహా ఇప్పుడు రాష్ట్ర రాజకీయాలను శాసిస్తున్న వారంతా రెండవ తరానికి చెందినవారే.

ఎస్.సి, ఎస్.టి, బి.సిలూ, పేదవర్గాల వారూ అధికారానికి వస్తే అంతా బాగయిపోతుందని నేనంటున్నానని నా మీద దాడిచేయబోతారు. ఇవి అమాయకత్వానికి రోజులు కావు కాబట్టి నేను అంతటి మాట అనడం లేదు. స్వప్రయోజనానికి ఏ విలువలూ అడ్డం రాజాలవన్న అభిప్రాయం ఇప్పుడు దేశ ప్రజా జీవితంలో సార్వజనీనం అయిపోయింది. అయితే ఇప్పుడు మనం చూస్తున్న తీవ్రమైన అహంకార ప్రదర్శన, నోటి దురుసు వాళ్ళొస్తే తగ్గే అవకాశం ఉంది. పదిమందిలో ఒకడిని అనుకునే వారికి సహజంగా ఉండే వినయం కొంతయినా రాజకీయ సంస్కృతిలో ప్రవేశించే అవకాశం ఉంది. ప్రజాస్వామ్యం పేరిట అనేక రకాల తప్పుడు చర్యలు ఇంకా కూడ సహించవలసే ఉంటుందేమో గాని దొరతనాన్నీ పెద్దరెడ్డితనాన్నీ కోట్ల ఆస్తులు కిందేసుకొని కూర్చున్న మోతుబరితనాన్నీ భరించవలసిన అగత్యం నుండి బయటపడే అవకాశం ఉంది.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*14 ఫిబ్రవరి 2008*

# ప్రజాస్వామ్యానికి 'తాయిలాల' తెగులు



ఎన్నికల కోసం పార్టీలు ఇస్తున్న హామీలు చూసిన ప్రజలకు ఈపాటికి ఒక ఆలోచన వచ్చి ఉండాలి. వీళ్ళలో ఏ ఒక్కరిని గెలిపించినా ఉచిత వసతులు కొన్ని మాత్రమే వస్తాయి. ఒకరిని గెలిపిస్తే కలర్ టీవీ, పని చేయకుండా నెల జీతం వస్తాయి. ఒకరిని గెలిపిస్తే మొబైల్ ఫోను, చవకగా ల్యాప్‌టాప్ వస్తాయి. ఒకరిని గెలిపిస్తే వంద రూపాయలకే కనీస అవసరాలు తీరతాయి. అలాంటప్పుడు ఒకరిని మాత్రమే గెలిపించి మిగిలినవన్నీ పోగొట్టుకోవడం ఎందుకు? అందరినీ గెలిపించే మార్గం ఏదీ లేదా అని వాళ్ళు అనుకోవచ్చు. కాని ఎన్నికల సంస్కర్తలేమో 'ఈ అభ్యర్థులెవరూ నాకు వద్దు' అని ఓటు కాగితం మీద సూచించే ఏర్పాటు ఉండాలని ప్రతిపాదిస్తున్నారు. అది ప్రజాస్వామ్యాన్ని పెంపొందిస్తుందని వాళ్ళు భావిస్తున్నారు. వాళ్ళవి పాతబడ్డ ఆలోచనలు. ప్రజాస్వామ్యం ఎవరికి కావాలి – కలర్ టీవీలు, బారణాకు రెండు కిలోల బియ్యం, మొబైల్ ఫోన్‌లు, ఉచిత వేతనం వగైరాలు వచ్చేటట్టయితే! కాబట్టి వోటర్లకు ఇయ్యవలసింది 'ఈ అభ్యర్థులందరూ నాకు కావాలి' అని బ్యాలెట్ పేపర్‌పై సూచించే ఏర్పాటు.

మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలప్పుడు యూరప్‌లోని కొన్ని ప్రజాస్వామ్యాలలో అన్ని పార్టీలూ కలిసి 'జాతీయ ప్రభుత్వాలు' ఏర్పాటు చేసిన సందర్భాలున్నాయి. అధికారం కోసం పార్టీలు పోటీపడడం యుద్ధ సమయంలో మంచిది కాదన్న భావన నుండి ఇది పుట్టింది. అయితే యుద్ధమొచ్చే దాకా ఆగడం ఎందుకు? ప్రజల శ్రేయస్సు

కోసం ఆ పని ఇప్పుడే ఎందుకు చేయకూడదు? తెలుగు జాతీయ ప్రభుత్వం ఏర్పాటుచేసి సంవత్సరన్నరపాటు రాజశేఖరరెడ్డి లేక డి. శ్రీనివాస్, సంవత్సరన్నరపాటు చంద్రబాబు లేక కేసిఆర్ ఇంకో సంవత్సరన్నరపాటు చిరంజీవి లేక అతని కుటుంబ సభ్యులలో ఒకరు ముఖ్యమంత్రులుగా వుండి, మిగిలిన ఆరునెలలు రాష్ట్రపతి పాలన పెట్టుకొని ఈ అయిదేళ్ళలో వచ్చే సివిల్ కాంట్రాక్టులను అందరూ సమంగా పంచుకోవాలని (అసలు గొడవ అదే కాబట్టి) అంగీకరిస్తే ప్రజలు చాలా సౌఖ్యాలు పొందారా?

అయితే, ఆలోచనాపరులయిన ప్రజలకు ఒక సందేహం వచ్చే ఉంటుంది. వీళ్ళిస్తున్న హామీలకు పైసలు ఎక్కడ నుండి వస్తాయి? చిన్న పైసలు కాదు, వేల కోట్లు కావాలి. చంద్రబాబు ఇస్తున్న హామీలకు రాష్ట్ర బడ్జెట్ చాలదు, దేశ బడ్జెట్ కావాలని రోశయ్య ఎద్దేవా చేశారు. అది వారి పార్టీకీ వర్తిస్తుంది. వారి అభిమాన నాయకులు అపారమైన కరెంటు అనంతంగా ఉచితంగా దొరకబోతుందన్నట్లు తెలంగాణలోను రాయలసీమలోను ఎడాపెడా కట్టేస్తున్న భారీ ఎత్తిపోతల ప్రాజెక్టులన్నీ పూర్తయి ఆ కరెంటు ఖర్చు ప్రభుత్వం భరించి రైతులకిచ్చే రోజు వచ్చినప్పుడు ఈ రాష్ట్ర బడ్జెట్ వారికీ చాలదు.

అయితే ఇది నవ్వుకునే విషయం కాదు. ఎన్నికల ప్రచారంలో మనం వింటున్న ఉచిత హామీలన్నీ వీరు నిజంగానే ఇవ్వగలరు. అయితే దానికోసం దేనిని తాకట్టు పెడతారన్నది ఆందోళన చెందవలసిన విషయం. చాలా ఏళ్ళ కింద మా మిత్రుడొకడు విజయవాడలో సూర్యారావుపేట మునిసిపల్ కౌన్సిలర్ పదవికి పోటీచేస్తూ 'ఈ వార్డులో దోమలు లేకుండా చేస్తాను' అంటూ కరపత్రం వేసి పంచినప్పుడు ఒక్క వార్డులో దోమలు లేకుండా ఎట్లా చేస్తారని అందరూ అతనిని ఆటపట్టించారు. ఇవి అటువంటి అసాధ్యమైన హామీలు కావు. వీటి వెనుక ఒక విధానపరమైన ఆలోచన ఉంది. అది అన్ని పార్టీలకూ సామాన్యమైనది. అత్యంత దుర్మార్గమైనది.

రాష్ట్రంలోకి కార్పొరేట్ కంపెనీల పెట్టుబడులను భారీగా ఆహ్వానించాలి. పెట్టుబడులు పెట్టడానికి ప్రజల జీవిత వనరులయిన భూమి, నీరు, అడవులు, గాలి వారికి అప్పగించాలి. వనరులకు దూరమయి బతుకుతెరువు కోల్పోయిన ప్రజలకు ఇక్కడా అక్కడా పునరావాస కాలనీలు కట్టిచ్చి వారి కర్మకు వారిని వదిలేయాలి. ఈ

క్రమంలో రాష్ట్రంలోకి వచ్చే పెట్టుబడులలో నాయకులు వారి వారి పద్ధతులలో వాటా పొందాలి. అదే సమయంలో ఈ వనరుల అప్పగింత నుండి ప్రభుత్వానికి వచ్చే ఆదాయంతో ప్రజల నోళ్ళు మూయించే ఉచిత వసతులు వారి ముఖాన కొట్టాలి. అయితే ఆ ఉచితాలు ధనవంతుల వ్యాపారాలకు ఎక్కడా అడ్డం రాకూడదు.

ప్రజలకు నిజంగా ఉచితంగా కావలసింది విద్య, వైద్యం. ఆ రెండూ మాత్రం ఏ పార్టీ హామీల జాబితాలోను లేవు. ఎందుకంటే అవి రెండూ ఇప్పుడు రాష్ట్రంలో పెద్ద వ్యాపారాలు. అన్ని పార్టీల ప్రముఖులకూ (సిపిఐ, సిపిఎంలతో సహా) ఈ వ్యాపారాలలో పెద్ద వాటా ఉంది.

వేరే ఏవీ ప్రజలకు ఉచితంగా ఇయ్యవద్దనీ, ఇస్తే ఆర్థిక వ్యవస్థ దెబ్బ తింటుందనీ వాదించడం లేదు. మానవీయమైన జీవన ప్రమాణం మనుషులందరి హక్కు అనీ, సమాన అభివృద్ధి అవకాశాలు అందరి హక్కు అనీ భావించేటప్పుడు అవి కొరవడిన మేరకు ప్రభుత్వం సబ్సిడీలు ఇవ్వడం అవసరం. కానీ ఆ జీవన ప్రమాణం అందుబాట్లోకి ఉండడానికి మొదటి అవసరం జీవనానికి అవసరమయిన వనరులు ప్రజలకు అందుబాట్లో ఉండడం. భూమి, నీరు తదితర ప్రకృతి వనరులు నాగరికత తొలినాటి నుండి ప్రజలకు జీవనాన్ని ఇచ్చాయి. వాటిని ప్రజల కోసం బాగుచేయడం ద్వారా ఆ జీవనాన్ని మెరుగుపరచడం ప్రజాస్వామికమైన అభివృద్ధి విధానం అవుతుంది. పరిశ్రమల కోసం, పారిశ్రామిక అవసరాల కోసం వాటిని తీసుకోవలసి వస్తే అది పరిమితంగానే జరగాలి. దానివల్ల జీవనాన్ని కోల్పోయిన వారికి ఎక్కడికక్కడ కేవలం నివాస కాలనీలు కాదు జీవన పునరావాసం సమగ్రంగా కల్పించాలి. ఇటువంటి అభివృద్ధి నమూనానే పాటించినా ఎప్పటికప్పుడు ప్రజలకు అందే జీవన ప్రమాణంలో హెచ్చుతగ్గులుంటాయి కాబట్టి చవక బియ్యం, చవక కరెంటు తదితరాల ఆవశ్యకత ఉంటుంది. అంతేకాని జీవన వనరులన్నీ పెట్టుబడికి ధారాదత్తం చేసి నాయకులూ, వారి పుత్రపౌత్ర గణం దాని గొడుగు కింద చేరి కోట్లు దండుకొని, ఈ క్రమంలో ప్రభుత్వానికి  వచ్చే క్రయ ఆదాయం నుండి, పన్నుల నుండి ప్రజలకు ఇదీ అదీ ఉచితంగా ఇచ్చి నోరు మూయించడం దుర్మార్గమైన ఆలోచన. ప్రతిరోజూ రోడ్‌షోలలో ఒకరి మీద ఒకరు దుమ్మెత్తి పోసుకుంటున్న ఈ పార్టీలన్నిటి ఉమ్మడి ఆలోచనా ఇదే.

ప్రజలకీ విషయాలు చూచాయగానయినా అర్థం కాకపోలేదు గానీ ఈ విమర్శను ప్రజాహిత రాజకీయాలలో భాగం చేయగలిగినట్టి రాజకీయశక్తి ఏదీ రాష్ట్రంలో లేకుండా పోయింది. కమ్యూనిస్టు పార్టీలకు ఈ విషయం సులభంగానే అర్థం కావాలి గానీ వారి రాజకీయ అజెండా తమకున్న పిడికెడు సీట్లను కాపాడుకునే ఎత్తుగడల చుట్టూ తిరుగుతున్నది తప్ప వేరే దేనికీ అందులో ప్రాధాన్యం లేదు. పోనీ ఈ అజెండా ఎన్నికల సమయానికి పరిమితమైనదా అంటే కాదు. ఈ ఎన్నికలయిపోతే పంచాయతీ ఎన్నికలుంటాయి. అవి అయిపోతే మునిసిపాలిటీ ఎన్నికలుంటాయి. ఎక్కడికక్కడ 'ప్రాతినిధ్యాన్ని' కాపాడుకోవడానికి పాలకపార్టీలలో ఒకరిని దుర్మార్గులుగా, ఒకరిని ప్రజానుకూలురుగా చూపించి సర్దుబాట్లు చేసుకునే ఆరాటంలో సూత్రబద్ధమైన రాజకీయాలకు చోటు కరువయ్యింది. షో కావాలంటే ఎర్రచొక్కాలు వేసుకుని టీవీ కెమెరాల ముందు అరగంటసేపు భూపోరాటాలు చేస్తే సరిపోతుందనే స్థాయికి వచ్చాయి వామపక్ష రాజకీయాలు.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*22 మార్చి 2009*



# ఇ.సి అధికారాలు అపరిమితమా?



ఎన్నికల సక్రమ నిర్వహణ కోసమని చెప్పి ఎన్నికల అధికారులు జారీచేస్తున్న అదేశాలకు సమాజంలో అందరూ కిమ్మనకుండా తల ఒగ్గడం కొంచెం ఆశ్చర్యం కలిగిస్తున్నది. నీకేం అధికారం ఉంది అని ఎవ్వరూ దానిని అడగడం లేదు. రాష్ట్ర డి.జి.పిని మార్చి ఫలాన అధికారినే నియమించమన్నా, కలెక్టర్ల లిస్టిచ్చి వీళ్ళందరినీ బదిలీ చేసేయమన్నా, గోడల మీద రాయొద్దన్నా, బ్యానర్లు కట్టొద్దన్నా, ఇచ్చిన ఉపన్యాసం ఇంక చాలు స్టేజి దిగిపొమ్మన్నా మనసులో గొణుక్కుంటున్నారేమో గానీ అమలు చేసేస్తున్నారు. ఇ.సితో గొడవపెట్టుకుంటే అనర్హత ప్రకటిస్తుందేమోనన్న భయం అభ్యర్థులలో ఉన్నట్టయితే వాళ్ళకు ఏ చట్టమూ తెలియనట్టే ఎన్నికల చట్టాలూ తెలియవని అనుకోవాలి. అంతటి అధికారం ఇ.సి కేం లేదు.

అభ్యర్థుల సంగతి పోనీయండి. ఎన్నికల అధికారులు ఒక నెల, నెలన్నర రోజులపాటు చలాయించే ఈ ఎదురులేని అధికారానికి సమాజంలో చాలా ఆదరణ ఉందన్న విషయం ఆశ్చర్యం కంటే ఎక్కువ ఆందోళన కలిగిస్తుంది. అక్రమాలను ఒక్క వేటుతో అరికట్టే బలవంతుడొకడు రావాలన్న అత్యంత అప్రజాస్వామిక ఆకాంక్ష మన మనస్సులలో ప్రగాఢంగా ఉన్నట్టుంది. సినిమా వాళ్ళు దీనిని బాగా వాడుకున్నారు. నిజ జీవితంలో జడ్జీలు అప్పుడప్పుడు ఈ పాత్ర పోషిస్తుంటారు. అయితే జడ్జీలిచ్చే తీర్పులు అనేక న్యాయసూత్రాలకూ నియమాలకూ లోబడి ఉండక తప్పదు కాబట్టి వాళ్ళు అన్ని సందర్భాలలోనూ దుర్మార్గుల తలలు తక్షణం నరికేసి మనల్ని సంతృప్తి పరచలేరు. ఎన్నికల కమిషన్‌కు స్థూలమైన అధికారాలే తప్ప నిర్దిష్టమైన నియమాలు

(ఎక్కువగా) వర్తించవు కాబట్టి వారు చేయగలరు. మనం మన ఊరి ఎస్పైని అతగాడెంత చెడ్డవాడయినా చచ్చినా బదిలీ చేయించలేం. కోర్టులు కూడ ఎప్పుడో తప్ప చేయించవు. ఎన్నికల కమిషన్ చూడండి. ఎస్పైని కాదు డి.జి.పినే ఫిర్యాదు అందిన వారంరోజులలో బయటకు పంపించి అధికార పార్టీకి ఇష్టంలేని అధికారిని ఆ కుర్చీలో కూర్చోబెట్టింది. సత్తా అంటే అట్లా ఉండాలి అనుకోని వారు ఉండరు.

ప్రజాస్వామ్యం పట్ల సూత్రబద్ధమైన అభిమానం ఉన్న వారెవరికయినా ఇ.సికి నిజానికి ఇంత అధికారం ఉందా, ఎట్లాగుంది, ఎందుకుంది అన్న సందేహం వచ్చి ఉండాలి. ఎవ్వరికీ రాకపోవడం ఆందోళన కలిగించే విషయం. కొంతమేరకు దీనిని సానుభూతిగా అర్థం చేసుకోవచ్చు. చట్టబద్ధ పాలన అనేది భ్రష్టుపట్టించగల వాడి చేతిలో ఆటబొమ్మ కాగలదు. అది న్యాయం చేస్తుందని – ఇప్పుడందరూ అనడం నేర్చుకున్నట్టు చట్టం తన పని తాను చేసుకుపోతుందని – ఎదురు చూసి చూసి విరక్తి చెందగలం. ప్రస్తుతానికి వర్తించే ఒక ఉదాహరణ చెప్పుకుందాం. మీరు రాష్ట్రంలో ఏ ఊరికైనా పోయి బెల్టు షాపుల గురించి అడగండి. అన్నీ ఎన్నికల నోటిఫికేషన్ విడుదలయిన రెండవ రోజే మూతపడ్డాయని వింటారు. తన పని తాను చేసుకుపోయే చట్టం వాటినన్నింటినీ కాదు, వాటిలో ఒక్క దానిని సహితం అయిదేళ్ళలో మూతవేయించలేక పోయింది. 'ఇసి' రంగంలోకి దిగిన రెండవ రోజున మాత్రం అన్నీ మూతపడ్డాయి. పైగా అదే పోలీస్ శాఖ, అదే ఎక్సైజ్ శాఖ వాటిని మూత వేయించాయి. విరక్తి చెందిన వారికి ఇది ఆనందం కలిగించదూ?

అయితే విసుగు నుంచి, విరక్తి నుంచి పుట్టే అన్ని అభిప్రాయాలలాగ ఈ ఆమోదం కూడ సందేహాస్పదమైనదే. కాదంటే ఐ.వి. సుబ్బారావుగారికి ఈ నెలన్నర సుల్తాన్‌గిరీ ఎందుకు, పన్నెండు నెలలూ ఇచ్చేద్దామా? ఆ ప్రశ్న వేసుకోగానే మనం ఇప్పుడిస్తున్న ఆమోదం గురించి అనుమానం రావాలి. రానట్టయితే ఒక పోలిక చెప్పుకుందాం. ఒక మునిసిపాలిటీని నడిపే అధికారుల చర్యలకు వర్తించే వివరమైన చట్టమేదీ లేకుండా, మునిసిపాలిటీని నిర్వహించడానికి అవసరమైన సకల అధికారాలు మునిసిపల్ కౌన్సిల్ కలిగి ఉంటుంది అన్న ఒక వాక్యం రాజ్యాంగంలోనో వేరొక చట్టంలోనో రాసి మనమీద పడేశారనుకోండి. అప్పుడెట్లాగుంటుందో ఒకసారి ఆలోచించండి.

ఎన్నికల కమిషన్‌కు ఉండే అధికారం అట్లాంటిదే. ఎన్నికల ప్రక్రియ నిర్వహణ, పర్యవేక్షణ, నియంత్రణ ఎన్నికల కమిషన్ బాధ్యతలుగా ఉంటాయి అని మాత్రమే రాజ్యాంగంలోని ఆర్టికల్ 324 నాలుగు పొడి మాటలలో అంటుంది. దానికోసం ఎన్నికల కమిషన్ ఏం చేయొచ్చు, ఏం చేయకూడదు అని రాజ్యాంగం చెప్పదు. 'ఎన్నికలు ప్రశాంతంగా, స్వేచ్ఛగా, నిష్పాక్షికంగా జరగడానికి అవసరమైన అన్ని ఆదేశాలూ జారీచేసే అధికారం ఎన్నికల కమిషన్‌కు ఆర్టికల్ 324 ఇచ్చిన అధికారం రీత్యా ఉంది' అని సుప్రీంకోర్టు 1986లో జారీచేసిన ఒక తీర్పులో అనింది. ఆ అధికారాలను క్రోడీకరించి వాటికి లిఖిత రూపం ఇచ్చే అధికారం ఆర్టికల్ 329 పార్లమెంటుకిచ్చింది గానీ పార్లమెంటు ఆ అధికారాన్ని పరిమితంగా మాత్రమే వాడుకుంది. పార్టీల చిహ్నాలు, అభ్యర్థుల నామినేషన్లు, ఎన్నికల అక్రమాల నిర్వచనం, నియోజకవర్గాల డీలిమిటేషన్, ఎన్నికను సవాలు చేసే వ్యాజ్యాలు తదితర విషయాల గురించి చట్టాలు చేసింది గానీ ఎన్నికలను ప్రశాంతంగా, స్వేచ్ఛగా, నిష్పాక్షికంగా నిర్వహించడానికి ఎన్నికల కమిషన్ ఎటువంటి ఆదేశాలు జారీచేయవచ్చో చెప్పే చట్టమేదీ పార్లమెంటు ఇప్పటిదాకా చేయలేదు. అందువల్ల రాజ్యాంగం ఎన్నికల కమిషన్‌కు ఇచ్చిన అధికారం అపరిమితంగానే ఉండిపోయింది.

చాలా ఏళ్ళు దీనిని కేంద్ర ఎన్నికల కమిషన్ పెద్దగా వాడుకోలేదు గానీ, 1990ల తొలి సంవత్సరాలలో దేశ ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా ఉండిన టి.ఎన్. శేషన్ నియామకంతో పరిస్థితి మారింది. అప్పటి నుంచి ఎన్నికల కమిషన్ రాజకీయ రౌడీలను అదుపుచేసే హీరో అయింది. దీనికి ఆద్యుడయిన శేషన్ ఎంతమాత్రం ప్రజాతంత్రవాది కాడు. రిటైరయిన తరువాత ఏ ప్రజాతంత్ర విలువనూ, నియమాన్నీ గౌరవించని శివసేన టిక్కెట్‌తో రాజ్యసభకు పోటీచేశాడు. రిటైర్ కాకముందే ప్రధాన ఎన్నికల కమిషనర్‌కు మిగిలిన ఇద్దరు ఎన్నికల కమిషనర్‌లు లోబడి ఉండాలనీ, వారు స్వతంత్రులు కారనీ సుప్రీంకోర్టులో వ్యాజ్యం నడిపి ఓడిపోయాడు. అతని చేత ఎన్నికల కమిషన్ అధికారాలను విస్తరింపజేసింది అతని అధికార దాహమా లేక ప్రజాస్వామ్యం మీద ప్రేమా అంటే సందేహమే. అతను 1991లో జారీచేసిన నియమావళినే 'ఎలక్షన్ కోడ్' అని పిలుస్తున్నారు.

ఎన్నికల సక్రమ నిర్వహణకు ఒక స్వతంత్ర యంత్రాంగం ఉండడం మంచిదే గానీ దాని అధికారాల క్రోడీకరణ అవసరం. ఆ క్రోడీకరణ చట్టం రూపంలో

ఉండడం, కోర్టుల పర్యవేక్షణకు లోబడి ఉండడం అవసరం. లేకపోతే పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో కీలకస్థానం గల ఎన్నికల నిర్వహణ ఒకరిద్దరు బ్యూరోక్రాట్ల అవగాహనకు బలి కాగలదు. ఉదాహరణకు ఈసారి మీకెక్కడా గోడలమీద రాతలు గానీ పోస్టర్లు గానీ బ్యానర్లు గానీ కనిపించవు. ప్రైవేట్ ఇళ్ళ గోడలమీద ఆ యింటి యజమాని అనుమతి లేకుండా రాయడానికి వీలులేదన్నది శేషన్‌గారి నియమాలలో ఉంది. అంతకుముందు ఇళ్ళు గల వాళ్ళు ఎంత అయిష్టంగా నయినా దానిని ప్రజాస్వామ్యం కోసం చేస్తున్న త్యాగంగా భావించేవారు, భరించేవారు. ఈసారి ప్రభుత్వ కార్యాలయాల గోడలమీద కూడ రాయడానికి వీలులేదన్న నియమం పెట్టారు. పోస్టర్లు, బ్యానర్లు కూడ అంతే. దీనివల్ల చిన్న పార్టీలు, స్వతంత్ర అభ్యర్థులు ఎక్కువగా నష్టపోతున్నారు. అభ్యర్థి పేరు, చిహ్నం ప్రజల మనసులకు హత్తుకోవడం చాలా అవసరం. పెద్ద పార్టీలకు రిజర్వ్ చేసిన చిహ్నాలుంటాయి, మీడియా ద్వారా ప్రచారం లభిస్తుంది. చిన్నవాటికి గోడ మీద రాతలే దిక్కు.

ఎన్నికల ప్రకటన తరువాత ప్రభుత్వం కొత్త పథకాలు ప్రకటించకూడదన్న శేషన్‌గారి కోడ్ పరిధి ఏమిటో స్పష్టంగా లేకపోవడం కూడ నష్టం కలిగిస్తున్నది. అప్పుడెప్పుడో మంజూరయి మొదటి విడత పైసలిచ్చిన 'ఇందిరమ్మ ఇళ్ళ'కు కోడ్ పేరిట రెండవ విడత పైసలియ్యడం లేదు. ఇళ్ళు సగం కట్టుకున్న జనం ఎన్నికలెప్పుడయిపోతాయా అని ఎదురుచూస్తున్నారు. 2006లోనే జైలు నుంచి బయటికి రావలసి ఉండిన జీవితఖైదీల విడుదలపైన సుప్రీంకోర్టు విధించిన స్టే ఈ జనవరిలో తొలగిపోయినా అదేదో కొత్త నిర్ణయయినట్టు కోడ్ పేరిట వారి విడుదల నిలిచిపోయింది. స్పష్టమయిన రూపురేఖలు లేని అధికారాలు ఇట్లాంటి అనర్థాలే తెచ్చిపెడతాయి.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*8 ఏప్రిల్ 2009*



# సజీవంగా ఉన్న ముఠాతత్వం



**ము**ఠా కక్షలు, ముఠా కొట్లాటల గురించి మాట్లాడితే అదేదో పాతకాలం విషయం అయినట్టు గడిచిపోయిన విషయాన్ని అనవసరంగా పదే పదే తవ్వితీసి వినోదిస్తున్నారని మీడియాపైన, విశ్లేషకులపైన విరుచుకుపడడం రాయలసీమకు చెందిన నాయకులు ఈ మధ్య నేర్చుకున్నారు. ప్రతి హత్యనూ ఫాక్షన్ హత్యగా ప్రతి కొట్లాటనూ ఫాక్షన్ కొట్లాటగా వర్ణించే మీడియా అజ్ఞానం కూడ దీనికి దోహదం చేసింది. ఫాక్షన్లు ఇప్పటికీ ఉన్నాయా అంటే మనం దానికి ఇచ్చుకునే అర్థాన్ని బట్టి ఉంటుంది. గుంపును పోగుచేసి సామాజిక పెత్తనం కోసం బలప్రయోగం చేసే దురాచారంగా మొదలయి, స్వాతంత్ర్యానంతరం రెండవ తరం నుంచి రాజకీయ, ఆర్థిక ఆధిపత్యం కోసం ముఠాలు కట్టి బలప్రయోగం చేసే విధ్వంసకర వ్యూహం రూపం తీసుకున్న సంస్కృతిగా దానిని అర్థం చేసుకుంటే అదెక్కడికీ పోలేదు. అవసరాన్ని బట్టి, ఇతర పరిస్థితులను బట్టి, దాని పద్ధతులూ పరికరాలూ మారి ఉండవచ్చు. ప్రతి చెట్టు చాటున, పుట్ట చాటున టీవీ కెమెరాలున్న ఈ రోజులలో బాంబులు పట్టుకొని తిరగడం తెలివితక్కువతనం అన్న గుర్తింపు వచ్చి ఉండవచ్చు. ప్రజలలో తెలివితేటలు పెరగడం వల్ల హింస ప్రతిసారీ చేసి చూపించవలసిన అవసరం లేకుండవచ్చు. పెరిగిన తెలివిలో భాగంగా ఆత్మసంరక్షణకు అవసరమయిన భయం కూడ పెరిగిన కారణంగా బెదిరింపుతో సగం పనులు జరిగిపోతుండవచ్చు.

మొన్నటి ఎన్నికలలో కడప, అనంతపురం జిల్లాలలో రెండు ప్రధాన పక్షాలు నడుచుకున్న తీరు మారిందేమీ లేదని మరొక్కసారి రుజువు చేసింది.. రెండు పక్షాలూ

అని నొక్కి చెప్పడం అవసరం, ఎందుకంటే దౌర్జన్యమంతా కాంగ్రెస్ వారిదే అన్న అభిప్రాయం ప్రధాన మీడియా బలంగా కలిగించింది. మీడియా అనుకూలంగా ఉండడం వల్ల చంద్రబాబునాయుడంత ప్రయోజనం పొందుతున్న నాయకుడు సమకాలీన భారత రాజకీయాలలో లేడేమో. అతని అబద్ధాలు, కప్పదాట్లు సునాయాసంగా సాగిపోతున్నాయి. ప్రస్తుత ఎన్నికలలో నోరున్న రెండు ప్రధాన రాజకీయ శక్తులను – వామపక్షాలు, తెరాస – తన వెంట తిప్పుకోవడం వల్ల అతని పని మరీ సులభం అయిపోయింది. ఉదాహరణకు రెండవ దశ పోలింగ్ జరిగిన రాత్రి, మరుసటి రోజు అనంతపురం జిల్లా తాడిపత్రిలో జరిగిన దౌర్జన్యమంతా జె.సి ప్రభాకర్‌రెడ్డి అకౌంట్‌కే జమచేయబడింది గానీ నిజానికి ఇద్దరూ యథేచ్ఛగా హింసకు పాల్పడ్డారు. ఇంకా చెప్పాలంటే మొదలుపెట్టింది తెలుగుదేశం వారే. అంతా అయిపోయిన తరువాత తూకం వేస్తే ఎక్కువ హింస చేసిందీ వారే.

అయితే ఈ తూకం దగ్గర ఆగిపోవడమే పొరపాటు అవుతుంది. ఆధిపత్య హింస కేవలం ఒక ఉదంతం కాదు, కాలక్షేపానికి వస్తువు అంతకంటే కాదు. సార్వత్రిక భయం దాని అనివార్య పర్యవసానం. రేపు తాడిపత్రిలో తెలుగుదేశం అభ్యర్థి గెలిచినా, కాంగ్రెస్ అభ్యర్థి గెలిచినా రాబోయే అయిదు సంవత్సరాలలో వారి నిర్వాకాన్ని ఆ ఊరి ప్రజలు ధైర్యంగా ప్రశ్నించగలరా? ఏప్రిల్ 24 నాటి రాళ్ళవర్షాన్ని తలచుకొని నోరు నొక్కేసుకోరా? ప్రజాస్వామ్యానికి అవసరమైన అన్ని వ్యవస్థాగతమైన లక్షణాలనూ ఆచరణ రీతులనూ ధ్వంసం చేయడం, అసాధ్యం చేయడం, భయంతో కప్పేయడం హింసాత్మక ముఠా రాజకీయాల గుణం. అదే దానివల్ల ప్రజాజీవితానికి ఉన్న ప్రధాన నష్టం.

కడప జిల్లాలో దీని ముఖచిత్రం మరింత స్పష్టంగా కనిపిస్తుంది. హింసాత్మక సంఘటనలు అనంతపురంలో ఎక్కువగా జరగడం వల్ల కడపలో ముఠా రాజకీయాలు గడిచిపోయిన కాలానికి చెందినవన్న అభిప్రాయం కలుగవచ్చును గానీ అది ముఠా రాజకీయాలను కేవలం బాంబుదాడులుగా, గృహదహనాలుగా అర్థం చేసుకోవడం వల్ల కలిగే భ్రమ. ప్రపంచజ్ఞానం, తెలివితేటలు పెరగడంవల్ల ప్రజలు 'ముందుచూపుతో' మౌనంగా తల ఒగ్గడం ప్రత్యక్ష హింస కంటే బహుశా నష్టకరమైనది. కడప జిల్లాలో మొదట పులివెందులలోనూ, కాలక్రమంలో ఇతర నియోజకవర్గాలలోనూ చెప్పుకోదగ్గ

మోతాదులో ఈ స్థితిని తీసుకురావడంలో వై.ఎస్ రాజశేఖరరెడ్డి కృతకృత్యుడయ్యాడు. పులివెందులలో సహితం చాలా గ్రామాలలో రచ్చబండ దగ్గర ప్రజలతో మాట్లాడితే వై.ఎస్‌ను వ్యతిరేకించే వాళ్ళు చాలామందే ఉన్నారన్న సంగతి అర్థమవుతుంది. అయితే ప్రత్యామ్నాయ నాయకుడు ఎదిగే పరిస్థితి లేనప్పుడు మనం వ్యతిరేకించి ఎందుకు నష్టపోవాలి అన్న ఆలోచనతో అతనికి అనుకూలంగా అయినా ఉంటారు లేదా నోరు మూసుకొనయినా ఉండిపోతారు. ఎవరికి వారు వ్యక్తిగతంగా ఒక రాజకీయ నాయకుడిని వ్యతిరేకించడానికి ప్రత్యామ్నాయ నాయకుడు ఎందుకు, అతను నిలదొక్కుకోవడం ఎందుకు అన్న ప్రశ్న రావచ్చు. రాజకీయ జీవితం ముఠాలుగా చీలిపోయి వున్న సంస్కృతిలో ఈ ఆలోచనకు తావు లేదు. బలంగా ఉన్న ముఠాలో భాగం కాకపోతే, కనీసం తటస్థంగానైనా ఉండకపోతే, మన పని ఏదీ జరగదు, ప్రభుత్వం నుంచి అందవలసినదేదీ అందదు, గ్రామ వనరులలో ఏ వాటా దక్కదు. ఇవేవీ అక్కరలేని అదృష్టవంతులకు వ్యక్తి స్వేచ్ఛ ఆచరణీయం అయి వుండ వచ్చును గానీ సాధారణ మానవులకు కాదు.

మరి ప్రత్యామ్నాయ నాయకుడెందుకు ఎదగలేదు? తెలుగుదేశం పార్టీ ఉంది, వామపక్ష పార్టీలున్నాయి, వాటి ఆసరాతో ఎదగలేడా అన్న సందేహం రావచ్చు. ఎదిగితే చంపేస్తారా ఏం అనవచ్చు. అక్కడిదాకా వస్తే ఆ పనీ చేస్తారనడానికి కావలసినన్ని దృష్టాంతాలు లేకపోలేదు గానీ, అక్కడిదాకా రాకముందే ఉక్కిరి బిక్కిరి చేసి విరమింప చేస్తారు. అతను కాంట్రాక్టరయితే అతనికి కాంట్రాక్టులు దక్కవు. అతని వ్యాపారాలు సజావుగా సాగవు. ముఠా సంస్కృతిలో ప్రభుత్వ ఉద్యోగులూ భాగమే కాబట్టి మండలాఫీసు నుంచి పోలీస్ స్టేషన్ దాకా ఎక్కడా అతని పనులు జరగవు. ప్రజలూ భాగమే కాబట్టి ఊరిలో అతని మనుషుల దైనందిన బతుకులు కూడ దుర్భరంగా తయారవుతాయి. ఇవన్నీ తట్టుకుని ఒక పరిమిత ప్రాంతంలో ప్రత్యామ్నాయంగా ఎదిగినవారు లేకపోలేదు గానీ అది చాలా కష్టం కాబట్టి పరిమితంగానే జరిగింది. ఈ స్థితి ఇతరులకు ప్రాబల్యం ఉన్న ప్రాంతాలలోనూ ఉంటుంది గానీ అక్కడ మాత్రం తనకున్న అన్ని వనరులూ అవకాశాలూ వెచ్చించి ప్రత్యామ్నాయ నాయకులను ఏరి ప్రోత్సహించడం, ఎదగడానికి సకల వసతులూ కల్పించడం, కొట్లాటలు పెట్టి ప్రత్యర్థిని లొంగదీసుకోవడం వై.ఎస్ అమలుచేసిన వ్యూహం. ఇందులో ఎప్పటికప్పుడు విజయం సాధించడం అతని సక్సెస్ వెనకున్న రహస్యం. ఇది కలిగించగల నష్టానికి తట్టుకోలేని వారు దారిలోనే దాసోహం అంటారు. ఈ ఎన్నికలలో మైదుకూరు తెలుగుదేశం

అభ్యర్థి స్వంత ఊరిలో అతని బంధువుల నుంచే కాంగ్రెస్ వారు ప్రత్యర్థులను తయారుచేసి చీలికకు బీజం వేయగా, ఆ ఊరికి కడప పార్లమెంటు అభ్యర్థిగా ఉన్న వై.ఎస్ జగన్మోహనరెడ్డి ప్రచారానికి వచ్చినప్పుడు దీనికి నిరసనగా తెలుగుదేశం వారి ప్రోద్బలంతో గ్రామస్తులంతా ఇళ్ళకు తాళాలువేసి పుణ్యక్షేత్రాలకు వెళ్ళిపోయారు. బహుశా అతని ప్రోగ్రాం జరిగితే ప్రత్యర్థులు వచ్చిన వారి అండ చూసుకొని కాలుదువ్వి గొడవ పెట్టుకుంటారన్న భయం కూడ దీనికి కారణం కావచ్చు. కానీ చివరికి పోలింగ్ జరిగేనాటికి ఊరిలో మెజారిటీ అయిన తెలుగుదేశం వారు రాజీకొచ్చి అసెంబ్లీకి తెలుగుదేశానికీ, పార్లమెంటుకు కాంగ్రెసుకూ వోట్లు వేయించారని వినికిడి. ఇది నిజమయితే వై.ఎస్ వ్యూహాలంటే ఎవరికైనా ఎంత భయమో అర్థం అవుతుంది.

ఆ ఒక్క నియోజకవర్గంలోనే కాదు ఫాక్షనిస్టులు నిలబడ్డ అన్ని నియోజకవర్గాల లోనూ ఇరు పార్టీల వైఖరీ ఒకటే. తమకు ప్రాబల్యం ఉన్న గ్రామాలకు ఇతరులు ప్రచారానికి రావడానికి వీలు లేదు. కానీ ఇతరులకు ప్రాబల్యం ఉన్న గ్రామాలకు తాము పెద్ద గుంపును తీసుకొని రచ్చచేస్తూ ప్రచారానికి పోతారు. అట్లా వచ్చిన వారి పైన ప్రత్యర్థులు గతంలో బాంబులు వేసేవారేమో గానీ ఇప్పుడు తెలివిగా తమ అనుచరులలోని స్త్రీలనూ దళితులనూ రంగంలోకి దింపి వాళ్ళచేత తిట్టిస్తున్నారు. రాళ్ళు వేయిస్తున్నారు. దెబ్బలు తింటే ఈ ప్రజలు తింటారు. ప్రత్యర్థులపైన స్త్రీని అసభ్యంగా అవమానించారనీ, దళితులను కులం పేరుపెట్టి దూషించారనీ కేసు అవుతుంది. ఈ సిగ్గుమాలిన ఎత్తుగడను కడప జిల్లాలో రెండు పార్టీలూ వాడుకున్నాయి. దురదృష్టమేమిటంటే ప్రజల ఆలోచనలు కూడ ఈ సంస్కృతిలో భాగమే. ఎవరికి ఆధిపత్యం ఉన్న గ్రామాలలో వారికి మాత్రమే స్వేచ్ఛ ఉంటుంది. ఇతరులు 'తమ' గ్రామాలకు పరిమితం కావాలి. అధికారంలో ఉన్నవారు తమ వారికి మాత్రమే చేసుకుంటారు. ఇతరులు తమ ముఠా నాయకుడు అధికారానికొచ్చేదాకా ఆగాలి. ప్రభుత్వ అధికారులు అధికారంలో ఉన్న వారి పనులే చేస్తారు తప్ప వారి ప్రత్యర్థులకు న్యాయం చేయరు. ఇవన్నీ సహజమైన విషయాలుగా, ఇవే జీవిత నియమాలుగా సగటు ప్రజలు స్వీకరిస్తున్నారు. దురదృష్టం కొద్దీ దీనిని పోగొట్టే రాజకీయ కృషి ఏదీ రాయలసీమలో లేదు. ఎవరూ చేపట్టడం లేదు. అది జరిగేంతవరకు ముఠా సంస్కృతి, రాజకీయాలలో ముఠాతత్వం వర్ధిల్లుతూనే ఉంటాయి.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*6 మే 2009*

# అదే పాలన, అదే విధ్వంసం



**ఓ**టర్ల విజ్ఞతను ప్రశ్నించకూడదనేది పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని ఒక ముఖ్యమైన మర్యాద. 'ప్రజల తీర్పును శిరసావహిస్తున్నాను' అని ఓడిపోయిన అభ్యర్థులు అంటుంటారు. శిరసావహించక వాళ్ళు చేయగలిగింది ఏమీ లేదు గానీ, 'నన్ను ఓడించి ప్రజలు తప్పు చేశారు' అనడం కొంచెం వికారంగా ఉండే మాటా వాస్తవమే. అయితే ఈ మర్యాదకు అంతకంటే అర్థమూ లేదు. ఓటర్లుగా ప్రజలు తీసుకున్న నిర్ణయం రైతులుగానో కార్మికులుగానో విద్యార్థుల తల్లిదండ్రులుగానో మరొక అవతారంలోనో వారి శ్రేయస్సుకు నష్టకరమయితే ఆ మాట అనకుండా ఉండవలసిన అవసరం లేదు.

దేశానికి ప్రస్తుతం అస్థిరమైన పరిపాలన అవసరం కాగా కాంగ్రెస్ పార్టీకి స్థిరమైన అధికారం ఇచ్చి ప్రజలు పొరబాటు చేశారు. విశ్లేషకులంతా సుస్థిర ప్రభుత్వం కావాలంటుంటే నేను ఇట్లా అంటున్నానేమని ఆశ్చర్యపోవద్దు. పత్రికలు చదివి పత్రికలలో రాసేవారి అభిప్రాయాలను ప్రామాణికంగా తీసుకోవడం కంటే పొరబాటు లేదు. ఇవాళ సుస్థిర పరిపాలన అంటే గ్లోబలైజేషన్ తప్ప వేరే ఏమీ కాదు. స్థిరమైన అధికారం కాంగ్రెస్ పార్టీకే కాదు, ఎవరికిచ్చినా వారు చేయబోయేది ఇదే. అదనంగా వేరే మంచి పనులో చెడ్డపనులో చేస్తే చేయవచ్చు. బిజెపికి ఇస్తే తెలంగాణ ఇయ్యవచ్చు, ఇంకొన్ని చోట్ల ముస్లింలనో క్రిస్టియన్లనో చంపవచ్చు. థర్డ్ ఫ్రంట్‌కో ఫోర్త్ ఫ్రంట్‌కో ఇస్తే దళిత మహిళను ప్రధాని చేయవచ్చు. వేరే కొన్ని మంచి పనులేవయినా చేయవచ్చు. కానీ స్థిరమైన అధికారం ఎవరికిచ్చినా ప్రాథమికంగా చేసేది వేగవంతమైన అభివృద్ధి

పేరిట ప్రపంచీకరణ మాత్రమే. అంతకంటే అవగాహన ఎవరికీ లేదు, ఉన్నా స్వతంత్రత లేదు. స్వతంత్రత లేదంటే అర్థం ప్రపంచ బ్యాంకో ప్రపంచ వాణిజ్య సంస్థో నెత్తిమీద కూర్చుని చేయిస్తాయని కాదు. నయా ఉదారవాదం కంటికి వికారంగా కనిపించే పద్ధతులలో పనిచేయదు. దాదాపు రెండు దశాబ్దాల కాలంలో ఒక ఆర్థిక విధాన చట్రాన్ని సకల దేశాల పాలకుల సహాయంతో ప్రపంచం మీద బిగించడం జరిగింది. దానిని తిరస్కరించే ఆలోచన ఎవరి దగ్గరా లేదు. సైద్ధాంతికంగా ఆ ఆలోచన ఉండవలసిన వామపక్ష పార్టీలకు అందుకు కావలసిన రాజకీయ ఆచరణ ఏ కోశానా లేదు.

కేంద్రంలో అస్థిరమైన కూటములు అధికారంలో ఉండడం ఒక్కటే మనల్ని కొంతమేరకయినా బతికించింది. ఇప్పుడు ఆ స్థితి పోవడం దురదృష్టకరం. పాశ్చాత్య దేశాలను కుదిపేస్తున్న ఆర్థిక మాంద్యం ప్రభావం మనమీద మరీ ఎక్కువ పడక పోవడానికి భారత ఆర్థిక వ్యవస్థ స్వతహాగా బలంగా ఉండడం కారణమనీ, మన పాలకుల విజ్ఞత కారణమనీ మనకు చెప్తున్నారు గానీ అదేదీ కాదు. మన్మోహన్‌సింగ్, చిదంబరం బాపతు ఆర్థికవేత్తల విజ్ఞతకు స్వేచ్ఛ ఉండి ఉంటే దేశ ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాలలో 'డీ రెగ్యులేషన్' ఇంకా చాలా దూరంపోయి ఉండేది. సంక్షోభం యావత్తూ దిగుమతి అయివుండేది. వారికి దేశీయంగా ఆ స్వేచ్ఛ సంపూర్ణంగా లేకపోవడమే మనల్ని ఈ మేరకు కాపాడింది. ఇప్పుడా స్వేచ్ఛ లభించిందని మొన్నటి సోమవారం నాడు సెన్సెక్స్ ప్రకటించింది. దీని ఫలితాన్ని రాబోయే అయిదేళ్ళలో అనుభవించబోతాం.

రాష్ట్రంలో రాజశేఖరరెడ్డికి స్వంతంగా అధికారం ఇవ్వడమూ పెద్ద పొరబాటే. అతని పరిపాలనను 'అవినీతి'తో సమానం చేసిన చంద్రబాబు, రాజకీయ సమీకరణలో భాగంగా సీట్లే కాదు, అవగాహన కూడ పంచుకోవాలని నమ్మే స్థితికి వచ్చిన వామపక్షాలు అతని పాలనపై పెట్టగల విమర్శను బలహీనం చేశారు. 'అవినీతి ఎట్లాగూ ఉండేదే, అభివృద్ధి చేస్తున్నాడు కదా' అనే అతి తెలివి సమాధానానికి వారి విమర్శ తావు ఇచ్చింది. అతను చేస్తున్న అభివృద్ధే విధ్వంసం అనే విమర్శ వినబడకుండ పోయింది. అసలే మనకు రాజకీయ సంవాదం అంటే రొద, చర్చ అంటే రచ్చ. దీనికి అవగాహనా లోపమూ తోడయి రాజశేఖరరెడ్డి పాలనను ఎందుకు వ్యతిరేకించాలన్న ప్రశ్నకు సరయిన సమాధానం ప్రజలకు వినిపించకుండానే ఎన్నికలు జరిగిపోయాయి.

ఆ విధ్వంసం జీవితాల విధ్వంసమే కాదు. విలువల విధ్వంసం కూడ. మొదటి దాని గురించి ఎంత ఆందోళన చెందుతామో రెండవ దాని గురించి కూడ అంతే చెందాలి గానీ 'విలువల విధ్వంసం రాజకీయాలలో కొత్తా, ఎవరు ధ్వంసం చేయలేదు' అన్న మరొక అతి తెలివి జవాబు దగ్గరే అదీ ఆగిపోయింది. రాజకీయ స్వార్థం, అవకాశవాదం చేసే విలువల విధ్వంసం వేరు, ఫాక్షనిస్టు చేసే విధ్వంసం వేరు. కేవలం రాశిలోనే కాదు, గుణంలోనూ వేరు. నీ ప్రయోజనమే చూసుకుంటున్నావు నువ్వు అంటే ఫాక్షనిస్టు సిగ్గుపడడు, గర్వపడతాడు. అదే కదా చేయవలసింది అనుకుంటాడు. ఆ భావం రాజశేఖరరెడ్డి ముఖంలో తెలుగు ప్రజలు ఎన్నిసార్లు చూడలేదు? అధికార కార్యక్రమంలో నీ కొడుకును పక్కనెందుకు కూర్చో బెట్టుకున్నావు అని అడిగినా, రాష్ట్రంలోని వివిధ జిల్లాలలో కొత్త విశ్వవిద్యాలయాలు ప్రకటించి నీ జిల్లాలోని యోగి వేమన విశ్వవిద్యాలయానికి మాత్రమే హుటాహుటిన నిధులు విడుదల చేయడం ఏం న్యాయం అని అడిగినా, పులివెందుల వైపుగా పోయేదయితే చాలు అది మేకలు తిరిగే రోడ్డయినా నాలుగు లేన్ల రహదారి నిర్మించడమేమిటని అడిగినా, కృష్ణానదిపై ఉన్న ఎనిమిది మిగులు జలాల ప్రాజెక్టులలోకీ నీ జిల్లాకు నీళ్ళిచ్చే వాటి కోసమే ప్రత్యేకమైన నీటి భద్రత కల్పించుకోవడం ఏ రకంగా సబబని అడిగినా అదే తిరస్కారం, అవే హావభావాలు.

అయిదేళ్ళు దీనిని అనుభవించాము. ఇంకొక అయిదేళ్ళు కూడ అనుభవించి నట్టయితే ఆ తరువాత వచ్చే ముఖ్యమంత్రికి అనుసరించడానికి ఇవి తప్ప వేరే పాలనా ప్రమాణాలేవీ ఉండవు. ఇదే సహజమని భావించే స్థితికి రాష్ట్ర రాజకీయాలు చేరుకోగలవు. ఇది వినాశకరం. విలువలు, ప్రమాణాలు ప్రజాస్వామ్యానికి ప్రాణం వంటివి. అవి నాశనం అయితే మిగిలేది డొల్లే. ఎన్నికలు, ఇతర ప్రజాస్వామ్య వ్యవస్థలు ఉన్నట్టే ఉంటాయి గానీ మిగిలేది ముఠాపాలనే. దాని నుంచి ఈ రాష్ట్రం కోలుకోవడానికి చాలాకాలం పడుతుంది. 'వోటర్లు' అనే వారికి సమష్టిగా ఒక బుద్ధిని ఆపాదించేటట్టయితే, రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి స్వంతంగా అధికారం కట్టబెట్టి రాష్ట్రం నుంచి అత్యధిక సంఖ్యలో పార్లమెంటుకు సభ్యులను పంపటమే కాక, ఇక్కడ కాంగ్రెస్‌లో ఇతర ప్రముఖులు చాలామందిని ఓడగొట్టడం ద్వారా రాజశేఖరరెడ్డి బలాన్ని విపరీతంగా పెంచడంలో వోటర్లు బుద్ధిహీనతను ప్రదర్శించారని (క్షమాపణ కోరుతూ) అనవలసి ఉంటుంది.

తెలుగుదేశం పార్టీకి కూడ దాని పట్ల అభ్యంతరం లేని కారణంగా, వామపక్షాలకు స్వంత అజెండా లేని కారణంగా భౌతిక విధ్వంసానికి సంబంధించిన చర్చ ప్రధాన రాజకీయ సంవాదం నుంచి పక్కకు పోవడమే కాక దానికి వెలుపల కూడ దురదృష్టవశాత్తు విభిన్నంగా చీలి సాగుతున్నది. కోస్తాంధ్రలో ఇది అభివృద్ధేనేమోనన్న సందేహం, రాయలసీమలో మంచయినా చెడయినా 'మనవాడు' చేస్తున్నాడు కాబట్టి మాట్లాడకూడదేమోనన్న తటపటాయింపు, తెలంగాణలో ఇది తమ ప్రాంతం పైన దాడి అనే అభిప్రాయం ఈ చర్చకూ, దాని నుంచి పుట్టవలసిన వ్యతిరేకతకూ స్పష్టత లేకుండా చేస్తున్నాయి. ఇందులో మానవాళి మనుగడపై కార్పొరేట్ ప్రయోజనాలు చేస్తున్న దాడే తప్ప నిజమయిన ఏ అర్థంలోనూ అభివృద్ధి లేదు... ఇది చేసేవాడు అంబానీకో జిందాల్‌కో రతన్ టాటాకో 'మనవాడు' అయి ఉండవచ్చును గానీ మనకెవరికీ మనవాడు కాదు. మనిషి పట్లనే తప్ప ఇందులో ఏ ప్రాంతం పట్లా ఏ సమాజం పట్లా ప్రత్యేకమైన వివక్షా లేదు.

ఎన్నికల కారణంగా ఈ విధ్వంసానికి తాత్కాలికంగా బ్రేక్ పడింది. కాంగ్రెస్ గెలిచినా, తెలుగుదేశం కూటమి గెలిచినా పూర్తి అధికారం రాకుండా ఏ ప్రజారాజ్యం మీదనో, స్వతంత్రుల మీదనో ఆధారపడిన అస్థిర ప్రభుత్వం నెలకొనివుంటే ఈ బ్రేక్ కొంతమేరకు కొనసాగే అవకాశం ఉండేదేమో! ఇప్పుడది లేదు. ఎన్నికలకు ముందు శ్రీకాకుళం రహదార్లలో తిరుగుతూ కోస్టల్ కారిడార్ అనేదేదీ లేదనీ, కేవలం రోడ్ల వెడల్పు కార్యక్రమం మాత్రమే తీసుకున్నామనీ రాజశేఖరరెడ్డి ఒక అబద్ధపు ప్రకటన చేశాడు. నిజానికి అప్పటికే గుంటూరు, ప్రకాశం జిల్లాల 'వాన్‌పిక్' ప్రాజెక్టు ప్రాంతంలో 'పారిశ్రామిక కారిడార్' కోసం అని స్పష్టంగా రాస్తూ భూసేకరణ నోటిఫికేషన్లు జారీచేసి ఉన్నారు. జీవో నెంబర్ 373 ద్వారా విశాఖపట్నం కేంద్రంగా ఒక స్పెషల్ డెవలప్‌మెంట్ అథారిటీని నెలకొల్పి 110 గ్రామాలను అభివృద్ధి కోసం దానికి అప్పగించి ఉన్నారు. అయినా ఎన్నికల కోసం ఆ అబద్ధం అవసరం అయింది కాబట్టి, అవసరమయిన అబద్ధాలు ఆడడానికి ఏ నియమాలూ అడ్డం రాని మనిషి కాబట్టి ఆ అబద్ధం ఆడడం జరిగింది. ఇప్పుడింక ఇదంతా మీ అభివృద్ధి కోసమేనన్న ఒకే ఒక్క అబద్ధం తప్ప వేరే ఏవీ అవసరం ఉండవు. ఆగిన విధ్వంసమంతా మళ్ళీ మొదలవుతుంది.

కాకినాడ నుంచి ఆదిలాబాద్ జిల్లా బొగ్గు బావుల ప్రాంతం దాకా తమ ఉద్యమ బలంతో దీనిని ఇప్పటిదాకా నిలువరించిన ప్రజలు ఉన్నారు. కనీసం వారు సాధించినదయినా వెనక్కి పోకుండా ఉండాలంటే చీలికలయిన విమర్శనూ నిరసననూ ఒక తాటిమీదకు తెచ్చి నిరంతరాయంగా ప్రతిఘటించడం అవసరం. ప్రతిపక్షాలు పని చేస్తాయన్న నమ్మకం ఎట్లాగూ లేదు. ప్రజా ఉద్యమాలూ చేయకపోతే భవిష్యత్తు భయంకరంగా ఉండగలదు.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*3 జూన్ 2009*



Ennikalu Prajaswamyam
K. Balagopal

‘ ఇప్పుడు కావలసింది మన ప్రజాస్వామ్య వ్యవస్థలోని అసమగ్రతనూ అపరిపక్వతనూ పోగొట్టే కృషి. దానికి లోతయిన వికేంద్రీకరణ వంటి వ్యవస్థాగత సంస్కరణలు ఎంత అవసరమో, సామాజిక చైతన్యంలో దానికి తగిన విలువలనూ, ఆలోచనలనూ పెంపొందించడానికి కృషి చేయడం కూడ అంతే అవసరం. ఇక్కడ ‘మేధావి వర్గం’ అని పిలవబడే బుద్ధిజీవుల వైఫల్యం, ప్రసార సాధనాల వైఫల్యం చాలా ఉంది. ప్రజాస్వామ్యాన్ని వీరు వాడుకున్నంతగా ఎవరూ వాడుకోలేదు. అది వీరికి అందుబాట్లో ఉన్నంతగా వేరే ఎవరికీ లేదు. కానీ దానిని బలోపేతం చేయడానికి వీరు చేస్తున్న కృషి మాత్రం స్వల్పం. దాని బదులు ప్రజాస్వామ్యాన్ని బలహీనపరిచే ప్రతిపాదనలను వెనకేసుకొచ్చేవారు కొందరయితే, ప్రజాస్వామ్యాన్ని ధ్వంసం చేస్తున్న రాజకీయ పార్టీలకూ నాయకులకూ అందమయిన రంగులు పూసి దాని విధ్వంసానికి తోడ్పడే వారు మరికొందరు. ప్రజాస్వామ్యాన్ని వాడుకోవడమే తప్ప దానికి బలం చేకూర్చే కర్తవ్యం తమది కాదని ఈ దేశంలో అందరూ అనుకుంటున్నారు. ఈ విషయంలో అందరి కంటే ఎక్కువ బాధ్యత బుద్ధిజీవులు, పత్రికలు, ప్రసార సాధనాలపై పెట్టక తప్పదు. ’

₹ 80/-

మానవహక్కుల వేదిక ప్రచురణ